# వేమన్న - సర్వజ్ఞులు

(తులనాత్మక పరిశీలన)

VEMANNA_SARVAJNULU

డా. గంధం అప్పారావు

PROFESSOR & HEAD OF THE
DEPT. OF TELUGU.
UNIVERSITY OF MADRAS.

ప్రగతిశీల సాహిత్యము

(తృతీయ పుష్పము)

1

గంధబంధుర వంశంబు ఘనతకెక్కె
నీవు పుట్టుటచేత నో నిర్మలాత్మ
పౌరుష జ్ఞాన కీర్తులఁ బడసినట్టి
ధన్యజీవివి నా తండ్రి! మాన్యచరిత!

2

ప్రగతిశీల సాహిత్యపుఁ బరిమళముతో
హృదయమున కెంతో యానంద మొదవఁజేయు
పుష్పరాజ తృతీయ మో పుణ్యమూర్తి
అర్పితముఁ జేసి తలఁతు నిన్నహరహమ్ము.

# విషయసూచిక

# గంధం

"వివిధ దేశీయ భాషా సాహిత్య సంప్రదాయ సంస్కృతులలో సమైక్య భావము తీసికొనిరావలెను. ఇదియే దేశ సమైక్యతకు అత్యంత ప్రధాన సాధనము" అన్నారు ఆచార్య అప్పారావుగారు. ఈ సదభిప్రాయమే వీరిని ఈ గ్రంథం "వేమన్న-సర్వజ్ఞుడు" రాయడానికి ప్రేరేపించింది.

వేమన్న తెలుగు సర్వజ్ఞుడు. సర్వజ్ఞుడు కన్నడ వేమన్న. ఈ ఇద్దరి తీరు తెన్నులు అలాంటివి. విచిత్రమైన సంఘటన ఇది. ఇద్దరూ ప్రజా కవులే, ప్రగతిశీలులే. ఉత్తమ సంఘసంస్కర్తలే, సదుపదేశికులే. ఇద్దరూ కుల మత మూఢవిశ్వాసాలను ఖండించినవారే. దురాచారాలను దుయ్యబట్టినవారే.

ఈ ఇద్దరినిగూర్చి తులనాత్మకమైన పరిశోధనచేసి మనకు చక్కని గ్రంథం అందించిన అప్పారావుగారు అభినందనీయులు.

వేమన్న సర్వజ్ఞుల దేశకాలాదులు నిర్ణయించడంలోనూ, వారి పుట్టు పూర్వోత్తరాలూ జీవితవిశేషాలూ వివరించడంలోనూ, వారి తాత్త్వికసిద్ధాంతాలూ కవితా మాధుర్యాలూ ఎత్తిచూపడంలోనూ, ప్రగతివాదులుగా మహాకవులుగా వారిని నిరూపించడంలోనూ ఆచార్య అప్పారావుగారు చూపిన వైదుష్యం, చేసిన పరిశోధనా ఎంతైనా మెచ్చదగినవి.

తెలుగులో వేమన్ననూ, కన్నడంలో సర్వజ్ఞుణ్ణీ స్వార్థపరులైన సంప్రదాయవాదులు కవులలో స్థానం లేకండా కుతంత్రాలు పన్నారు. వీటిని తీవ్రంగా నిరసించి వేమన్నా, సర్వజ్ఞుడూ మహాకవులని సోదాహరణంగా నిరూపించారు గంధంవారు.

"వేమన్న ప్రతిభాశాలియైన గొప్ప ప్రజాకవి. ఈతని కవిత్వమున నెందు తడివిన నందు మరందము చిందినట్లు రమణీయార్థములతోను, నిదర్శనములతోను నిండియుండును. అలతి అలతి పలుకులతో నత్యంత గంభీరములగు విషయములను చెప్పు నేర్పులో తిక్కన తర్వాత ఈతనినే చెప్పవలయును"

అని చాటి చెప్పారు అప్పారావుగారు. ఇలాగే తెలుగులో వేమన్న ఎంత గొప్పకవో, కన్నడంలో సర్వజ్ఞుడు అంత గొప్పకవి అని నిదర్శనాలతో నిరూపించారు.

ఇటు వేమన్న తెలుగులోనూ, అటు సర్వజ్ఞుడు కన్నడంలోనూ వాడిన అలంకారాలు ఎత్తిచూపుతూ ఉపమలో వేమన్న కాళిదాసంతవా డన్నభావం కలిగిస్తారు.

వేమన్నా, సర్వజ్ఞుడూ సమకాలికులు కారు. అయినా వాళ్ళిద్దరూ కలిసి, కలబోసుకుని కవిత్వం రాశారా అన్న భ్రమ కలుగుతుంది వారి రచనలు కలిపి చదివితే అక్కడక్కడ. ప్రొ. అప్పారావుగారు కొన్ని పోలిక పద్యాలు ఉటంకించి మంచిపని చేశారు. చూ. పు. 135-144. ఈ పోలికపద్యాలలో కొన్ని దేనికేది అనువాదమో అనిపిస్తుంది.

గ్రంథం తుదిభాగంలో తిరువళ్లువరు గురించికూడా వివరించారు రచయిత. తిరువళ్లువరు వేమనవంటి తమిళకవి. క్రీస్తుముందు రెండో శతాబ్ది కవి. తరువాత హిందీకవి కబీరు కథకూడా వివరించారు. ఈ చివరి ఇద్దరి వృత్తాంతాలు గ్రంథానికి మరింత వన్నె కల్పించాయి.

ప్రొఫెసర్ గంధం అప్పారావుగారు మనసు కలిపిన మిత్రుడు. ఉత్సాహవంతులు. సరళహృదయులు. వీరి హృదయానికి ప్రతిబింబమే వీరిరచన. వేమన్నా సర్వజ్ఞులలాగే అప్పారావుగారుకూడా కుల మత మూఢ విశ్వాసాలు తీవ్రంగా నిరసించే సమతావాది; ప్రగతివాది. వీరి ఈ గ్రంథం చదివి ఎంతో ఆనందించాను. ఈ గ్రంథంవల్ల తెలుగు - కన్నడముల సన్నిహితత్వం ఇంకా దృఢపడుతుందనీ, ప్రజలలో ఒక నూతనచైతన్యం కలుగుతుందనీ రచయిత శ్రీ అప్పారావుగారితోపాటు నేనుకూడా ఆశిస్తున్నాను.

విశాఖ
11-8-'78

పురిపండా అప్పలస్వామి.

# PREFACE

It was twenty years ago that a desire first arose in me to undertake a comparative study of the twin poets Vemana, Sarvajna. My study of Kannada as a related language for my M. A Degree has proved very useful in the realisation of my object. Above all, it was my good fortune that Karnatak University afforded me the opportunity of working as a non-stipendiary research scholar. And I was doubly fortunate in having Dr. R. C. Hiremath, Professor and Head of the Department of Kannada, as my guide. These factors have facilitated the completion of my project, and I am extremely happy that my wish has now been fulfilled.

It is a well-known fact that the two Dravidian Languages, Telugu and Kannada, have close affinity. And the fact that there are similarities between Vemana and Sarvajna is so widely accepted that I need hardly mention it. Research into the lives and writings of those great twin poets will, undoubtedly, bring them closer, and strengthen further the literary, linguistic and cultural relationships between the Andhras and the Kannadigas. The necessity and importance of such research at the present juncture can hardly be over-estimated.

The object of my research has also been to show Vemana as a Progressive poet and rationalist. On account of the very many spurious verses contained in collections of Vemana's verses, people have mistakenly believed that Vemana was a rake in his youth and a saint and mystic in his later years. I have tried to reveal the real Vemana by means of a close study of his genuine verses, which beyond all doubt show him to us as a great practical philosopher and rationalist thinker.

What happened in regard to Vemana happened also in the case of Sarvajna, though with some difference. Sarvajna was even called a 'Kalājnāni'. My

aim is to show to the readers the real Sarvajna by a discussion of his ideals in life and his philosophical principles. I am afraid that among the stanzas of Vemana that have been cited, there are a few which seem to be somewhat different from the typically Vemana stanzas from the point of view of idiom and diction, but they seem to reflect truly Vemana's thought and philosophy.

I shall ever remain grateful to the helpful and very easily approachable Dr. R. C. Hiremath, who, as my guide, gave me invaluable guidance in my research at every step and helped me to complete my thesis.

I must acknowledge here with reverence and gratitude the inestimable help that I received from Prof. Mariappa Bhat throughout my research. He was not only a second guide in my research but he has been a guide and philosopher in all my life. His erudition, his profound knowledge of the various branches of literature, his worldly wisdom, his fair-mindedness, and, above all, his affectionate heart have made me an ardent disciple of his.

I am deeply indebted to the authorities of the Karnatak University for having provided me with the facilities needed for my research.

My thanks are also due to Sri Bulusu Venkataramanayya, an eminent scholar and a great well-wisher of mine, for his excellent reading of the Telugu proofs.

I offer my sincerest thanks to Dr. Puripanda, a progressive thinker and writer, who has been good enough to give his opinion about my book. I value his scholarly appreciation.

I can never forget the great help that Dr. S. Jayadev Babu of Sir Theagaraya College has rendered me by designing a beautiful jacket for my book.

Madras,
14-3-1979

GANDHAM APPA RAO.

# ఉపోద్ఘాతము

ఎవరి మాతృభాషయందు వారికి గాఢాభిమానముండుటలో ఏ దోషములేదు. కాని అది దురభిమానముగా మాత్రము రూపొందరాదు. ఎదుటివారిని అర్థము చేసికొనుట, తన్నెదుటివారు అర్థము చేసికొనునట్లు బుద్ధివిశేషము నుపయోగించుట, సహనము, విశాలదృష్టి మొదలగునవి సంస్కారభావుని ముఖ్యలక్షణములు. "దేశైక్యము", "జాతీయైక్యము" అని వట్టి కేకలు వేసినంత మాత్రమున ప్రయోజనము లేదు. గట్టి పనులు తలపెట్టవలయును. మొదట దేశమున జాతీయ సమైక్య భావమును పటిష్ఠము చేయవలయును. అనగా వివిధ దేశీయ భాషా సాహిత్య సంప్రదాయ సంస్కృతులలో సమైక్య భావము తీసికొని రావలెను. ఇదియే దేశ సమైక్యమునకు అత్యంత ప్రధాన సాధనము. పదునాలుగు భారత జాతీయ భాషలలో సమైక్య భావమును పెంపొందింపజేయుటకు ప్రతిదేశ భక్తుడు నత్యంతము కృషి చేయవలెను.

ఇతర సాహిత్య సంప్రదాయ సంస్కృతులలోని గొప్పదనమును పరిగణించిననాడే తన గొప్పదనము ప్రకాశించును. ఒకరిని గౌరవించునాడే కదా తన గౌరవము ఇనుమడించును! ఇట్టి పరస్పర గౌరవ ప్రేమాభిమానముల వలననే మనకు నిజమైన జాతీయభావము సిద్ధించును. అప్పుడే మనము భిన్నత్వములో ఏకత్వము సాధింపగలము.

తెలుగు కన్నడముల సంబంధము సహజమైనది. ఈ రెండు భాషలు ఒకేగర్భమున పుట్టిన కవలపిల్లల వంటివని చెప్పవలయును. నైసర్గికముగాను, రాజకీయముగాను, సాంఘికముగాను, మత ప్రచార విషయములోను, వాఙ్మయ రచనా విధానములోను ఈ రెండు భాషలు అత్యంత సన్నిహిత సంబంధము కలిగియున్నవి. ముద్రణా యంత్రములు వచ్చువఱకు ఈ రెండు భాషలకు లిపి ఏకరీతిగా నుండెడిది.

తెలుగులో ఆదికవియైన నన్నయపై కన్నడమున ఆది కవియైన పంపని ప్రభావము కలదు. కర్ణాటాంధ్ర దేశములను ఏకచ్ఛత్రముగా నేలిన విజయనగర [illegible] విచ్ఛిన్నమై తెలుగు నాయక రాజులు తమిళ ప్రాంతములను పాలించునంత వఱకు తెలుగు కన్నడ కవి పండితులు పరస్పర సహకార భావములతో వారి భాషా సాహిత్యములను సంతరించుచుండెడివారు. సంస్కృత కావ్యములందు లేని అవతారికా విస్తరణము, ఆశ్వాస విభజనము, సప్తసంతాన ప్రస్తావనము, షష్ఠ్యంత కారకము మొదలగునవి కన్నడ కావ్యములనుండి తెలుగు కావ్యములలోనికి ప్రవేశించినవి. ఈ సంప్రదాయముల నన్నిటిని నన్నయ, నన్నెచోడుడు మొదలగువారు తెలుగు సాహిత్యమునందు ప్రవేశపెట్టిరి. పంపని కవిత్వము సంస్కృత పద బహుళమైనను ప్రసాద గాంభీర్య, మాధుర్య గుణములు కలది. ఆ మహాకవి భావములలోని గాంభీర్యమును, ప్రసన్నతను నన్నయ పుణికి పుచ్చుకొనెను. పెక్కుచోట్ల నన్నయ పంపని "విక్రమార్జున విజయము"ను నూటికి నూరుపాళ్లు అనుకరించెను.

నన్నయ సహాధ్యాయియైన నారాయణభట్టు తెలుగులోను, కన్నడములోను కూడ కవిత్వము చెప్పియున్నట్లు మనకు నందంపూడి శాసనమే ప్రమాణము. ఆంధ్రుడైన పొన్నడు కన్నడ కవిత్వము నేర్చి "శాంతి పురాణము" వ్రాసెను. తెలుగులో మల్లియ రేచన రచించిన "కవిజనాశ్రయ"మను ఛందోలక్షణ గ్రంథమునకు మూలమనదగిన "కన్నడ చ్ఛందోంబుధి"ని వ్రాసిన లాక్షణిక చక్రవర్తి నాగవర్మకూడ తెలుగువాడు.

నన్నయ విడిచిపెట్టిన షష్ఠ్యంత రచనా సంప్రదాయమును ప్రారంభించుటతోపాటు నన్నెచోడుడు కన్నడ శబ్దములను, భాషా సంప్రదాయములను తెనుగున కందించెను. ఇక కన్నడాంధ్రములందు కవనమల్లిన పండితారాధ్యుడు కన్నడమునను, తెలుగునందును "శివతత్త్వసారము"ను కందపద్యములలో నందించెను.

అపర శైవావతారమని కీర్తికెక్కిన పాల్కురికి సోమనాథుడు ఆంధ్ర కర్ణాటకులకు ఆరాధ్యుడయ్యెను. వీరశైవ మీతని కవిత్వమున విప్లవగీతము పాడినది. గుబ్బియ మల్లనార్యుడు మొదలగు కన్నడకవు లీయనను మిక్కిలి ప్రస్తుతించిరి. తిక్కన భారతము ననుసరించి కుమార వ్యాసకవి కన్నడమున భారత భాగమును రచించెను. సోమనాథుని బసవపురాణము నాదర్శముగా దీసికొని పదునాల్గవ శతాబ్దిని కన్నడమున భీమకవి షట్పది కావ్యముగా బసవపురాణమును రచించెను. నాచన సోమనాథుని "ఉత్తర హరివంశము"న, ధూర్జటి "కాళహస్తీశ్వర మాహాత్మ్యము"న కన్నడ ప్రయోగములు కోకొల్లలు. కవిసార్వభౌముడగు శ్రీనాథుడు "తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీనాథుండన్" అని చెప్పిన పద్యపాదమును "నా కవిత్వంబు నిజము కర్ణాట భాష" అని భీమేశ్వర పురాణమునందు చెప్పిన పద్యపాదమును పరిశీలించి చూడగా కన్నడ రాజ్యలక్ష్మితోను, కన్నడ సాహిత్య సరస్వతితోను తెలుగువారికి గల సంబంధము విశదమగుచున్నది. ఆంధ్రభోజుడైన శ్రీకృష్ణదేవరాయలు తుళువ వంశజుడను మాట మఱువరాదు. పదునేడవ శతాబ్దియందు లక్ష్మీశుడను కన్నడ కవి శ్రీనాథ, రామరాజభూషణుల కవితారీతుల ననుకరించెను. ఈ విధముగ తెలుగు కన్నడముల సంబంధము అవిభాజ్యమై వెలయుచున్నది. అందువలన తెలుగువారు కన్నడిగులను గూర్చియు, కన్నడిగులు తెలుగువారిని గూర్చియు తెలిసికొనవలసిన యావశ్యకత యెంతయేని కలదు.*

---

* (1) "కన్నడాంధ్రముల పరస్పర ప్రభావము"

—ఆచార్య నిడుదవోలు వేంకటరావు.

ఈ గ్రంథమున నీ విషయమై సంపూర్ణ వివరములు గలవు.

(2) "తెలుగు కన్నడ భాషల పరస్పర సంబంధం"

—శ్రీ పుటపర్తి నారాయణాచార్యులు.

(తెలుగువాణి-ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక—పుట. 122).

తెలుగున "వేమన్న"యు, కన్నడమున "సర్వజ్ఞుడు"ను ఇరువురు ఒకరికొకరు అనేక విషయములలో నచ్చుపు ప్రతిబింబములు. ఇరువురును ఉత్తమ సంఘ సంస్కర్తలే. ఇరువురును దేశీయ చ్ఛందమును చేపట్టి సామాన్య ప్రజల భాషలో కావ్యరచన సాగించిన ప్రగతి వాదులు. మానవాభ్యుదయమునకు తమ కావ్య కుసుమములను తోరణముగట్టిన మహానుభావులు. సాంఘిక న్యాయము కొఱకు, మూఢ విశ్వాసములనుండి ప్రజలు ముక్తి గాంచుటకు, మతమనుపేర వేషగాండ్రుచేయు మోసములను ఖండించుటకు, బాధ్యతాయుత నైతిక జీవన సంపత్తికొఱకును ఈ శేముషీ ధురంధరులు చేసిన కృషి వేనోళ్ల కొనియాడదగినది. ఈ కవి సోదరులగూర్చి తెలిసికొనవలసిన ఆవశ్యకత ఎంతయేని కలదు. దీనివలన మన తెలుగు కన్నడముల సన్నిహితత్వము మఱింత దృఢమగును. భాషాభేదములతో, ప్రాంతీయ దురభిమానములతో సతమతమగుచున్న ఈ రోజులలో ఇట్టి తులనాత్మక పరిశీలన (Comparitive Study) యొక్క ఉపయోగము ఇంతింతని చెప్పుటకు వీలులేదు. మొదటనే నేను చెప్పినట్లు ఒకరినొకరు అర్థము చేసికొనుటయే గదా నిజమైన సంస్కృతి! ఇదియే నా పరిశోధనయొక్క పరమాశయము.

ఈ నాకృషి యీ మార్గములో సుదూరము పయనించి ప్రజలలో నొక నూతన చైతన్యమును కలిగించిన నేను ధన్యుడ నగుదును.

మద్రాసు,
8-8-1978 }

గంధం. అప్పారావు.

ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున వేమన సాటిలేని మహా వ్యక్తి. తెలుగు దేశమున ఈ తేజోమూర్తిపేరు విననివారు గాని, ఈతని పద్యములు చదువని అక్షరాస్యులు కాని లేరని చెప్పుటలో రవంతైన నతిశయోక్తి లేదు. ఆంధ్రభూమిని ఎందరో కవులు, సంఘ సంస్కర్తలు, పండితులు, తార్కికులు, విమర్శకులు పుట్టిరి. కాని ఇట్టి ప్రగతిశీలుని, ఇట్టి ఉత్తమ సంఘసంస్కర్తను, ఇట్టి సదుపదేశకుని, మానవ జీవితములోని నిగూఢ రహస్యముల నెఱింగిన మన స్తత్త్వ శాస్త్రజ్ఞుని ఇంకొకని గానము. పండితులనక, పామరులనక, బాలురనక, వృద్ధులనక, స్త్రీలనక అందఱికి అనేక విధముల ఉపకరించి, అఖిలాంధ్ర ప్రజాహృదయమును చూఱగొనిన ఏకైక ప్రజాకవి వేమన. ఈ మహానుభావుని గూర్చి కవి చౌడప్ప చెప్పిన ఈ పద్యమే దీనికి చక్కని నిదర్శనము.

"వానను దడియని వారును
పూనుక వేమన్న చేతఁ బొరయనివారుఁ
నానాదిక్కుల వెదకినఁ
గానమురా యెంతవానిఁ గవిచౌడప్పా!"

వేమన్నను చాలకాలము వఱకు మన పండితులు, మన సంప్రదాయ భక్తులు ఒక కవిగా గుర్తింపకపోవుట శోచనీయమైన విషయము. తుదకు నవ్యాంధ్ర వాఙ్మయ బ్రహ్మవంటి వారగు శ్రీ వీరేశలింగము కూడ ఇతనిని కవిగా గుర్తింపకపోవుటకంటె విచారకరమైన విషయ మింకొకటి లేదు. ఇతర సంప్రదాయ భక్తుల వలె ఇతడుకూడ సంఘ విమర్శన, సరసోపదేశము, నీతి బోధ కవిత్వము గాదని భావించెనేమో! దీనినిబట్టి చూడ సంప్రదాయ విశ్వాసములు ఎంత బలమైనవో గ్రహింపనగును.

పాశ్చాత్య పండితులైన మేజర్ శ్రీ ఆర్. ఎం. మ్యాక్ డొనాల్డు, శ్రీ హావర్డు క్యాంబెల్, శ్రీ జె. ఎ. దూబాయ్, శ్రీ ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ మొదలగు సహృదయులు, సంస్కార భావులు ఈ ప్రజాకవిలోని గొప్పతనమును గ్రహించి, ఇతని కీర్తిని మొదట ఉద్ధరించుటకు కొంత కృషి చేసిరి. వీరందరిలో ముఖ్యముగా బ్రౌను మహాశయుడు ఆంధ్రదేశము నలుమూలల పెక్కు వ్రాత ప్రతులను తెప్పించి, అనేక పద్యములను ఆంగ్లములోనికి అనువదించి, వేమనను తొలుత పాశ్చాత్యులకు విశేషముగా పరిచయము చేసినవాడు. ఈ సహృదయాగ్రగణ్యునకు ఆంధ్ర ప్రజలు సర్వదా కృతజ్ఞులు.

తరువాత విమర్శక శేఖరులు, బహుముఖ ప్రజ్ఞావంతులు నైన డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ "కవిత్వ తత్త్వ విచారము" అను గ్రంథములో ఇతనిని మహాకవి యని చెప్పి ఇతనిలోని ప్రత్యేకతను వివరించిరి.* దానితో ఆంధ్ర కవి పండిత లోకమున ఒక సంచలన మేర్పడెను. పలువురు పండితులు ఈతని గూర్చి వ్రాయ నారంభించిరి. క్రీ. శ. 1922 లో కీ. శే. శ్రీ వంగూరి సుబ్బారావుగారు తొలుత వేమన్న చరిత్ర రచించి 1942 లో తమ 'శతక కవుల చరిత్రము' న వేమనకు తెలుగున గల యున్నత స్థానమును నిరూపించిరి.

వేమన్న ఏ శతాబ్దమున నుండినదియు, అతడు పుట్టిన స్థలము, కులము మొదలగువాని గూర్చియు మన చరిత్రకారులు, పండితులు సత్యనిర్ధారణము చేయలేకపోవుట ఇంకొక విచారకరమైన విషయము. ఇతడు 17-వ శతాబ్దమువాడని బ్రౌను మహాశయుడు, 16-వ శతాబ్దమువాడని శ్రీ క్యాంబెల్, 18-వ శతాబ్దము వాడని శ్రీ మ్యాక్ డొనాల్డు, 12-వ శతాబ్దమువాడై యుండవలెనని శ్రీ లెస్. ఇ. గోవర్, 14-వ శతాబ్దమువాడని శ్రీ పూర్ణయాచా

---

* కవిత్వ తత్త్వ విచారము - పుటలు 10, 11.

ర్యులు, 15-వ శతాబ్దిలో నున్నవాడని శ్రీ వంగూరి సుబ్బారావు, వేమన పద్యములకు పీఠిక వ్రాసిన శ్రీ శేషాద్రి రమణ కవులు 1540 - 1600 నడుమ నున్నవాడని చెప్పిరి. 18-వ శతాబ్దపు టాదిలో నున్నట్లు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మ, బమ్మెర పోతనకు సమకాలికుడని శ్రీ దిగవల్లి వెంకటశివరావు, శ్రీ గంధం శ్రీరామమూర్తి, శ్రీ ఇట్టింకి నరసింహమూర్తి, 8-వ శతాబ్దము వాడని శ్రీ శేకుమళ్ల కామేశ్వరరావు తమ తమ ఊహాలను, వాదములను తెలియజేసిరి. శ్రీ బండారు తమ్మయ్య అందఱి అభిప్రాయములను సమగ్రముగా చర్చించి 1650 - 1750 మధ్యకాలమువాడని నిర్ణయించిరి. దీనినిగూర్చి కొంచెము మన మిచ్చట చర్చింతము.

శ్రీ బ్రౌను, శ్రీ మ్యాక్‌డొనాల్డు, శ్రీ క్యాంబెల్ మొదలగు పాశ్చాత్య పండితులు, శ్రీ పూర్ణయాచార్యులు వేమన కాల నిర్ణయమునకు సరియైన ఉపపత్తులు చూపలేదు. వారు చాలవఱకు వాడుక కథలపై ఆధారపడి కాలనిర్ణయము చేసిరి. అందువలన వారి నిర్ణయమును గూర్చి విశేషముగా చర్చింప నవసరములేదు. వేమన చరిత్రను పరిశోధించి వ్రాసిన వారిలో మొదటివారు శ్రీ వంగూరి సుబ్బారావుగారు. వీరు తమ ఊహాలకు ఈ విధముగ ఆధారములు చూపుచున్నారు:

* "పదునాఱవ శతాబ్దమందు శ్రీ కృష్ణదేవరాయలకు సమకాలికుడైన ఎడపాటి ఎఱ్ఱన తన 'మల్హణ చరిత్రము' నందు—

ఉ॥ ఇట్టి మహాప్రధాన పరమేశ్వరమూర్తివి గాన నీవు చేఁ
బట్టితి మేలు, చుండిపురపాలక! నాళన మంత్రి చంద్ర! ము
న్నట్టిగఁ గృష్ణరాయ జనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడియైన యెఱ్ఱకవి రాజిత మల్హణ కావ్యకన్యకన్ ॥

అని చెప్పికొనిన దానినిబట్టి ఇతడు శ్రీ కృష్ణదేవరాయని కాలము వాడని స్పష్టమగుచున్నది. ఇతడు తన కృత్యాదిని పూర్వకవులను నుతించుచు—

---

* వంగూరి సుబ్బారావుగారి 'వేమన' పుటలు 37 - 42.

చ॥ వినతు లొనర్తు నాంధ్ర సుకవిప్రభు నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను, శివదేవు, భాస్కరుని, జక్కన, నాచనసోము, సర్వదే
వుని, భవదూరు, వేము, నల పోతనఁ, బిల్లలమఱ్ఱి వీరభ
ద్రుని, శరభాంకు, వీరకవి ధూర్జటిఁ గేతనభట్టబాణునిన్ ॥

అని వర్ణించెను. కావున మన వేమన ఎఱ్ఱన కంటె పూర్వుడై యుండవచ్చును.

ఎఱ్ఱనయే గాక ఆ శతాబ్దమునకు చెందిన మఱికొంతమంది కవులుకూడ వేమనను పొగడినట్లు కానవగును.

నిమ్మల వేంకటార్యసుతుడు లక్ష్మణకవి తన 'కంచి యేకామ్ర లింగ శతకము' న—

సీ॥ వ్యాస వాల్మీకుల వర్ణించి యా కాళి
దాసుల నెమ్మదిం దలఁచి(న)న్న
వరుసఁ దిక్కన మంత్రి వర్యులఁ గొనియాడి
భీమ వేమానంత బిరుద కవుల
బడబార్య, పెద్దన్నబాణ, యాజిన దేవ,
సత్కవీంద్రుల నెల్ల సన్నుతించి
నే నేర్చు విధమున నీ యంకితంబుగాఁ
జెప్పెద శతకంబు చిత్తగింపు
గీ॥ పరమ పావన చారిత్ర! ఫాలనేత్ర!
విషమశర శరభంగ! శ్రీ వృషతురంగ!
యోగి హృత్సంగ! బాలచంద్రోత్తమాంగ!
అంబికార్ధాంగ! కంచి యేకామ్రలింగ!

అనియు, క్రి. శ. 1590 - 1620 ప్రాంతమున నుండిన పింగళి ఎల్లనార్యుడు తన ప్రబంధమగు 'తోభ్య చరిత్రము' న—

సీ॥ భక్తిమై రేణుక ప్రమథోత్తము నుతించి
మాయదేవాహ్వాయ మహిమ పొగడి
చెలఁగి యథావాక్యముల యన్నమయగారి
భజియించి మ్రొక్కిడి పాలకుఱికి

సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది
శివదేవ ముఖ నవకవుల నెంచి
గణపతిదేవుని ఘనత సన్నుతిచేసి
వేమనఁ గీర్తించి విమల మతిని

గీ॥ వ్యాస వాల్మీకి కాళిదాసాది ఘనుల
నన్నపార్యునిఁ దిక్కన యజ్వ నెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవినిఁ
జెలఁగి శ్రీనాథ ముఖ కవిశ్రేణిఁ దలఁచి॥

అని వేమనను స్తుతించెను.

15, 16-వ శతాబ్దముల నుండినట్లు చెప్పబడు సిద్ధరామ వంశ సంభూతుడును 'సిద్ధాంత శిఖామణి' గ్రంథకర్తయు నగు శివయోగీంద్రుడు, పాల్కుఱికి సోమనాథున కంకితముగా నిచ్చిన అన్యవాద కోలాహల మను సీస శతకమున వేమన్నను పొగడి యుండెను :

సీ॥ బసవయ్య నాచన్న బసవయ్య నిజలింగ
చిక్కయ్యఁ గక్కయ్యఁ జిత్తగించి
మాచయ్య నవరద మాచయ్య కరికేత
బ్రహ్మయ్య జొమ్మయ్యఁ బ్రస్తుతించి
వేమయ్య నేకాంత రామయ్యఁ బల్లేశు
మల్లయ్య నల్లయ మది భజించి
హొన్నయ్య మేదర చన్నయ్య శివరాత్రి
సంగయ్య వంకయ్య సన్నుతించి

ఆ॥ కోరి యన్యవాద కోలాహలంబను
సీస శతక మింపు చిగురులొత్త
నే నుపన్యసింతు నేఁ డారామగురు చిత్త
నళినభృంగ! సోమనాథ లింగ!

పదునాఱవ శతాబ్దిలో, పదునేడవ శతాబ్దారంభములో నుండిన తురగా రామకవి తన గ్రంథమగు 'నాగరఖండ' మందు వేమన్నను పొగడియుండెను.

సీ॥ ప్రాచేతసుఁ బరాశరకుమారుఁ గాళిదా
సు మయూరుఁ భవభూతిఁ జోరు దండి
బాణు ధనంజయు భారవి జయదేవు
భాసుని శ్రీహర్షుఁ బ్రవరసేను
మల్హణు బిల్హణు మాఘు మురారిని
క్షేమేంద్రు వటమూలు సోమనాథు
శివతత్త్వ శివదేవుఁ జిన్మయు భవదూరు
శరభాంకు రాజశేఖరుని వేము
గీ॥ నన్నపను దిక్కమఖిఁ బ్రబంధపరమేశు
సాధు నాథర్వణాచార్యుఁ జంద్రమౌళి
భాస్కరుని నల శ్రీనాథభట్టు భీము
సోము సమరేంద్రుఁ దలఁతు నుత్సుకత నాత్మ.

ఇట్లే 'ప్రసన్నాంజనేయ' కర్తయగు నరసింహదాసు మొదలగు పలువురు కవులు వేమన్నను బొగడియున్నారు.

వేమన్న క్రీ. శ. 1500 మొదలు పూర్వకవులలో చేరి స్తుతి నందుచున్నాడు. కావున స్థూలముగ 1400 – 1500 నడుమ వాడని నిర్ణయమైనది" అని చెప్పిరి. మఱియు వేమన్న పద్యముల లోని దని చెప్పబడిన

క॥ నందన సంవత్సరమునఁ
బొందుగఁ గార్తిక శుద్ధ పూర్ణిమ నాఁడున్
వింధ్యాద్రి సేతు బంధన
సందున నొక వీరుఁ డేలు సరగున వేమా॥

అను పద్యమును జూపి కొందఱు వేమన జనన తిథి నందన నామ సంవత్సర కార్తిక శుద్ధ పూర్ణిమయై యుండవచ్చునని తలంచిరి.

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ వేమన్నచరిత్ర వ్యాఖ్యాతలలో రెండవవారు. వీరు శ్రీ సుబ్బారావు వాదముతో నేకీభవింపక తమ యభిప్రాయమును సంగ్రహముగా సూటిగా నిట్లు చెప్పిరి :

"ఎఱ్ఱాప్రెగ్గడ వంటి విద్వత్కవులు వేమన్న కవి యని పొగడిరనుట సాహసము. ఇతని కవిత్వమునందు చదువుకొన్నవారికి గౌరవము నేడు కలుగుచున్నది గాని పూర్వకాలపుఁ బండితులకు, ముఖ్యముగా 15, 16-వ శతాబ్దములవారికి కావలసినది శ్లేష యమకముల జిత్తులు, కల్పనా కవిత్వపుఁ గత్తులు. అట్టివారికి యతిప్రాస భంగములు గలవి, ఛందస్సు దారి తప్పినవి యగు "ఉప్పు కప్పురంబు" వంటి చప్పిడి పద్యములు తలకెక్కునా? కావున మన వేమన్న వారి దృష్టిలో శైవుడును కాడు; కవియును గాడు. వా రితనిని పొగడను లేదు. ఇక ఆ వేము డెవ్వరంటిరేని, పండితారాధ్య చరిత్రమున వర్ణింపబడిన చేటల వేమయ్య గాని, చెలిదేవర వేమనారాధ్యుడు గాని కావచ్చును. ఈ రెండవవాడు శాపానుగ్రహ సమర్థుడగు కవియై యుండెననియు శ్రీ బండారు తమ్మయ్య ఆంధ్ర పత్రిక రక్తాక్షి సంచికలో వ్రాసిరి. ఇదిగాక మన వేమన్న మహమ్మదీయుల రాజ్యకాలమున హిందువు లనుభవించిన కష్టములు బాగుగా నెఱిగినవాడు.

ఆ. రాళ్లు నమ్మియున్న రాజాధిరాజులు
కూటి కెడలి భువినిఁ గూలి చనిరి;
రాళ్లు పగులఁగొట్టి రాక్షస పుత్రుల
మాళ్లు నూళ్లుఁ గలిగి మనిరి వేమ.

ఆ. లింగమతములోన దొంగలుగాఁ బుట్టి
యొకరి నొకరు నింద నొనరఁజేసి
తురక జాతి చేత ధూళిమై పోదురు...

వేమన్న ముఖ్యముగా సంచరించిన పశ్చిమాంధ్ర దేశములో మహమ్మదీయుల ఈ స్వాతంత్ర్యము విజయనగర వినాశానంతరమే

సంభవించి యుండును. మహమ్మదీయులు ప్రభువులుగా కడప సీమ యందున్న కాలమున, అనగా 17-వ శతాబ్దముయొక్క కడపటి భాగమునం దితడుండినవాడని శ్రీ బ్రౌను దొరకూడ తలచెను. ఇతని కాలమున మహమ్మదీయుల ఉచ్చస్థితి చాలవఱకు తగ్గి యున్నట్లు ఈ క్రింది పద్యమునుబట్టి ఊహింపవచ్చును.

ఆ. పేకు సైదు మొగలు చెలఁగు పఠానులు
తురక దొరతనంబు తొలఁగఁజేసి
రాఁగ రాఁగ విడిచి రైతులై కొలిచిరి...

కావుననే,

ఆ. మక్కకుఁ జననేల మగుడఁ దా రానేల?
యేకమైన చిత్త మెందుఁ గలదు?
అన్నిటఁ బరిపూర్ణ మల్లా మహమ్మదు..."

అని ధైర్యముగా మహమ్మదీయులకు జ్ఞానబోధ చేయ సాహసించి నాడని చెప్పవలెను. మఱియు వేమన వైష్ణవ మత ఖండన చాల తీవ్రముగా జేసెను. దీనిని బట్టి ఆ మతము 16-వ శతాబ్దమున మిక్కిలి వ్యాప్తిలోనికి వచ్చి 17-వ శతాబ్దమున దురవస్థకు లో నైనట్లు తెలిసికొనవచ్చును. అదియుగాక 1623 లో మరణించిన ముత్తమంత్రి నెఱిగినవాడు కావున వేమన ఆ శతాబ్ది మధ్యభాగ మున కన్న వెనుక నుండియుండడు.

ఇక పదునేడవ శతాబ్దపు టాదియందే అనగా ముత్తన మరణించిన కొన్నాళ్ల లోపుననే వేమన మరణించియుండునని శ్రీ ప్రభాకర శాస్త్రులు ఆంధ్ర పత్రిక క్రోధన సంచికలో వ్రాసిరి.

"గజపతింట గ్రుడ్డి గవ్వలు చెల్లునా?"
"గ్రద్దవంటివాఁడు గజపతి కాఁడొకో"

మొదలగు పద్యములు మనకు సహాయపడుచున్నవి. అందువలన నాకుఁ జూడఁగా వేమన్న 18-వ శతాబ్ది ఆదియందుండెనని ఊహించుట అనుకూలముగాఁ దోఁచుచున్నది." అనిరి.

ఇటీవల శ్రీ వేటుమళ్ల కామేశ్వరరావు, ఈతడు శంకరాచార్యులకు సమకాలికుడని కొన్ని ఉపపత్తులు చూపిరి.

"యతులు నాలుగని చెప్పిన రేచన క్రీ. శ. 845 వాడు కాగా రెండో మూడో యతులను ఉపయోగించిన వేమన అంతకు పూర్వపువాడని నిర్బాధకముగా నిర్ణయింపవచ్చును. కాబట్టి ఇప్పటికి గల ఆధారములనుబట్టి వేమన క్రీ. శ. 800 ప్రాంతము వాడని చెప్పవచ్చును. అప్పటికి శ్రీ శంకరాచార్యులవారు వేమన మహాకవి కూడ సమకాలికు లయ్యెదరు."

భాషా సంబంధమైన ఆధారము లేవైన చూపి సమర్థించిన కొంత సమంజసముగా నుండెడిది కాని యతుల నాధారముగా చేసికొని ఊహించి చెప్పుట నాకుఁ జూడ నివి సరియైన ఉపపత్తులు కావని తోఁచుచున్నది.

శ్రీ బండారు తమ్మయ్య, శ్రీ వంగూరి, శ్రీ రాళ్లపల్లి, శ్రీ ప్రభాకరశాస్త్రి మొదలగువారి వాదములను, ఊహలను గూర్చి సుదీర్ఘ చర్చచేసి శ్రీ సుబ్బారావుగారి వాదము బలమైనది కాదని ఋజువు చేసిరి. వీరి చర్చ శ్రీ అనంతకృష్ణ శర్మ వాదమునకు సర్వ విధముల సహాయకారిగా నున్నది. ఈ చర్చవలన ఇంకొక బలమైన ఆధారము మనకు లభ్యమగుచున్నది.

"ఒక విధముగ వేమన్నవంటి వాడగు కవిచౌడప్ప, విద్యాపోషకుడు, రసిక చక్రవర్తి యగు రఘునాథ భూపాలుని క్రీ. శ. 1614 – 1633 లలో దర్శించినట్లు తన శతకమున నిట్లు ప్రశంసించి యున్నాడు. *

క॥ నేరుతునని మాటాడఁగ
వారిజభవు నంతవాని వశమా తంజా
వూరి రఘునాథ రాయని
గా రెఱుఁగఁగఁ గుందవరపుఁ గవిచౌడప్పా!

* పూర్వాంధ్ర కవులు, మొదటిభాగము – పుట 40.

కావున వేమన తంజావూరికి వెళ్లియుండినను అది యీ రఘునాథరాయని కాలమునగాని, యాతని తనయుడు విజయరాఘవ నాయకుని (క్రీ. శ. 1633 - 1677) కాలమునగాని జరిగియుండునని తలంచుట సంగతముగా నుండునని నా యభిప్రాయము. రఘునాథ భూపాలుడు గుంటుపల్లి ముత్తనామాత్యునకు సమకాలికుడు. కాని పైని జూపిన కారణములవలన వేమన వీరికి సమకాలికుడు గాక వారి యనంతరము కొంచెము సమీపకాలమున నవతరించెనని తలంచుటయే యెక్కువ సంగతముగా కనుపించుచున్నది. వేమన తంజావూరు వెళ్లియున్నచో నది విజయరాఘవ నాయకుని కాలమందయియుండునని నా తలంపు" అని వ్రాసిరి. *

పై చర్చలవల్ల తేలిన దేమన వేమన క్రీ. శ. 1650 - 1750 మధ్యకాలమువాడని నిర్ణయింపవచ్చును.

కవిచౌడప్ప వేమన్నను గూడ ప్రశంసించి యున్నాడు. "వానను దడియని వారును...కానమురా యెంతవాని కవిచౌడప్పా" అందుచేత వయస్సులో చిన్నవాడో పెద్దవాడో చెప్పలేము కాని వేమన చౌడప్ప కవికి సమకాలికు డనుట సుస్పష్టము కదా! చౌడప్ప రఘునాథ భూపాలుని చరమదశలో అనగా 1633 లో తంజావూరు వెళ్లియుండిన నప్పటి కాతడు ముప్పదియేండ్లకు మించని యువకవిగా నుండినను, తరువాత నతడు 50 ఏండ్లు జీవించినను 1700 కు దాటదు కదా! వేమన చౌడప్ప కన్న చిన్నవాడని చెప్పుటకు వీలులేదు. అందువలన శ్రీ తమ్మయ్య వేమన్నను 1650 - 1750 ల వఱకు తీసికొని వెళ్లకుండ 1650 - 1700 అని ఆపివేసిన బాగుండునని నా అభిప్రాయము. ఈ చిన్నమార్పుతో శ్రీ తమ్మయ్యగారి కాల నిర్ణయమే సర్వవిధముల హేతుబద్ధముగా నున్నదని చెప్పవచ్చును. ♦

---

* వేమన చరిత్ర, పుట 39.

♦ వేమనను గూర్చిన గ్రంథములను పరిశీలించి, ఈ కాలనిర్ణయము చేసితిని. ఇదియే సిద్ధాంతమని నే నెంతమాత్రము చెప్పను. భావి పరిశోధనలవలన కాలము మాఱిన తప్పక దానిని స్వీకరింతును.

# వాడుక కథలు-స్వస్థల నిర్ణయము

వేమన్న స్వస్థలమునుగూర్చి కూడ పండితులలో నభిప్రాయ భేదములు కలవు. ఈతనిగూర్చి కొన్ని కథలు ప్రజలలో వ్యాప్తి గాంచియున్నవి. ఆ వాడుక కథలకు, ఇతని జన్మస్థల నిర్ణయమునకు సంబంధముండుటచేత వానినిగూర్చి మనము తప్పక తెలిసికొన వలెను.

## మొదటి కథ

క్రి॥ శ॥ 1328 నుండి 1428 వఱకు నూరు సంవత్సరములు కొండవీటిలో రాజ్యముచేసిన రెడ్డిరాజులలో చివరివాఁడు రాచవేమా రెడ్డి. అతనికి తమ్ముఁడు మనవేమన్న. కొమరగిరి వేమన్న తండ్రి. తల్లి మల్లమ్మ. తల్లివంటిదగు నరసమాంబ వదినె. వేమన్న చిన్న నాటినుండి వేశ్యాలోలుఁడై, ధనాగారములోని ధనమంతయు దాని కిచ్చుచుండెను. వదినె నరసమ్మ తన తెలివితేట లుపయోగించి, వేమన్నకు వేశ్యపై రోత జనించునట్లు చేసెను.

నగరి కంసాలి అభిరామయ్య అనునతఁడు లంబికా శివయోగి వలన తత్త్వోపదేశమును రహస్యముగా పొందుచుండెను. ఒకనాఁడు ఆ యోగి అభిరామయ్యతో "రేపు ఉదయమువచ్చి ముఖ్యమగు ఉపదేశము పొందు మనెను" దానిని పొంచి విన్న వేమన్న మఱు నాఁడు అభిరామయ్యను నగరియందే నిలుచునట్లుచేసి, తాను పోయి యోగితో "అభిరామయ్య తాను రాలేక నన్ను పంపినాఁడు" అని చెప్పగా "వాఁడు నిర్భాగ్యుఁడు. నీవే రారా!" అని వేమన్నకే యుపదేశముచేసి యెటకో పోయెను.

వేమన్న జ్ఞానియై చేసిన మోసమునకు అభిరామయ్యను క్షమాపణవేఁడి, విరక్తుఁడై దేశదేశములు పద్యరూపమున తత్త్వోపదేశము చేయుచు తుదకు రాయలసీమయందు గల "కర్ణాట పల్లె"లో సమాధి నిష్ఠుఁడయ్యెను.

ఈ కథ "వేమన్న సూక్తిరత్నాకర"మను గ్రంథపీఠికలో నున్నది. దీనిని రచియించినవారు శ్రీ రాయవరపు పూర్ణయాచార్యులు. ఈ నాడుకూడ చాలమంది పండితులు ఈ కథనే నమ్ముచున్నారు. ఇక పామరజనులగూర్చి వేఱ చెప్పవలెనా? అభిరామయ్యను మోసగించి పొందిన ఉపదేశము వేమన్నయందు నెట్లు సిద్ధిపొందెనో తెలియకున్నది.

## రెండవ కథ

ఈ కథ మఱియు విచిత్రమైనది. వేమన్న కొండవీటివాడు. పైడిపాలకొడిది రెడ్లవంశమువాడు. ఇతనిది కనుగొళ్ళ గోత్రము. ఇతని మొదటిపేరు పుల్లారెడ్డి. రాజైన అన్నతో కలహించి, తల్లితో నల్లచెరువుకు వచ్చెను. అచట వ్యవసాయము చేసికొనుచు సుఖముగా నుండ ఒకనాడు త్రోవలో నతనిపై పిడుగుపడి చనిపోయెను. తరువాతి కార్యమున కచటివారు ప్రయత్నింపగా తల్లికి స్వప్నమునం దతడు కనిపించి "ఇక నేడు నాళ్ళు సహింపుడు మరల నేను జీవింతును" అని చెప్పెను. అట్లే ఏడు నాళ్ళయిన పిమ్మట ఎనిమిదవ నాడు సజీవుడయ్యెను. "ఏమిరా! పుల్లారెడ్డీ, ఏడునాళ్ళు ఎట్లు చచ్చి బ్రతికితివి?" అని అచ్చట నున్నవారు ప్రశ్నించిరి. "నా పేరు పుల్లారెడ్డి కాదురా! వేమన్నరా!" అని అతడు బదులు పలికెను. అది మొదలు వేమన్న మహాత్ముడై శిష్యవర్గముతో తూర్పుదేశము తిరిగి, అనేక మాహాత్మ్యములను చూపెను. మద్రాసులోని అప్పటి ఇంగ్లీషుదొరలు, ఇతని అద్భుతశక్తికి మెచ్చుకొని చాల గౌరవించిరి. సంచారములో వేమన్న కడపజిల్లా రాజంపేట దగ్గర కోడూరులో అతని తల్లి అచ్చమ్మయు, కుచ్చెర్లపాడు గ్రామమున భార్య ఆదిలక్ష్మమ్మయు మరణించిరి. ఇరువురికిని అతడు కట్టించిన సమాధులు ఇప్పటికి అందు కలవు. తరువాత కటార్లపల్లెకు వచ్చి వేమన్న సమాధిలో పరుండి మూత వేయించుకొనెను. నల్లచెరువు

లోని గుడి తరువాత నతని వంశీయులను జ్ఞాతుల కలహముచే యేర్పడిన ప్రతిబింబము.

ఈ కథ ఆంధ్రసాహిత్య పరిషత్తువారి గ్రంథాలయమున గల వేమన్న చరిత్రలోనిది. రాళ్ళపల్లి వారి "వేమన్న"లోకూడ కలదు. ఈ గ్రంథమున నింకొక విషయముకూడ చూడనగును.

## మూడవ కథ

స్వర్గలోక వృత్తాంతము:—

వైకుంఠములో చెన్నకేశవులును, ఆదిలక్ష్మియు వేమన్నను పిలిచి "నీవు భూలోకమున అవతరింపుము" అని చెప్పగా వేమన భూలోకమున అవతరించెను. వేమన తండ్రి తుంగవంశపు కేశవుడు. తల్లి లక్ష్మమ్మ. కేశవనారాయణులు ఈతని ప్రియమైన తమ్ములు. వీరు మార్కాపురమున చెన్నకేశవస్వాములవారి భక్తులు. తరువాత కొంతకాలమునకు వీరు కదిరికి సమీపమున నున్న రేపల్లెకు వచ్చినట్లు తోచును. ఇదియే ప్రస్తుతము ప్రాత రేపల్లె పట్టణమనియు, పాత రేపల్లె పట్టణమనియు వ్యవహరింపబడుచున్నది. వేమన్న ఇక్కడనే జన్మించెను. అందరికి తత్త్వబోధ చేయుచు కటార్లపల్లెలో నుండెను.

ఈ పుల్లారెడ్డి వేమన్నకథ ఒక్క కొండవీటి సంబంధము తప్ప అంతయు సత్యమని నల్లచెరువు గ్రామవాసులు విశ్వసించిరి. గొప్ప వారి చరిత్రలు ఇట్టి దేవతా మాహాత్మ్యములతోను, పూర్వజన్మల వాసనలతోను, సిద్ధులతోను, దైవ సాక్షాత్కారములతోను నిండి యుండిన కాని మూఢప్రజల నాకర్షింపవు.

వేమన్న గుంటూరు మండలములోని కొండవీటి రెడ్డిరాజుల వంశమునకు సంబంధించినవాడనియు, కటార్లపల్లెలో సమాధి నిష్ఠుడయ్యెననియు శ్రీ రాయవరపు పూర్ణయాచార్యులు తమ గ్రంథమున (వేమన సూక్తిరత్నావళి) వివరించియున్నారు. ఇది నిక్కపుకథయని కూడ వ్రాసిరి. మొదటి కథ దానికి సంబంధించినదే.

శ్రీ ముద్దుపల్లి గురుబ్రహ్మశాస్త్రి తన "కొండవీటి సామ్రాజ్య"మను గ్రంథమున (1920) ఈ వాదమున కాధారము లేదని కొట్టివేసిరి.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుకూడ దీనిని అసత్యమని ఖండించిరి. ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి "రెడ్డి సంచిక"లో వేమన్న ప్రసక్తియే లేదు.

[illegible] చిలుకూరి వీరభద్రరావు మాత్రము కుమారగిరికి కుమారులున్నట్లు శాసనమువలన తెలియుచున్నదనిరి. కాని అతడు రాజ్యమునకు రాలేదనియు చెప్పి మరికొన్ని విశేషములు వివరించిరి.

మహమ్మదీయులగూర్చియు, ముత్తామాత్యుని ధార్మికత్వప్రశంస మున్నగువానిం గూర్చియు వేమన పద్యములలో గలదు. ఆంధ్రదేశమున రెడ్ల ప్రభుత్వము పడిపోయిన పిమ్మట సుమారు రెండువందల సంవత్సరములకుగాని వేమన్న పుట్టలేదని తెలియుచున్నది.

ఇక వేమన కొండవీటి నివాసి అను వాదమునకు ముఖ్యాధారమని చెప్పబడిన - అతని పద్యములలోనిదని పేర్కొనబడిన ఈ పద్యమొకటి కానవచ్చుచున్నది. దీనినిగూర్చి విచారింతము :—

"ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి
మూగ చింతపల్లె మొదటి యిల్లు
ఎడ్డె రెడ్డి కుల మదేమని తెల్పుదు"

"కులము పొలయ జేసి, తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా" అన్న సంస్కారి కులగోత్రములగూర్చి బట్టబయలుగా చెప్పునా? విచక్షణా జ్ఞానముగలవారు ఎవరును ఇవి వేమన్న పద్యములని భావింపరు. అదియుగాక రాజవంశమునకు చెందినవాడు అనాగరిక రెడ్డికులమని తన కులమునుగూర్చి అంత హీనముగ చెప్పుకొనునా? శ్రీ కామేశ్వరరావు చెప్పినట్లు వేమన్న మత సంప్రదాయము ననుసరించి వేమయ్య లెందరో ఉన్నారు. వారిలో వేమారెడ్డి అను నాత డొక

దుండవచ్చును. ఈపద్యము బహుశః అతని ఆత్మఘోష కావచ్చును."

. . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . . .

(టేకుమళ్ళ కామేశ్వరరావుగారి "పూర్వాంధ్రకవులు" మొదటి భాగము పుట 37, 38.)

ఇంకొకచోట "కలియుగంబున నున్న కాపుకులానకు, వేమన తన కీర్తి విక్రయించె" అను పద్యము కలదు. ఇదికూడ అసందర్భముగనే యున్నది. కులములో సుంతైన విశ్వాసములేని వేమన్న తన నోట దీనిని పలికించెననుట విశ్వసింప దగినదికాదు.

ఈ పుక్కిటి పురాణములు ఏవి యెట్లున్నను వేమన్న కదిరి చెంత నున్న "కటార్లపల్లె" ప్రాంతమునకు చెందినవాడని చెప్పుటలో సత్యమున్నది. దాని క్రింది యుపపత్తులను చూడనగును.

(1) వేమన మతసంప్రదాయము ననుసరించి వేమయ్యలు ఆ ప్రాంతములోనే కలరు. ఇప్పటికి కడప, కర్నూలు జిల్లాలలో ఆ యా ప్రాంతములందు అచల మతస్థులను పేరుతో యాచనావృత్తితో వారు జీవించుచున్నారు. వారు ప్రతియేట వేమన ఉత్సవములు జరుపుచుందురు. వేమన్న ఆ స్థలముననే సిద్ధి పొందె నందురు.

(2) ఆ ప్రాంతమువాడైన చౌడప్పకవి వేమన్నపై చెప్పిన పద్యము (వానను దడియనివారును) అతని స్థానికాభిమానమును చాటుచున్నది.

(3) పాశ్చాత్య పండితులైన శ్రీ సి. పి. బ్రౌను ఇతని జన్మ స్థలమునుగూర్చి యీ విధముగా చెప్పెను:—

"ఆయన జన్మాదికములలో, అభిజనము మొదలగువాని సంగతి పరంపరానుగతముగా స్పష్టముగా వివరింపబడలేదు. కందనూరు (కందనవోలు – కర్నూలు) దుర్గాధిపతి, అనవేమారెడ్డి కుటుంబమునకు జెందినవాడు ఈ వేమన అని కొందరి మతము. ఈతని సోదరు డొకడు గండికోట ప్రభువుగా నుండినాడని చెప్పబడుచున్నది.

కందనూరుదగ్గఱ కృపిపాడు (కృపిపాలు) గ్రామస్థుడని, మఱికొందరు; గుంటూరు మండలములోని ఇనకొండ (వినుకొండ) వాడని మఱి కొందరు, ఇంకనూ కడపజిల్లా చిట్వేలువా డనువారును కలరు. ఈ ప్రదేశము లన్నిటియందును, ఈ విషయమునుగూర్చి విచారించు టకు నాకు అవకాశము లభించినదికాదు. ఇంతకు వేమన్న జన్మ స్థానమునుగూర్చి ఇట్లు అని తేల్చగలిగిన యంశము లేవీ నా కింత వరకు దొరుకలేదు. అయినప్పటికిని ఆయన పద్యములలో వాడబడి యున్న కొన్ని స్థానికపదములు ఆయన తెలంగాణా (ఇప్పటి రాయల సీమ) నైరుతి ప్రాంతీయుడై యుండవచ్చునని తేల్చి చెప్పుటకు వీలు చిక్కుచున్నది.''

క్యాంబెల్ మహాశయుడు ఈ విధముగా వ్రాసెను—"వేమన్న మద్రాసునకు ఈశాన్యముగా 200 మైళ్ళలోపల కడపజిల్లాలో, ఆగిరి కానగ సీమలో పుట్టి యుండునని ఒకపాటి తీర్మానమునకు రావచ్చునని నా యభిప్రాయము. కడప, కర్నూలు జిల్లాలు ఆయన జీవితరంగము లనుటకు ఏ మాత్రము సందేహము లేదు. స్థానిక సాంప్రదాయిక జనశ్రుతి-కడపజిల్లా నైరుతిమూల చివర కటారు పల్లె అను చిన్న గ్రామము ఆయన ఉనికి యని చెప్పబడుచున్నది. అచ్చట, ఆయన వంశమువారమని చెప్పుకొను ఒక కుటుంబముకూడ ఉన్నది. దీనిని సందేహింప నగత్యము లేదు. వేమనకవి భక్తులు ఆయనపై భక్తిసూచకముగా, ఆ కుటుంబమువారికి ఇప్పటికిని కానుక లర్పించుచుందురు. వేమన్న కాపు కుటుంబమునకు, కృషిక కుటుంబమునకు జెందినవాడు.''

(వేమన-పాశ్చాత్యులు పుట. 71.)

బ్రౌను చెప్పినట్లు ఇతని జన్మస్థలమునుగూర్చి అంతరంగిక సాక్ష్య మాతని భాషావైఖరియే. దీనిగూర్చి శ్రీ అనంతకృష్ణ శర్మకూడ ఇట్లు చెప్పెను—

"ఇతని పద్యములలో అనంతపురము, కడప, కర్నూలు జిల్లాలలో వాడుకలో నున్నమాటలు చాల కానబడుచున్నవి". అలిగండ్లు, మలిగండ్లు, తారాడక, ఒక్కపొద్దు మొదలగునవి అనేకము.

వేమన్న ఏ ప్రాంతమునకు జెందినవాడైనను ఇతడు ఆంధ్ర దేశమంతటను తిరిగి, ఆ యా ప్రాంతములలో కొన్నాళ్ళపాటు, నివసించియుండి యుండవచ్చును. తమిళనాడులోకూడ పలు ప్రాంతములలో సంచారము చేసి యుండవచ్చును.

## వేమన్న కులము

శ్రీ పూర్ణయాచార్యులు ఈతనిని రాజు తమ్ముడనెను. శ్రీ బ్రౌనుదొర జంగమ కులమనెను. ఇతని పద్యములని చెప్పబడిన రెండు పద్యములనుబట్టి రెడ్డికులమని, కాపుకులమని శ్రీ వంగూరి సుబ్బారావు మొదలగువారు భావించిరి. రెడ్లను కాపులనికూడ రాయలసీమ, తెలంగాణా ప్రాంతములందు వ్యవహరించుట కద్దు. ఎక్కువమంది మాత్రము ఇతడు కాపు కులజుడని చెప్పుదురు. ఇందులో సత్యమున్నది.

శ్రీ వేదమళ్ళ కామేశ్వరరావు ఇతనిని బ్రాహ్మణుడని ఒక క్రొత్తవాదమును లేవదీసి యీ విధముగా ననిరి :—

"వేమన పద్యములను కొన్నిటిని చూడగా నితడు బ్రాహ్మణుడను విషయము విశదమగును.

ఈ పద్యములను గమనింపుడు.

"ద్విజకులంబునందు తేజరిల్లుచు బుట్టి
తాఁ దరించి యొరుల దాటజేయ
లేని యాతడున్న లేకున్న నొక్కటె"
"ద్విజుల ఖేదబెట్టి తిట్ట వాడగువారు
మృతిని బొంది తాను వెతలబడగ
గాలుదరిని జేయు గడతేర లేడయా"

అని శపించినాడు. ఇట్టి పద్యములను జూడగా నితడు బ్రాహ్మణ కులములో బుట్టి, శ్రీ శంకరాచార్యులవలెనే సన్యాసియై లోకోద్ధరణకు పాటుపడెనని చెప్పవలసి వచ్చుచున్నది.

ఇతడు మకుటములో కూడ నా భావమునే చేర్చినాడా?

విశ్వనుడు అనగా జగత్తునిచ్చువాడు (సృష్టించువాడు), అనగా బ్రహ్మ. అట్టివారికి అభిరాముడనగా ప్రియమైనవాడు. అనగా బ్రాహ్మణుడు. ఇట్లు అతని కులము మకుటములో గర్భితముగా కనబడుచున్నది".*

శ్రీ కామేశ్వరరావు వాదనలో నంత పస లేదు. ఈ రెండు పద్యములు పూర్తిగా ప్రక్షిప్తములు. వేమనవంటి ప్రగతివాది నోటినుండి వెలువడవలసిన మాటలు కావివి "కాపుకులము" "ఎడ్డె రెడ్డికులము" అను పద్యములు వ్రాసిన వేమయ్యలవలె ఎవరో బాపనయ్యలు వ్రాసిన పద్యములని కచ్చితముగా చెప్పవచ్చును.

*పూర్వాంధ్రకవులు, మొదటిభాగము పుట 41.

వేమన ఒక సామాన్యమైన రైతుకుటుంబమునకు చెందిన వాడని ఇతని పద్యములే మనకు అంతరంగిక సాక్ష్యము నిచ్చుచున్నవి. ఇతని కవిత్వములో నెచ్చటగాని మచ్చునకైన రాచనగరి వాసన కానరాదు. పైగా ఇతడు రాజులతో స్నేహము పాములతో పొందువంటి దనెను.*

వేమన్న పుంజు గూటినుండి ప్రొద్దెటిగి కూయగనే లేచి, కాల్యకృత్యములు తీర్చుకొని పొలమునకు పోవుచుండెడివాడు. దుమ్ము తెగులు చేతఁ దూలెడు గేదెలకు వాతలు వేసి, చక్కజేయుచుండెడి వాడు. పోట్లగొడ్డు కొమ్మాడించుట చూచుచుండెడివాడు. పండిన చేలలో పల్లేరుకాయలు త్రొక్కుచుండెడివాడు. చిల్లుపడిన కుండలకు గుడ్డలు దోపుచు నిరాడంబర సంసారజీవితము నడుపుచుండెడివాడు. ఇంటిలోని పోరుతోను, బాధ్యతలేని భార్యతోను, బిడ్డలతోను బాధలు పడుచుండెడివాడు. సతుల కలియుట, సుతుల బడయుట వెతల ననుభవించుటలే యని, అది మానవుని వెట్టితనముగాని వివేకము కాదని అతడు సంసారముపై పూర్తిగా విరక్తిచెందిన రోజులు కూడ కలవు. కుక్క ఇల్లుసొచ్చి కుండలు వెదకు దృశ్యములు కూడ ఆయన చూచెను. సామాన్యుడగు రైతు తన దైనందిన జీవితములో అనుభవించు అన్నివిధములైన కష్టసుఖములు వేమన్న అనుభవించెను. ఇదే యతని జీవితములోని మొదటి ఘట్టము.

వేమన్న చిన్నతనముననే తన గ్రామమున భారత, భాగవతాది గ్రంథములను విమర్శనదృష్టితో చదివెను. ముఖ్యముగా శైవసాహిత్యమును అత్యంత శ్రద్ధతో పఠించెను. ఇతడు సాహిత్య ప్రక్రియలలో బొత్తిగా ప్రవేశములేనివాడు కాదు. ఇతర ప్రబంధ

---

*ఎంత సేవఁజేసి యేపాటు పడినను
రాచమూక నమ్మరాదురన్న
పాముతోడి పొందు పదివేలకైనను..."

కవులవలె ఈతడు ఉభయభాషా ప్రవీణుడు కాకపోయినను ఇతని లోకజ్ఞాన మపారము. పుట్టుకతోడనే ఈతడు గొప్పభావుకుడు. కొందఱా విధముగా పుట్టుదురు. దానికి గట్టిగా నేకారణమును చెప్పలేము. వారి భావములకు సంఘపరిస్థితులు తోడ్పడుచుండును. ఈతడు సామాన్యమానవుని జీవితములోని నిగూఢ రహస్యముల నెఱింగిన మహనీయుడు; మానవతావాది. ప్రతి మానవుని సమస్య తన సమస్యగా భావించి, దాని పరిష్కారమార్గమును చూపిన బాధ్యతాయుత నైతిక జీవన సంపన్నుడు - ప్రత్యక్ష వేదాంతి.

వేమన ఆంధ్రదేశములోని అన్ని ప్రాంతములను తిరిగియున్నట్లు ఇతని భాష, లోకోక్తులు, సామెతలే మనకు చెప్పుచున్నవి. ఇతడు కర్ణాట, తమిళ దేశములలో కూడ పర్యటించియుండెను. మత ధార్మిక విప్లవవీరుడైన బసవేశ్వరుని ప్రభావము కూడ ఇతనిపై కొంత పడియుండెనని చెప్పవచ్చును. తనకు అనేక విధముల అచ్చపు ప్రతిబింబమనదగు సర్వజ్ఞమూర్తిని గూర్చి ఇతడు బాగుగా తెలిసికొని యుండవచ్చును.

వేమన్న జీవితధ్యేయము "జాతి కుల మత విభేద రహిత నాగరిక సమాజ నిర్మాణము." సంఘములో గల అన్ని విధములైన అసమానతలు తొలగవలెనని తన కవిత్వము ద్వారా ప్రబోధించుచు ఇతడు ఆంధ్రదేశపు నాల్గుచెఱగుల తిరిగెను. ప్రజలను అంధవిశ్వాసములనుండి, అజ్ఞానమునుండి విముక్తి పొందగోరెను. ఉపవాసములు, తీర్థయాత్రలు, కఠోరవ్రతములు, బలులు, అర్పణములు మొదలగు వానిలో నేమియు లేదని వారికి అనేక విధముల నచ్చజెప్పెను. మూఢభక్తికంటె, జ్ఞానభక్తి శతసహస్రవిధముల గొప్పదని పలువిధముల బోధించెను. ఏకేశ్వరోపాసన ఉత్తమోత్తమ సాధనమని నొక్కి చెప్పెను. తార్కికదృష్టిని పెంపొందజేసికొనుడని జనులను కోరెను. లౌకికనీతియొక్క ఆవశ్యకతను వివరించెను. ఆ కాలమున కొంతమంది గురువులు, సన్న్యాసులు చేయుచున్న మోసమును, వంచనను

బయటపెట్టెను. ఆ నాటి సమాజములో అనేకరూపములలోనున్న దుర్మార్గత్వమును దుయ్యబట్టెను. ఈ విధముగా వేమన్న ఉత్తమ సమాజ నిర్మాణమునకు ఆత్మవంచన లేకుండ అవిరళకృషి చేసిన ప్రగతివాది.

వేమన్న చరమదశ ఏ రూపమున నుండినదో చెప్పలేము. ఇతడు హేమకారవిద్యను నేర్చెననియు, పిమ్మట యోగి యయ్యెననియు. వేదాంతకవిగా, మర్మకవిగా తత్త్వోపదేశము చేయుచు అన్ని ప్రాంతములలోను తిరిగెననియు పెక్కురు పండితులు, చరిత్ర పరిశోధకులు చెప్పిరి. సర్వశ్రీ పూర్ణయాచార్యులు, వంగూరి సుబ్బారావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలగువారు ఇతనిని యోగిగనే భావించిరి. వేమన్న చివఱకు దిగంబరుడు కూడ నయినాడట, దానికి సంబంధించిన పద్యము * దిగంబర చిత్రపటము గ్రంథముయొక్క అట్టపైని, మొదటిపుటలో చూపుట ప్రతి గ్రంథకర్తకు పరిపాటి యైపోయినది. ఇతని పేర నొక మతసంప్రదాయము కూడ వెలసినది. నెల్లూరు, రాయలసీమ ప్రాంతములలో పలుచోట్ల నితని జయంత్యుత్సవములు ఏటేట జరుగుచుండును,

## వేమన్న యోగియా?

పాశ్చాత్య పండితులు, చరిత్ర పరిశోధకులునైన శ్రీ కాంబెల్ శ్రీ మ్యాక్‌డొనాల్డు తప్ప ఇంతవఱకు వేమన్న చరిత్రను గూర్చి పరిశోధన చేసిన పండితులందఱు ఇతనిని యోగిగనే భావించిరి.*

"కూడు గుడ్డ తాను కోరునా దేవుడు?"
"నిజము చెప్పరాదు నీచులోను"

---

*తల్లి గర్భమందు తాఁ బుట్టినప్పుడు
మొదట బట్ట లేదు తుదను లేదు
నడుమ బట్టఁగట్ట నగుబాటు కాదొకో..."

*వేమన - పాశ్చాత్యులు. పుట 91, 92, 93, 94.

"జ్యోతిషంబు జనుల నీతుల తప్పించు"
"జీవి తొలగు వెనుక జీవవస్తువులేల?"
"సంపదధికవలన సాధించి దాసిని
బడుగువకు నొసంగ బాగు వేమ."
"శ్రమములోన నుండు సర్వంబు."

అని చెప్పిన తార్కిక చక్రవర్తి ప్రగతిశీల దృక్పథము గల ప్రజాకవి, మానవుని సృజనాత్మకశక్తిలో నమ్మకము గల ప్రత్యక్ష వేదాంతి-యోగియై మానవృత్తి ఎట్లవలంబించెనో తెలియకున్నది. అదియుగాక నితడు మునివృత్తి యనినను, యోగులన్నను యోగ సాధనలన్నను, కాయసిద్ధులన్నను మండి పడును.

"ఒడలు బడలఁజేసి యోగుల మనువారు
మనసు కల్మషంబు మాపలేరు;
పుట్టమీఁదఁగొట్ట భుజగంబు చచ్చునా?"
"వేషభాష లెఱిగి కాషాయవస్త్రముల్
బోడినెత్తి కల్గి పొరయుచుండ్రు
తలలు బోడులైన తలఁపులు బోడులా?..."
"కావిపంచెఁగట్టి కడు యోగివలె నుండి
వెలికిఁ గోర్కెలెల్ల విడిచిపెట్టి
తొఱగి తిరుగువాడు దొంగసన్యాసిరా..."
"ఉపవసములనున్న నూరపందై పుట్టు
తపసియై దరిద్రతను వహించు
శిలకు మ్రొక్కనగును జీవ ముఖుగు బొమ్మ..."
"చదువు చదువనేల? సన్న్యాసికానేల?
వణ్ణ్రతములఁ జిక్కి చావనేల?
యతని భజనఁజేసి యాత్మలోఁ దెలియుఁడీ!..."

"కడుపు బోరగించి, కన్నులు ముకుళించి
బిట్టు బిగిసికొన్న బీదయోగి
యముని బారి గొట్టె యతఁడేమి సేయును?..."

"ముక్కు వ్రేళ్ల గ్రుచ్చి ముఱికిపోవఁగఁదోమి
కచ్చునీరు సించి కడిగి కడిగి
డొక్క తోమినంత దొరకునా మోక్షంబు?..."

మొదలగు పద్యములను గమనింపనగును.

వేమన్న యథార్థరూపము మఱుగుపడుటకు కారణ మతని పద్యములలో ఇతరుల పద్యములు అసంఖ్యాకముగా చేరుటయే యని వేఱే చెప్పనవసరముండదు. దానికి తోడు శ్రీరాయవరపు పూర్ణయాచార్యులవంటివారి పుక్కిటి పురాణములు కొన్ని. ఇవి యతని కాల, స్థల నిర్ణయమునకు కూడ అడ్డు తగులుచున్నవి. వేమన్న శిష్యులమని పేరు పెట్టుకొన్న కొంతమంది వేమయ్యలు, మాల దాసరులు, అచలమతమునకు చెందిన కొంతమంది గంజాయి సాధువులు, రసవాదములోను, యోగజ్ఞానములోను, కాయసిద్ధుల లోను ప్రగాఢ విశ్వాసము గల కొంతమంది సంప్రదాయ పండితులు వేమన్న ప్రగతివాదిత్వమునకు వారి పైత్యము విపరీతముగా కలిపి సుమారు ఐదువేల పద్యములు కూర్చిరి. ఇవి ఇంకను హనుమంతుని తోకవలె పెరుగుచునే యున్నవి. పెంచి ప్రకటించినవారి నభినందించుచు పండితప్రకాండులు పీఠికలు వ్రాయుచునే యున్నారు. శ్రీ అనంత కృష్ణశర్మగారివంటి పండితులు "వ్రాలకందక వేల సంఖ్యగా పద్యములు చెప్పినవాడు" అనిరి.[1] దీనికేమి చెప్పవలెను? ఈ సమస్యను గూర్చి శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు తన గ్రంథమగు పూర్వాంధ్రకవులు – 'మొదటి భాగము'న సమగ్రముగా చర్చించి యున్నారు. సమస్యాపరిష్కారమునకు కొన్ని సలహాలు

1. చూ. వేమన్న, పుట–215.

2. పూర్వాంధ్రకవులు – మొదటిభాగము,

కూడ ఇచ్చిరి ఈ సలహాలు చాల వఱకు నిర్మాణాత్మకముగా మన్నవి.

కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు తమ గ్రంథమగు "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"లో ఈ విధముగా చెప్పిరి :-

"వేమన్న పద్యములు పెరుగుచు వచ్చినవి. తమకు సరిపడని వారిని దూషించి "విసుర వేమ" అన్నవారు పలువురు, రసవాదమును కల్పించి "విశ్వదాభిరామ" అన్నవారు పల్వురు. బూతులు వ్రాసి, నోటి తీటను వదలించుకొన్నవారు కొందరు, తమ పేరు తెలుపుకొనుటకు ధైర్యము చాలక వెఱ్ఱి వేమన్నకు వానిని అంటగట్టినవారు కొందరు నుండినట్లు ఊహింపవలెను. వేమన్న ఆటవెలదిలోనే సరిగా యతిస్థానములో విఱుపుచేసి, చక్కని కవిత చెప్పియుండెనని చెప్పుచున్నాను. అట్టివానిని మొదట యేరి, వేఱుగా ప్రకటించుట అవసరము."1

శ్రీ రెడ్డిగారి అభిప్రాయముతో నేను పూర్తిగా ఏకీభవించుచున్నాను.

"నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకు బెళుకు ఱాళ్లు తట్టెడేల?
చదువ పద్య మరయ చాలదా యొక్కటి?..."

అని చెప్పిన మితభాషి వేమన మతిపోయినవానివలె అర్థములేకుండ ఒకచోట చెప్పినదానిని ఇంకొకచోట ఖండించుచు "వ్రాలకందక వేలకొలది పద్యములు చెప్పె" ననుట సత్యదూరము. చరిత్ర జ్ఞానము గల సహృదయులైన పండితులు అసలు వేమన్న పద్యములేవో గుర్తుపట్టుటకు సాధనములు పరికించి, యథార్థమును ప్రజల ముందు పెట్టి ఆంధ్రసాహిత్య సరస్వతికి అత్యంతోపకారమును చేయ గోరుచున్నాను.

1. ఆంధ్రుల సాంఘిక చరిత్ర,

సర్వజ్ఞుడు వేమన్నకు అనేక విధముల అచ్చుపు ప్రతిబింబమని చెప్పనొప్పును. తెలుగువారు రితనిని కన్నడ వేమన అనియు, కన్నడిగులు వేమన్నను తెలుగు సర్వజ్ఞుడనియు చెప్పుట కలదు. ఈ యుభయకవుల తీరుతెన్నులు ఒకే విధముగా నుండుటయే దీనికి కారణము. ఈ యక్క-సెల్లెండ్ర బిడ్డలు ఆంధ్ర కర్ణాటక సమాజ జీవితమును తమ బోధనామృతముచే పునీతముచేయ నవిరళకృషి సల్పిన పుణ్యపురుషులు.

తెలుగున వేమన్నవలె కన్నడసాహిత్య ప్రపంచమున గొప్ప ప్రగతివాదియైన ప్రజాకవి సర్వజ్ఞుడు. కర్ణాటక దేశమున ఇతని పేరు విననివారుగాని, ఇతని వచనములు చదువని అక్షరాస్యులుకాని లేరని చెప్పుటలో రవంతైన అతిశయోక్తి లేదు. పండితులు, పామరులు అను భేదములేక అందఱి రసనాగ్రములందు ఈతని వచనములు తాండవమాడుచుండును. మానవుల దైనందిన జీవితమునకు సంబంధించిన ప్రతి సమస్యకు ఇతని మాటలు పరిష్కార మార్గమును చూపిన భవ్యసూత్రములు. అఖిల కర్ణాటక ప్రజా హృదయమును చూఱగొనిన కొద్దిమంది మహావ్యక్తులలో సర్వజ్ఞమూర్తి యొకడు.

12-వ శతాబ్దమున బసవేశ్వరునివలన సమాజ జీవితములోనే కాక, సాహిత్యరంగములోగూడ గొప్ప మార్పు వచ్చెను. అంతవఱకు సాహిత్యసంపద కొద్దిమంది పండితుల పరమై యుండెడిది.

బసవేశ్వరుని విప్లవానంతరము సాహిత్య కేదారము ఉమ్మడి ధనమయ్యెను. వీరశైవకవులు సామాన్యజనుల కుపయుక్తమైన సాహితీ సంప్రదాయమును నెలకొల్పిరి. గద్యపద్యరీతులలోనే గాక వీరు అంతకు పూర్వము చిరకాలమునుండి జానపదుల నాలుకలందు నాట్యమాడుచు వారి దైనందిన జీవితముతో పెనవేసికొనియున్న సాంగత్య, రగళ, త్రిపది, చతుష్పది మొదలగువాని పరిచయమును పెంపొందింపజేసి సాహిత్యలోకమున నూతన చైతన్యమును కలుగ

జేసిరి. ఇట్టి చైతన్యమూరులైన ప్రజాకవులలో మొదటిశ్రేణికి చెందినవాడు మన సర్వజ్ఞుడు.

వేమన్న కాలాదులవలె సర్వజ్ఞుని కాలాదులను గూర్చికూడ ఇంతవఱకు కన్నడదేశమున గల పండితులు, చరిత్ర పరిశోధకులు సరియైన నిర్ధారణ చేయులేకపోవుట అత్యంత విచారకరము. దానికి ముఖ్యకారణము దిక్కు తెన్ను లేకుండ విపరీతముగా పెరుగుచు వచ్చిన ఇతని వచనములే యని గట్టిగా చెప్పవచ్చును. సర్వజ్ఞుడు చేపట్టిన ఛందస్సు (త్రిపది) అత్యంత సులభమైనది. ఇతని వచనములకు గల ప్రఖ్యాతి కర్ణాటక సాహిత్యప్రపంచమున ఇకనే ప్రజాకవి పలుకులకు లేదు. ఇతని ననుకరించుట చాల సులభము. అందుచేత వేమన్నకు వేమయ్యలవలె - సర్వజ్ఞునకు సర్వయ్యలు, బసవయ్యలు తయారై ఇతని కవిత్వమునకు వారి పైత్యము సమృద్ధిగా తగిలించి, వచనములను విపరీతముగా పెంచివేసిరి. ఈ మితిమీరిన ప్రక్షిప్తములు సర్వజ్ఞుని నిజచరిత్రను మఱుగుపఱచినవి.

సర్వజ్ఞు డిట్టివాడు, ఇతని జీవితవిధాన మిట్టిది, ఇత డీ ప్రాంతమువాడు; ఇతని తల్లి దండ్రులు వీరు - అని నిర్ధారించుటకు వీలులేని స్థితి ఏర్పడినది. మఱియు ఇతడు తెలుగుభాషను తిట్టినట్లును, వారి భాషను వెక్కిరించినట్లును, తమిళులను, వారి భాషను అవహేళన చేసినట్లును కొన్ని వచనములు కలవు.* జాతి కుల మత భాషా దురభిమానములను ఖండించుచు అన్ని ప్రాంతములు తిరిగిన సహృదయాగ్రగణ్యుడు ఈ విధమగు సంకుచితభావమును చూపునా? మఱికొంతమంది ఇతనికి 'కాలజ్ఞాని' అను పేరుకూడ

*"అక్కయను బీయుంబ। బెక్కన్న పిల్లెంబ
చొక్కటద తేజి గుర్రంబ తెలుగన।
సొక్కనోడెంద సర్వజ్ఞ॥"
"తిగుళిజన గెణెయుంద। బొగళువాళని లేసు।
మగుళియమరన నెరళింద తుంగువ।
నెగళు లేసెంద సర్వజ్ఞ॥" — మున్నగు వచనములు.

అంటగట్టి, దానికి సంబంధించిన అనేక వచనములు చేర్చిరి. దీనిని గూర్చి కీ. శే. శ్రీ ఎ. ఆర్. కృష్ణశాస్త్రిగారు చెప్పిన ఈ మాటలను చూడనగును—

"మహాపురుషు డన్నవాడు అద్భుతకార్యములు చేయవలయును. ముందు రానున్న వీరవసంతరాయని సకల కార్యకలాపములు ఊహించి చెప్పవలెను. కవి మహిమనుకూడ వర్ణించి చెప్పవలెను. అందఱికి తెలిసిన విషయములే యితడు చెప్పెనేని ఇతనిలోని ప్రత్యేకత యేమున్నది? అందుచేత నితని పేర 'కాలజ్ఞాన' మనునది లేకున్నచో పెద్దలోపమని భావించి, ఇతనిపై గౌరవముగలవా రెవరో ఆపే రితని కంటగట్టిరి. ఈ విధముగనే విద్యారణ్యులవారి పేరకూడ నొక కాలజ్ఞానము పుట్టియున్నది. ఆ కాలజ్ఞానము నతడు వ్రాయనులేదు; ఈ కాలజ్ఞానము సర్వజ్ఞుడును వ్రాయలేదు. దానిని మఱొకరు వ్రాసి యుందురు.

(సర్వజ్ఞకవి, పుట 5.)

శ్రీ కృష్ణశాస్త్రిగారి అభిప్రాయము సర్వవిధముల సమంజసముగా నున్నదని నా భావము. మూఢప్రజలు దేవలోక వృత్తాంతములు, అమానుషశక్తులు, అద్భుతకార్యములు మొదలగునవి మహాపురుషుల జీవితములకు అంటగట్టుట క్రొత్త కాదు.

అది మహాకవి కాళిదాసు నంతవానికే తప్పలేదు. అమానుషశక్తులు లేనిపక్షమున వారి దృష్టిలో మహాపురుషులే కారు.

వేమన్న చరిత్రకు సూటిగా దేవలోక వృత్తాంత సంబంధము లేదు. (తుంగ వేమన్న చరిత్రకు మాత్రము కలదు) సర్వజ్ఞునకును సూటిగా దేవలోక వృత్తాంతము ముడిపెట్టిరి.

## సర్వజ్ఞుని దేవలోకసంబంధమైన కథ

సర్వజ్ఞుడు కైలాసములోనుండు ప్రమథగణములలో నొకడు. ఇతనిపేరు పుష్పదంతుడు. ఇతనికి 'పూదత్త – పూదంత' అను

నామాంతరములుకూడ కలవు. సర్వజ్ఞుని వచనముల ప్రారంభములో జెప్పిన "మున్ను కైలాసదరి" - అను దానినిబట్టి ఈతని కైలాస వృత్తాంతము మనకు సుస్పష్టము. ఇతడు పౌరాణికపురుషుడైనట్లు కొన్ని శిలాశాసనములవలన తెలియుచున్నది. ఈ పుష్పదంతుడే వరరుచి అను పేరుతో భూలోకమున పుట్టెనట. ఈతనినే జనులు 'సాలెయ సర ' దని పిలుచుచుండిరట. దీనినిబట్టి సర్వజ్ఞుని అసలు పేరు 'వరరుచి' యని తెలియుచున్నది ఈ విధముగా సర్వజ్ఞునకు (పుష్పదంతునకు) వరరుచికి జన్మాంతర సంబంధము కల్పించి పరిశోధన లింకను జరుగుచునే యున్నవి.

## వాడుకలోనున్న విచిత్రకథ

### (రెండవ కథ)

ధార్వాడలోని 'మాసూర' గ్రామమున వైదికకర్మ నిష్ఠాగరిష్ఠుడైన ఒక బ్రాహ్మణుడు ఉండెను. అతనికి చాలకాలమువఱకు సంతానము లేమిచే మిక్కిలి విచారించి, విశ్వనాథుని దర్శించుటకై కాశికి పోయెను. అచ్చట పరమేశ్వరుడు ఆ బ్రాహ్మణునకు స్వప్నమున కనబడి "నీ నుండి యొక దివ్యజ్యోతి భూమిపై యవతరించును" అని చెప్పెను. అంత నా బ్రాహ్మణుడు అత్యంత సంతోషముతో తన యూరికి ప్రయాణమయ్యెను. ఆనాటిరాత్రిలోపల తమ గ్రామము చేరినచో నియమితకాలమున కార్యము సఫలమగును. కాని ఆ విధముగా జరుగలేదు. తన యూరి ప్రాంతముననే ప్రవహించుచున్న నది ఉప్పొంగుచుండెను. దానికితోడు వానకూడా భోరున కుండపోతగా కురియుచుండెను. బ్రాహ్మణుడు చేయునదిలేక నది కిద్దరినున్న యొకకుమ్మరిగృహము నాశ్రయించెను. పంచాంగము చూచి, లెక్కించి, పరిశీలింప నాటిరాత్రి తనవలన తన భార్య గృహమున దివ్యజ్యోతి యొకటి స్వప్నప్రకారము ఉదయింపవలసి యున్నది. కాని ఆ రాత్రి ఊరుచేరుకొను నాశ తప్పిపోవుచున్నదని యాతడు చింతింపసాగెను. దానిని చూచి ఆ గృహమందుగల కుమ్మరి

ముదుసలి బ్రాహ్మణునిపై జాలిగొని ఆవిచారమునకు కారణ మడిగెను. బ్రాహ్మణుడు ఆమెకు తన స్వప్నవృత్తాంత మంతయు తెలిపి, "నేటిరాత్రి నానుండి యొక గొప్ప తేజము భూమికి దిగవలసి యున్నది. కాని నేనిక్కడ, నాభార్య అక్కడ" అని చెప్పెను.

అంత నా కుమ్మరిముసలి కొంతసేపు గాఢముగా ఆలోచించి "ఓ బ్రాహ్మణుడా! ఈ రాత్రి నీ భార్యను పొందు అవకాశము నీకు లేదు. ఆ దివ్యజ్యోతి ఎక్కడ పుట్టిననేమి? ఈ రాత్రి నా కోడలిని నీకడ కంపెదను. ఆమెయే గర్భము ధరించుగాక! ఆ యమృతఘుటికలు వ్యర్థముచేయవల" దని చెప్పెను. అందుల కా బ్రాహ్మణు డంగీకరించెను. ఆరాత్రి ఆ బ్రాహ్మణుడు కుమ్మరి కోడలగు మాళితో గడపెను. ఆమె బ్రాహ్మణునివలన గర్భము ధరించెను. మఱునాడు బ్రాహ్మణుడు తన గ్రామము చేరుకొనెను. కొన్నాళ్లకు మాళి గర్భమునుండి ఒక దివ్యజ్యోతి భూమిపై అవతరించెను. అతడే సర్వజ్ఞుడను పేర వెలసెను.

ఈ విధముగ సర్వజ్ఞుని తల్లి కుమ్మరి మాళి, తండ్రి బసవరసు అను పేరుగల బ్రాహ్మణుడు. బ్రాహ్మణుడు తండ్రి యని, కుంచార మాళి తల్లియని సర్వజ్ఞుడు స్వయముగా తన జన [illegible] చెప్పుకొని యున్నట్లు కొన్ని వచనములు కలవు.

ఇట్టి పుక్కిటి పురాణములు, అశ్లీల భూయిష్టాభూత కల్పనా కథలు ఈ యణుయుగమున కూడ విశ్వసింపబడుటకంటె ఆశ్చర్యకర మైన విషయ మింకొకటి లేదు.

## మూడవ కథ *

పై జెప్పిన కథనే కొన్ని మార్పులతో కొంతమంది వ్రాసిరి. ఈ కథలో మాత్రము అమృతఘుటికలు - దివ్యజ్యోతి యవతరించుట మొదలగునవి లేవు. కొంతవఱకు సంస్కారయుతముగా నున్నది.

---

* మించినబల్లి సర్వజ్ఞున అమరసందేశ - బిందుమాధవ.

బసవరసు శివుని అనుగ్రహము వడసి తిరిగివచ్చుచు దారిలో అంబలూరను గ్రామమున నిలుచుట తటస్థించెను. కాలము మధ్యాహ్నము. ఆకలి బాధ చెప్పుటకు వీలులేదు. అప్పుడాతడు ఒక కుమ్మరివాని యింటికివెళ్ళి, ఒక కుండను కొని, ఒకచో వంట చేసికొనుచుండెను. అప్పుడు పెద్ద వర్షము వచ్చెను. విధిలేక అతడు ఆ వంటసామగ్రితో ఆ కుమ్మరివానియింట ప్రవేశించెను. ఆ యింట 'మాళి' యను పేరుగల బాలవితంతు వొకర్తె యుండెను. ఆమె అతనిని సత్కరించెను. వర్షము కురియుచునే యుండెను. ఆమె అతిలోక సౌందర్యవతి. ప్రియముతో బ్రాహ్మణునకు సపర్యలు చేసెను. వారిరువురు అనురాగబద్ధులైరి. ప్రేమాంబురాశిలో మునిగి తేలిరి. భార్యాభర్తలయిరి.

ఈ విధముగా 'మాళి' గర్భము ధరించెను. ఈశ్వర కృపా కటాక్షమువలన వారికి మన సర్వజ్ఞుడుదయించెను.

## నాల్గవ కథ *

నేటి ధార్వాడ జిల్లాలోచేరిన హిరియకరూర్ తాలూకాలోని కుముద్వతీ నదీతీరమున గల 'అంబలూరు' అను గ్రామమున సర్వజ్ఞుడు జన్మించెను. ఇతని తండ్రి సమీపముననున్న మాసూరు గ్రామవాసి యగు బసవరసు లేక మల్లరసు అను ఆరాధ్య బ్రాహ్మణుడు. తల్లి పేరు మాళి. (కుమ్మరివనిత) ఈ దంపతులకు చాల కాలమువఱకు సంతానము లేదు. దానికి చాల విచారించి పరమేశ్వరుని అనుగ్రహము సంపాదించుటకై కాశికి బయలుదేరిరి. వారు కాశి చేరి, విశ్వేశ్వరుని ప్రార్థించి, తీర్థప్రసాదములను స్వీకరించి, తిరిగివచ్చి అంబలూరునందుండిరి. క్రీ. శ. 1570 ప్రాంతమున నొక మగశిశువు వారికి జన్మించెను. ఆ పిల్లవానికి గుండప్ప అను పేరుపెట్టిరి. గుండప్పకు రెండేండ్లవయసు వచ్చుసరికి తల్లి మాళి

---

* ఈ కథ డా॥ బి. రామకృష్ణరావు శ్రీ అశ్వత్థరావు సర్వజ్ఞ వచనములకు వ్రాసిన పరిచయవాక్యములనుండి గ్రహింపబడినది.

దింపగతురా లయ్యెను. తండ్రి ఆ పిల్లవానిని పోషించుచు మాసూరు లోని కుమ్మరివీథిలో కొన్నాళ్లు నివసించెను. తరువాత కొద్దికాలము నకే తండ్రికూడ మరణించెను. అందుచేత గుండప్ప తల్లిదండ్రులు లేని అనాథబాలు డయ్యెను.

ఈ కథ సత్యమున కత్యంత సన్నిహితమై యున్నది. సర్వజ్ఞ నామధేయము తల్లిదండ్రులు పెట్టినది కాదనియు, మొదటి పేరు గుండప్ప అనియు ఈ కథనుబట్టి తెలిసికొనుచున్నాము. ఇది విశ్వసింపదగిన విషయము.

## సర్వజ్ఞుని జీవితమునుగూర్చి సత్యాన్వేషణము

గుండప్ప గొప్ప తేజోమూర్తి. ఇతని ధారణాశక్తి అనన్య సామాన్యము. 'పూవు పుట్టగనే తావిగొల్పు' నన్నట్లు చిన్నతనముననే ఇతనిలో ప్రతిభావిశేషములు పొడసూపెను. శివధ్యానపరాయణుడై, గొప్ప మేధావియై, సామాన్యప్రజల జీవితములలో నత్యంత శ్రద్ధా సక్తులు కలిగి ప్రజాకవియై ఇతడు ప్రకాశించెను. ఇతని అపార లోక జ్ఞానమునకు మెచ్చుకొని ప్రజలు 'సర్వజ్ఞకవి' అని పిలువజొచ్చిరి.

సర్వజ్ఞుడు పుట్టుకతోనే సంస్కారభావుడు. అట్లగుటకు అతని తల్లిదండ్రులే ప్రథమ కారణము. తల్లి కుమ్మరి స్త్రీ. తండ్రి ఆరాధ్య బ్రాహ్మణుడునని మనము తెలిసికొని యున్నాముకదా! చిన్నతనము ననే తలిదండ్రులను కోల్పోవుట కారణముగ ఇతడు అనాథబాలుడై ఆశ్రయము లేక పెక్కుచోట్ల తిరిగి తిరిగి అనేక కష్టనష్టములకు గురియై యుండవచ్చును. "తాతి దెబ్బలచేత ప్రసూన సుగంధంబు లెక్కుడు వాసన లీనునట్లు" స్వతఃసిద్ధముగా సువాసనగల సర్వజ్ఞ మూర్తికి ఈ బాధలు తాతిదెబ్బ లయ్యెను. దీనివలననే యితడు మహావ్యక్తి అయ్యెనని చెప్పవచ్చును. సామాన్యప్రజల కష్టసుఖము లను తన జీవితముద్వారా తెలిసికొనుటకు సర్వజ్ఞమూర్తికి సదవకాశ మేర్పడెను.

సర్వజ్ఞుడు మొదటినుండియు పీడిత ప్రజానీకమునకు పరమ బంధువు. సమస్తజనులు సుఖముగానుండుటయే అభ్యుదయ సమాజ మని తన కవిత్వముద్వారా బోధించెను. 'జాతి మత కుల మూఢ విశ్వాసరహిత నాగరకసమాజ' నిర్మాణమే ఇతని జీవితాశయము. 'మానవసేవయే మాధవసేవ' — అనియు 'జీవుడే దేవు'డనియు వేనోళ్ల చాటిచెప్పెను.

సర్వజ్ఞుడు వీరశైవమత వాతావరణములో పెరిగినను శివుడే నిజమైన దేవుడని, వీరశైవమే గొప్ప మతమని కొంతమంది వీరశైవ కవులవలె ఎచ్చటను చెప్పలేదు. వేమనవలె ఏకేశ్వరోపాసనమే ఉత్తమసాధనమని నొక్కి చెప్పెను. విగ్రహారాధనను, దొంగభక్తిని, వేషధారితనమును, కుహనానాయకుల మోసము, దగా, నైతిక విశృంఖ లత్వములను అనేక విధములుగా ఖండించెను. ఇతని వచనములలో వేమన్నకువలె స్వానుభవ మను కవితాధర్మము తాండవమాడు చుండును. ఇతడేది చెప్పినను, ఏ ధర్మము నుపదేశించినను అది అనుభవవేద్యమై యుండును.

## సర్వజ్ఞున కా పేరు ఎట్లు వచ్చినది ?

సర్వజ్ఞున కా పేరు తలిదండ్రులు పెట్టినదా? లేక బిరుదా? అనునది చర్చనీయాంశము. సర్వజ్ఞ నామధేయము శర్వునకు గలదు. "సర్వజ్ఞః సుగతో బుద్ధో ధర్మరాజస్తథాగతః" - అని బుద్ధ భగ వానునకు సర్వజ్ఞనామము కలదు. సర్వజ్ఞుడనగా సర్వము నెఱింగిన వాడని యర్థము.

సర్వజ్ఞుడు తానే ఈ బిరుదమును పెట్టుకొనెనని చెప్పుటకు వీలు లేదు. "కామక్రోధములు వదలుడు, అహంకార మమకారములు త్యజింపుడు" - అని బోధించిన సహృదయ శేఖరుడు, నిగర్వి సర్వజ్ఞుడు ఈ విధముగ అహంకారమును ప్రకటించుకొనునా? అట్లు ప్రకటించు కొనిన అతని బోధనలకు విలువ యేమున్నది? అతడెట్లు మహా

పురుషు డగును? సర్వజ్ఞుడే ఆ బిరుదము పెట్టుకొన్నట్లు ఒక వచన ముండుటవలన ఇట్లు పలువు రాలోచింపవలసి వచ్చెను.

"సర్వజ్ఞ నెంబవను గర్వదిందా దవనె?
సర్వరొళొందొందు నుడిగలితు విద్యద
పర్వతవె ఆద సర్వజ్ఞ."

ఈ వచనము పాల్కురికి సోమనాథుని సోమేశ్వర శతక పద్యమును పోలియున్నది.*

పరోక్షముగా సర్వజ్ఞుడు తన పేరును తానే సమర్థించు కొనునట్లున్న దీ వచనార్థము. ఈ వచనము సర్వజ్ఞునిదేనా? అని మనము సందేహింపవలసియున్నది. ఇందలి భావము అతని స్వభావమునకే విరుద్ధము కదా!

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ ఈ విధముగా చెప్పి యున్నారు:

"సర్వజ్ఞుడు సంప్రదాయకవుల కోవకు చెందినవాడు కాదు. పండితుడునుకాదు. అందువలన ఏ రాజు ఇతని శక్తిసామర్థ్యములకు మెచ్చి యిచ్చిన బిరుదుమాత్రముకాదు. ఇతడు సర్వస్వతంత్రుడను మాటమాత్రము సత్యము. ఇతడు సాంఘిక నైతిక ధర్మములను ప్రజల కుపదేశించునపుడు వాని నిష్టపడని కొంతమంది "ఆఁ! ఇతడేమి సర్వజ్ఞుడా?" అని యాక్షేపించి యుండవచ్చును. ఉద్రిక్తస్వభావుడైన ఇతడు వెంటనే "ఏలకాకూడదు?" అని ఆ పేరే యతడుంచుకొని, ఈ వచనమొకటి రచించి, వారి మొగమున పారవేసి అప్పటినుండి అతడు రచించిన వచనముల చివఱ 'సర్వజ్ఞ' మకుట ముంచి యుండవచ్చును."**

*" కెలవం పల్లవరింత కల్లు కెలవం శాస్త్రగళిం కేళుతం
కెలవం మాళ్పవరింద కండు కెలవం సుజ్ఞానదిం నోడుతం
కెలవం సజ్జన సంగదింద అఱియల్ సర్వజ్ఞ నప్పం నరం
పలవుం పళ్ల సముద్రవై పార, హారా శ్రీ చెన్నసోమేశ్వా"

** శ్రీ అనంతకృష్ణశర్మగారి వేమన - పుట 118.

వీరి యూహ అంత సమంజసముగా లేదని నా యభిప్రాయము. సర్వజ్ఞుడు ఒకచోట అత్యంతమనోహరముగా చెప్పిన ఈ వచనమును చూచిన ఆతని మనస్తత్త్వము మనకవగత మగును.

"ఎన్న మనసిగెనెనహ పన్నగధర కొట్టి
బిన్నణ దింద స్తుతిగైదు పొగళువె
చెన్న మూరితియ సర్వజ్ఞ."

నా హృదయమున నవ్యభావములను కలుగజేసినట్టి పరమేశ్వరుని ఆ నవ్యవాక్కులతోడనే అతని దివ్యనామము స్తుతించుటకంటె నాకు ఫలమీ భూలోకమున నేమికలదు! అనెను.

భక్తిరస ప్రపూరితమైన ఈ వచనమే సర్వజ్ఞుని మృదు హృదయమును ఆవిష్కరించుచున్నది. జ్ఞానస్వరూపుడైన పరమశివుని మనస్సున నిల్పుకొని, ఆతని దివ్యమనోహరనామము ప్రతి వచనము చివర మకుటముగా చేర్చుకొన్నట్లు మనము గ్రహింపవలెను.

ఈ విధముగా వచనముల చివర పరమేశ్వరుని నామము మకుటముగా నుంచి కీర్తించుట వీరశైవ వచనకారులకు క్రొత్తది కాదు.

"కూడల సంగదేవా!"

"చెన్న మల్లికార్జునా!"

"సోమేశ్వరా!" — మొదలగునవి యెన్నియో చూడనగును. వేమన్న 'విశ్వదాభిరామ' మకుటముకూడ ఇట్టిదే. విశ్వదుడు అనగా జగత్కర్త. 'అభిరామ' అనగా ప్రియమైనవాడా! అని యర్థము. ఈ మకుటములేని వేమన పద్యములు కూడ కొన్ని కలవు.

సర్వజ్ఞుడుకూడ ఈ విధముగనే జగత్కర్తయు, జ్ఞానస్వరూపుడునైన సర్వజ్ఞుని (పరమశివుని) తన వచనము చివర మకుటముగా నుంచి, తరించెనని చెప్పుట సర్వవిధముల సమంజసముగా నున్నది.

## సర్వజ్ఞుని కాలము

సర్వజ్ఞుని కాలమునుగూర్చి కూడ పండితులలో ఏకాభిప్రాయము లేదు. శ్రీ కిట్టెల్ పండితుడు, ఇతడు 18–వ శతాబ్దమున నున్నవాడనియు, శ్రీ ఆర్. నరసింహాచార్యులు 17–వ శతాబ్దమనియు, శ్రీ ఉత్తంగి చెన్నప్ప, శ్రీ ఇ. పి. రైసుదొర 16–వ శతాబ్దమనియు ఊహించిరి. వీరి యూహలనుగూర్చి ఇచ్చట కొంచెము చర్చింతము.

సర్వజ్ఞుని పేర ప్రచారములోనున్న కాలజ్ఞాన పద్యములలో విజయనగర సామ్రాజ్యము మహమ్మదీయుల వశమగు విషయము, ఇక్కేరి సంస్థానము పడిపోవుట (1763), శ్రీరంగపట్టణము ఆంగ్లేయుల వశమగుట మొదలగు విశేషములు చెప్పబడియున్నవి. దీనినిబట్టి సర్వజ్ఞుని కాలము క్రీ. శ. 1800–వ శతాబ్దమై యుండ వచ్చునని శ్రీ కిట్టెల్ దొర ఊహించెను.

సుప్రసిద్ధ పండితులు, చరిత్ర పరిశోధకులు శ్రీ ఆర్. నరసింహాచార్యులు, ఈతని కాలమును గూర్చి మూడు విధముల నూహించిరి.

(1) సర్వజ్ఞ గణేశ్వరుడనువాడు కాలజ్ఞాన పద్యములను (వచనములను) వ్రాసియుండెను. అందతడు బసవతుడివాళ్లయ్య, సొడ్డళ బాసరస మొదలగు శివశరణుల కితడు సమకాలికుడని చెప్పబడెను. కాని అందు శ్రీరంగపట్టణము ఆంగ్లేయుల వశమగుట, రైలుబండి, తంతి మొదలగు విశేషములు కానవగుటచే నితడు 1799 తరువాతి

వాడై యుండవచ్చుననిరి. అదే కర్ణాటక కవి చరిత్రలో వీరు భాషా సంబంధమైన వేఱొక విశేషమును ఆధారముగా చేసికొని ఈ విధముగ నభిప్రాయమును మార్చుకొనిరి.

(2) 18-వ శతాబ్దమునకు పూర్వము వ్రాయబడిన ఇతని గ్రంథము తాటాకులలో లభ్యమగుటచేతను దానిలో ప్రాచీన కన్నడ 'ఱ' అక్షరముండుటవలనను ఇతని కాలము సుమారు 1700 తరువాతిదై యుండజాలదని చెప్పిరి.

(3) ముద్రితమైన సర్వజ్ఞుని వచనములలో ఒకదానికొకటి సంబంధములేదు. వీనిలో క్రొత్తవచనములు చేరియుండునని తోచుచున్నది. మాకు లభ్యమైన ఒక తాటాకుప్రతిలో 'సంపాదనెయ సిద్ధవీరాహ్వాయాచార్యులు చేర్చిన సర్వజ్ఞమూర్తి నిరూపించిన త్రివిధి' — అని యున్నది. అందువలన ఈ సర్వజ్ఞమూర్తి మన సర్వజ్ఞకవియై యుండినయెడల ఈ సంపాదనెయ సిద్ధ వీరాచార్యులకంటె ముందు యుండవచ్చును. అనగా సుమారు 16-వ శతాబ్దము. సిద్ధవీరాహ్వాయాచార్యులు 'ఎళమలయగురుశాంకదేవు'ని శిష్యుడు. ఇతడు గొప్ప శివయోగియైనట్లును, 'అనాది వీరశైవసారసంగ్రహ' మను గ్రంథమును సంస్కృతమున రచించినట్లును తెలియుచున్నది. 'ఆచరణెయ నిబంధ త్రివిధి' అను పేర సర్వజ్ఞుని వచనములను సంకలనము చేసెను. ఇందులో 265 త్రివిధులు కలవు. ఇది అన్నిటికంటె బలమైన యాధారమని చెప్పవలెను. దీనినిబట్టి సర్వజ్ఞుని కాలము 16-వ శతాబ్దమని నిర్బాధకముగ చెప్పవచ్చును. ఈ కాలనిర్ణయమును శ్రీ ఇ. పి. రైసు పండితుడు, శ్రీ ఉత్తంగి చెన్నప్ప, డా॥ ఆర్. యస్. ముగళి, ఆచార్య మరియప్పభట్టు మొదలగువారు అంగీకరించిరి. కాలజ్ఞాన పద్యములను ఆధారముగాగొని శ్రీ కిట్టెల్ పండితుడు మొదలగువారు చేసిన కాలనిర్ణయము అర్థములేనిది. ఆ వచనములు సర్వజ్ఞునివి కావని పెక్కుమంది సహృదయుల అభిప్రాయము.

మఱికొంతమంది పండితులు ఇతడు వేమనకు సమకాలికు డనియు, ఈ యిరువురి సంభాషణ పద్యములని కొన్ని పద్యములను, వచనములను చూపుచున్నారు. ఈ పద్యవచన ఒకరితో నొకరు మాటలాడుకొని వ్రాసినట్లున్నదని చెప్పుటలో సత్యమున్నది. కాని సమకాలికులని చెప్పుటలో సుంతైన సత్యము లేదు. వేమన 17-వ శతాబ్దమువాడని పండితులు, చరిత్ర పరిశోధకులు నిర్ణయించిరి. సర్వజ్ఞుడు 16-వ శతాబ్దమువాడు కావున సర్వజ్ఞుని ప్రభావమే వేమనపై నుండిన నుండవచ్చును.

చిరకాలమునుండియు మన దేశమును పట్టుకొని పీడించు చున్న దీర్ఘవ్యాధి కుల మత సంకుచిత విభేదములు, మూఢ విశ్వాస ములే. ఇవియే గత కాలమున అనేక పర్యాయములు దేశైక్యభావ మునకు భంగము కలిగించినవి. ఇవియె పరదాస్యమునకు త్రోవ తీసినవి; ఇవియే తుదకు దేశమును ముక్కలు చెక్కలుగా చేసిన* వని సామాన్య చరిత్రజ్ఞానము గల భారతీయుడు కూడ చెప్పగలడు. స్వాతంత్ర్యము వచ్చిన నేటికిని ఇవి దేశమునందచ్చటచ్చట తల యెత్తుచునే యుండుట చూచుచున్నాము.*

హైందవ సమాజాభివృద్ధికి మొదటిలో వర్ణాశ్రమ ధర్మములు చాలవఱకు తోడ్పడినవనుటలో సందేహము లేదు కాని కొంత కాల మునకు అవి వెఱ్ఱితలలు వేసి, వికృతరూపములు ధరించినవి. నాలుగు వర్ణములతో సంతృప్తిచెందక హిందూ సమాజము పంచమజాతి యను పేర ఒక అంటరాని జాతిని కూడ సృష్టించినది. ఇప్పటికిని – ఈ అణుయుగమున కూడ – కొంతమందికి బూజుపట్టిన ఈ వ్యవస్థపై ప్రగాఢ విశ్వాసముండుట విచారకరమైన విషయము. ఇటీవల జగద్గురు బిరుదాంకితులు పూరీ శంకరాచార్యులవంటివారు కూడ ఈ వ్యవస్థలో తమ గాఢవిశ్వాసమును ప్రకటించుట అత్యంత శోచ నీయము.* ఇక సామాన్య ప్రజానీకమునుగూర్చి వేఱె చెప్ప వలయునా?

* నూతన రాజ్యాంగ రచనానంతరము సభ్యులు చేసిన విమర్శలకు సమాధాన ముగా డా॥ అంబేద్కర్ చేసిన ఉపన్యాసమును చూడనగును.

* **Action against Puri Acharya under study.**

**BOMBAY, Mar 31 (UNI), 1973.**

**The Maharashtra Government is scrutinising the objectionable part of the recent speech of Sankaracharya of Puri at Kolhapur where he preached continuation of 'Chaturvarna System' (The division of society into four castes). The Government will take action against Sankaracharya in accordance with legal advice.**

జాతి పురోభివృద్ధికి గొడ్డలిపెట్టయి, మన దేశమునకు పట్టిన ఈ దీర్ఘవ్యాధిని తుదముట్టింపకపోయిన మన సమాజమునకు మోక్షము లేదు. మన జాతి వెనుకబాటుతనమునుండి విముక్తి గాంచదు.

భారతజాతికి పట్టిన ఈ దుష్టవ్యాధిని పోగొట్టుటకు నిరవధికమైన కృషి చేసిన వైద్యపుంగవులలో బుద్ధభగవానుడు మొదటివాడు, ముఖ్యుడని కూడ చెప్పవచ్చును. శాస్త్రదృష్టితో (కారణ విమర్శన దృష్టితో) ఈ వ్యాధిని సమూలముగా రూపుమాపుటకు పరిశ్రమించిన మహానుభావు డీతడు. బౌద్ధయుగమున భారతము ఈ వ్యాధి నుండి కొంతవఱకు విముక్తి గాంచినట్లు అగుపించినది. కాని తరువాత కొంత కాలమునకు మఱల యథారూపమునే దాల్చినది. దానికి ముఖ్యకారణములు బౌద్ధమతములో హీనయానము, మహాయానము అను రెండు శాఖ లేర్పడుట. అందులోనుండి వజ్రయానాది మఱికొన్ని చీలిక లేర్పడుట. బౌద్ధ భిక్షువులు వారి ఆదర్శములు తప్పుట, బోధిసత్త్వుడు ప్రసాదించిన హేతువాదదృష్టి వారిలో సన్నగిలుట, మహాయానములోని విగ్రహారాధనము – చివరకు బౌద్ధము పట్ల రాజాదరణము తగ్గుట మొదలగునవి.

ఈ వ్యాధిని నిర్మూలించుటకు ఆ వెనుక కూడ ఆయా కాలములలో పెక్కుమంది వైద్యులు బయలుదేరిరి. రోగనిర్మూలనకై ఎందఱో పాటుపడిరి. వారిలో అత్యంత ముఖ్యులు రామానుజాచార్యులు, బసవేశ్వరుడు, రాజా రామమోహనరాయ్, దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానందస్వామి మొదలైన ప్రవక్తలు. సంఘ సంస్కర్తలు. వీరెంత త్రికరణశుద్ధిగ పాటుపడి

---

This was stated by Chief Minister V. P. Naik in the statement placed on the table of the assembly today in response to a call attention notice by Mr. K. S. Dhondgo (PWP).

The statement said the Maharashtra Govt. which believed in social equality, did not approve of the preaching in favour of the continuance of the 'Chaturvarna System'.

నను వారి యుద్యమములలో శాస్త్రదృష్టి బలముగా లేనందున రోగ మును కొంతవఱకు ఉపశమింపజేయుటకు మాత్రమే ఉపయోగ పడెను కాని మొదలంట రూపుమాపకపోయెను. వీరశైవ వైష్ణవ ములలో క్రొత్త విభేదములు, క్రొత్త మూఢ విశ్వాసములు తల యెత్తినవి. ఈ మతములవలన సంఘమునకు మేలుకంటె కీడే ఎక్కువ కలిగెనేమో! అను నంతవఱకు వెళ్లినరోజు కూడ చరిత్రలో లేక పోలేదు.

వైదిక మతమందలి సంకుచిత వర్ణవ్యవస్థ, మూఢ విశ్వాస ములు ఒక మనుష్యుని ఇంకొకరినుండి వేఱుచేసి ఒకనికంటె తాను గొప్పవాడనను భావమును, దురహంకారమును ఎక్కువ చేసినవి. ఈ దురహంకారము సంఘాభివృద్ధికి, జాత్యైక్యమునకు చెప్పరానంత హాని కలిగించినది. ఈ దుష్టభావమును నిర్మూలించుటకు కృషి జరుగవలెను. ఈ విధానములో ఎక్కువ విశ్వాసమున్న కొన్ని కుల ములను, జాతులను ద్వేషించి, దూషించినంత మాత్రమున ఈ సమస్య శాశ్వతముగా పరిష్కరింపబడదు. ప్రజలు వ్యవస్థకు బానిసలు. ప్రజలను ద్వేషించిన ప్రయోజనము లేదు. వారి నావరించియున్న వ్యవస్థను (విధానమును) నాశనము చేయుటకు గట్టి కృషిచేయ వలెను. ఇంతవఱకు ఈ వ్యవస్థను ద్వేషించి, ఖండించుచు వచ్చిన ఉద్యమ కర్తలకు ఈ దృష్టిలేదు. అందువలన ఫలితములు సంతృప్తి కరముగా లేవు.

ఈ విధానమును శాశ్వతముగా రూపుమాపుటకు మార్గములు శాస్త్రదృష్టితో మనము కనుగొనవలెను. మొదట మన విద్యా విధానమును సంస్కరింపవలెను. ఇంతవఱకు మన విద్యావిధానములో ఏ విధమైన మార్పులు లేవు. పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఎన్నియో పర్యాయములు మన విద్యావిధానము ప్రగతిమార్గములో లేదనియు, బ్రహ్మాండమైన మార్పులు జరుగవలెననియు, కొన్ని పాశ్చాత్య దేశములలో జరిగిన మార్పులను, ప్రగతిని గూర్చి అభి

వర్ణించుచు ఉపన్యసించుచుండిరి. వారు గొప్ప ఉపన్యాసకులు. మానవ చరిత్రను బాగుగా అర్థముచేసికొనిన మహనీయ గుణోపేతులు. ఏమి ప్రయోజనము? ఒక్క మార్పుకూడ అతని జీవితకాలమున రాలేదు. ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే యున్నది. ఆ పూర్వ సంప్రదాయములు, ఆ మూఢవిశ్వాసములు క్రొత్త క్రొత్త మార్గ ములలో నభివృద్ధిచెందుచునే యున్నవి. మన ప్రజాస్వామ్యము క్రొత్తవగు కులమతములను సృష్టించుచున్నది. అన్నియు జాతి కుల మత ప్రాతిపదికపైనే జరుగుచున్నవి. ప్రజలలో సంకుచిత శక్తులు పెరుగుచున్నవి. సృజనాత్మక శక్తులు నశించుచున్నవి.

ఇట్టి సంఘదౌర్భాగ్యమునకు మన విద్యావిధానమే ముఖ్య కారణమని వేఱ చెప్పనవసరములేదు కదా! ఎందుకు? ఎట్లు? అను మాటలకు స్థానములేని విద్యావిధానము మనది. దీనిని పూర్తిగా తొలగించి, దీని స్థానమున హేతువాద విలసిత విద్యావిధానమును ప్రవేశపెట్టవలెను. మానవుని విచక్షణాజ్ఞానమును, కారణ విమర్శనా శక్తిని పెంపొందింపజేయునదియే నిజమైన విద్య. అట్టి విద్యాశక్తితో మానవుడు వాస్తవావాస్తవ పరిజ్ఞానశీలుడగును. కృత్రిమములు, సంకుచితములునైన కుల మత మూఢవిశ్వాసములు అతని దృక్పథము నుండి పంచబంగాళమగును. అప్పుడే ఉత్తమ సమాజ నిర్మాణము సాధ్యమగును.

రెండవది మన ఆర్థికవిధానము. ధనిక దరిద్రుల మధ్య గల వ్యత్యాసము తొలగించి, సామ్యవాద వ్యవస్థను నెలకొల్పవలెను. మహాత్మ గాంధీ చెప్పిన "సమాజ సహకార సంఘజీవితము", పండిత జవహర్‌లాల్ నెహ్రూ చెప్పిన సామ్యవాదపు తరహా వ్యవస్థ నిర్మాణ నినాదము. ప్రజాజీవితములో ఆశించినంత ప్రగతిని సాధింప లేక పోయినవి. సామ్యవాదము, సమాజ న్యాయము అని నినాద ములు చేసినంత మాత్రమున అది వచ్చునా? దానిని అమ లులో పెట్టుటకు నిర్మాణాత్మక కృషి జరుగవలెను. ఆ కృషికి

శాస్త్రదృష్టి కావలెను. శాస్త్రదృష్టితో నెలకొల్పిన సామ్యవాద వ్యవస్థ చెక్కు చెదరక శాశ్వతముగా నిల్చును. ఈ సత్యమును సామ్యవాద దేశములనుండి గ్రహింపనగును.

సమాజములో ఆర్థిక సమానత్వమేర్పడిననాడు సాంఘిక న్యాయముకూడ దానంతటదే యేర్పడును. ఈ రెంటికి నవినాభావ సంబంధ మున్నది.

సామ్యవాద సమాజములో సోమరితనమునకుగాని, స్వార్థపర తకుగాని చోటుండదు. అందఱు శ్రమచేసి జీవింపవలసినదే. దేశ సౌభాగ్యములో నందఱు భాగస్వాములే. బాధ్యత దేశప్రజల పరమ ధర్మము. ఈ ధర్మము లనెడి స్తంభములమీదనే సామ్యవాద సమాజ సౌధము నిర్మింప సాధ్యమగును.

భారతదేశమునకు పట్టిన జాతి కుల మత మూఢవిశ్వాస జాడ్యమును పూర్తిగా నిర్మూలించుటకు అభ్యుదయకాముకులైన భారతీయుల కిదియే ఏకైక మార్గము. ఈ శాస్త్రదృష్టిని మాన వతావాదముతో జోడించిన దివ్యసందేశము బుద్ధ భగవానుడు మన కెప్పుడో ప్రసాదించెను. దురదృష్టవశమున మనము దానిని పూర్తిగా విస్మరించినాము. చారిత్రకబౌద్ధమే మన దేశమున నామ రూపములు లేకుండ నాశనమైనది.

ఈ దీర్ఘవ్యాధిని బాగుచేయుటకు వేమన్నకూడ తన శాయ శక్తుల ప్రయత్నించిన వైద్యపుంగవులలో నొకడు. ఇతడు అసంఖ్యా కులైన సంస్కర్తలవలె పుట్టమీద కొట్టి, లోనున్న పామును చంప ప్రయత్నించినవాడు కాడు. అసలు పామునే పట్టి చంప ప్రయత్నిం చిన ప్రత్యక్ష వేదాంతి. ఇతడు ఉదాసీనభావుడు కాడు. బాధ్యతా యుత నైతిక జీవితమును నమ్మినవాడు. మానవుల నిత్యజీవితమునకు సంబంధించిన ప్రతి సమస్యను తన సమస్యగా భావించి, దానిని తన తార్కికదృష్టితో నెదుర్కొని, పరిష్కారమార్గమును జూపిన ప్రగతి

వాది. కీ. శే. డా॥ కట్టమంచి రామలింగారెడ్డి తన 'కవిత్వ తత్త్వ విచారము' లో చెప్పిన ఈ మాటలను చూడదగును :—

"ఈతడు గొప్ప రహస్యములను బోధించినవాడైనను, తనకు నైజమగు బుద్ధినేగాని, పలుతెరంగుల విపరీత వ్యాఖ్యానమునకు పాలగు శాస్త్రముల నాశ్రయింపలేదు. అనేకులు సిద్ధాంతముల కాధారములు ప్రాచీన సూత్రములని నమ్మి వానిని వల్లించుటకై జ్ఞాపకశక్తిని వృద్ధిచేయుచు మనశ్శక్తిని గోల్పోవుచున్నారు. ఇక వేమన్న యన్ననో కారణ విమర్శనాశక్తికి పట్టాభిషేకము చేసిన మహానుభావుడు."

వేమన్న కాలమునాటి తెలుగు సమాజము అన్ని విధములైన దురాచారములతో కశ్మల భూయిష్ఠముగా నుండెను. వీరశైవ, వైష్ణవ మతద్వేషములు, ఆ మతగురువులు చేయుచున్న వంచన, దగా, ప్రజల అజ్ఞానము, కొంతమంది బ్రాహ్మణులు యజ్ఞయాగాదుల పేరుతో చేయుచున్న దుర్మార్గపు చర్యలు, మంత్ర తంత్రముల లోను, కాయసిద్ధులలోను ప్రజల ప్రగాఢవిశ్వాసము, సమాజమును చెదపురుగులవలె తినుచున్న వర్ణవ్యవస్థ వేమన కాలమునాటి ప్రత్యక్ష సత్యములు. "జాతి, కుల, మత, వర్ణ భేదరహిత నాగరిక సమాజ నిర్మాణము" వేమన ధ్యేయమగుటచేత పై జెప్పబడినవన్నియు తన ఆశయమున కడ్డుతగులుచుండెను. వానిని సమూలముగా నాశనము చేయక అభ్యుదయ సమాజనిర్మాణము సాధ్యము కాదు. వానిపై ధ్వజమెత్తి అతడీ విధమున శంఖారావము చేసెను :

"కులము హెచ్చు తగ్గు కొదువల పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాట నెట్లు బుట్టగవచ్చు?..."

దైవసృష్టిలో అన్ని జాతులు ఒకరి తరువాత ఒకరు పుట్టిన తోబుట్టువులవంటివి. వీనిలో హెచ్చుతగ్గులనుట అర్థములేని మాట. అందు

వలన ఎక్కువ, తక్కువ అను మాటలను కట్టిపెట్టి మానవులందఱు ఒక జాతిగా మనవలె ననెను. వసుధైక కుటుంబవ్యవస్థ నే నాడో ఎలుగెత్తి చెప్పెను.

"ఉర్వివారి కెల్ల నొక్క కంచముపెట్టి
పొత్తు గలిపి కులము పొలియఁజేసి
తలను జెయ్యిపెట్టి తగ నమ్మఁజెప్పరా..."

ఈ భూలోకములో నున్న సమస్త ప్రజలకు ఒకే కంచము పెట్టి, అన్నదమ్ముల మధ్యవలె వారిలో నత్యంత స్నేహభావ మేర్పఱుప వలెను. కుల వ్యవస్థ నిర్మూలింపవలెను. 'కులములో మాకు విశ్వాసము లేదు' అని వారిచే ప్రమాణము చేయింపవలెను.

వేమన్న సాంఘిక సమస్యాపరిష్కార విషయమున ఏ మాట చెప్పినను అది ఆత్మవంచన లేనిదై, కచ్చితముగా, సూటిగా నుండును. కాని అస్పష్టముగా అంతరార్థములతో నిండియుండదు. ఇతని మాటలలోని ప్రత్యేకతయే యిది. దానికి కారణము అది అతని సొంతమగుటయే. ధర్మమునకు, న్యాయమునకు జన్మస్థానము మానవుని హృదయాంతరాళముగాని, శాస్త్రములు కావు. ధర్మములుగూడ దేశకాల పాత్రల ననుసరించి యుండును. సంఘాభివృద్ధికి ఏ ధర్మములు తోడ్పడునో అవే ఉత్తమోత్తమ ధర్మములు. సంఘ విచ్ఛిత్తికి, జాతి వినాశనమునకు దారి తీయునవి ఏ గొప్ప ధర్మ శాస్త్రములలోనివైనను అవి అధర్మములే యని గట్టిగా చెప్పవలెను.

ఉర్విలో నున్న ప్రజలందఱు ఒక కుటుంబములోని సభ్యుల వలె కుల మత భేదములు విడిచి, మనసులు కలిగి, మమతలు పెంచి మెలగవలెను-అని వేమనార్యుడు ఉపన్యసించెను.

సంఘమునకు నష్టమును కలిగించు దురహంకారపూరితమైన విధానము ఏ కులములో నున్నను, ఏ సంఘములో నున్నను, ఏ మతములో నున్నను వేమన్న వానిని నిర్దాక్షిణ్యముగా ఖండించెను.

ఆ కాలమున కొందఱు బ్రాహ్మణుల దురాచారములు వర్ణనాతీతములు. వారు సాక్షాత్తుగా బ్రహ్మముఖమునుండి జాఱిపడినట్లు వ్యవహరించుచు, ధర్మశాస్త్రములను కంఠస్థముచేసి, దుర్మదముతో తక్కిన జాతులను హీనముగా చూచుచుండిరి. వారు చేయుచున్న వివిధ తప్పులైనను-ఒప్పులుగనే చెలామణి యగుచుండెను. వారు చెప్పినదే వేదము. వారన్నదే ధర్మము. వారి మాటకు అడ్డు ఆపు లేదు. ఆనాటి ప్రజలకు గూడ వారిలో గొప్ప విశ్వాస ముండెడిది. పురాణములు, ధర్మశాస్త్రములు వారి అఘాయిత్యములకు సర్వవిధముల తోడ్పడుచుండెడివి. "వారు బ్రాహ్మణులె యే రీతైన సైరింపంగ" అన్న భారతములోని ద్రౌపది వాక్యములవంటివి వారి దురహంకారమును మఱింత బలపఱచుచుండెను.

ఆత్మవంచన లేని సహృదయాగ్రగణ్యుడు మన వేమన. ఉత్తమ సమాజ నిర్మాణమునకు అడ్డుతగులుచున్న సంఘద్రోహుల దురహంకారమును, అరాచకములను చూచుచు అత డెట్లు సహింప నేర్చును? వానిని ఎదుర్కొని తుదముట్టించుటయే అతని ధ్యేయము.

సోమయాజులని పేరుపెట్టుకొన్న కొందఱు బ్రాహ్మణులు కుండలములు ధరించి, యజ్ఞయాగాదుల నెపముతో మేకనంజుడు తినుట కలవాటుపడి, సోమరసము త్రావి, సొక్కి సోలి పరిపూర్ణ బ్రహ్మానందము ననుభవించుచుండిరి. ఇహలోకమున నివే వారి వైదిక కర్మనిష్ఠకు ప్రత్యక్షఫలము. ఇక పరలోక సౌఖ్యములగూర్చి విచారింతము. ఇహలోకములో చేసిన యీ యజ్ఞయాగాదులవలన స్వర్గలోకమున సోమయాజులవారు రంభాదివేశ్యల పరిరంభ సౌఖ్యమనుభవించునట! పెద్దనగారి వరూధిని కూడ ఈ సౌఖ్యమునే ప్రవచించెను:

"యజ్ఞకోటులం, బావను లౌటకున్ ఫలము
మా కవుగిళ్ల సుఖించుటే కదా!"

అని యన్నది. పరమ ఛాందసుడైన ప్రవరుడు ఆమె మాటలను పెడచెవినిపెట్టి వెళ్ళిపోయెను.

మన వేమన ఈ సోమయాజుల నేమనుచున్నాడో చూడుడు :

"పేరు సోమయాజి పెనుసింహబలుఁడాయె
మేకపోతుఁబట్టి మెడను విఱువ
కాక క్రతువువలన కలుగునా మోక్షంబు?..."
"లంజకొఱకు మేక నంజుడు తినసాగి
యజ్ఞమెల్ల కామ యజ్ఞమాయె
మొదట సోమయాజి తుది కామయాజిరా..."

పేరు మాత్రము సోమయాజి. కాని మేకల మెడలను విఱుచుటలో పెద్ద కీచకుడని చెప్పవలెను. మేకల మెడలను విఱచుటచేతను, వాని మాంసమును తినుటచేతను తప్ప యజ్ఞమువలన అతనికి మోక్షము కలుగునా?

భూలోకములోని వేశ్యలను సంతృప్తిపఱచుటకు, సర్వ లోకములలోని వేశ్యలను పొందుటకు సోమయాజిగారికి మేక నంజుడు కావలెను. దానికొఱకు అతడు మొదట సోమయాజియై, యజ్ఞకర్మ చేసి, తుదకు కామయాజియై యజ్ఞఫలమును అనుభవించుచున్నాడు.

ఇవి ఆ నాటి కొంతమంది బ్రాహ్మణుల యజ్ఞయాగాదులలోని ఐహికాముష్మిక ఫలములు

వేమన కొంతమంది బ్రాహ్మణులు చేయుచున్న దురాచారములను నిశితముగా విమర్శించెను. ఆ బ్రాహ్మణులే కాదు, అటువంటి నైతిక పతనమునకు త్రోవదీయు సంఘవిద్రోహకరమైన పనులు చేయుచున్న ఏ జాతివారైనను, ఏ కులమువారైనను అతనికి పరమ శత్రువులే. వేమన్నకు ప్రత్యేకముగా ఏ కులముపైని ద్వేషము లేదు. అతని ద్వేషము ఆ విధానము మీద.

వేమన కాలమున తెలుగు సంఘములో బ్రాహ్మణ జాతి సర్వ విధముల ఉన్నతస్థితిలో నుండెను. ముఖ్యముగా విద్యా వైజ్ఞానిక రంగములలో వారికి గొప్ప స్థానము కలదు. పల్లెటూరి బడిపంతులు మొదలు ప్రధానామాత్య పదవివఱకు వారు లేనిచోటే లేదు. పండితులుగా, ఉపాధ్యాయులుగా, పురోహితులుగా వారు సంఘములో గొప్ప స్థానము నాక్రమించి యుండిరి. అట్టివారు 'ఇతరులకంటె తాము శ్రేష్ఠులము' అను దురభిమానమును విడిచి సహృదయత్వముతో ముందుకు వచ్చి, విద్యావిహీనులై వెనుకబడియున్న అశేష ప్రజానీకమునకు విద్యాజ్ఞాన భిక్షపెట్టి వారి పురోభివృద్ధికి తోడ్పడవలెను. అభ్యుదయ సమాజ నిర్మాణమునకు ఉత్తమ జీవనసాధనకు తోడ్పడవలెను. అట్టి సహృదయ బ్రాహ్మణులకు సమస్త సౌభాగ్యము లీవచ్చును:

ఇది వేమన అభిప్రాయము:

"బ్రాహ్మణులకు సకల భాగ్యంబు లీవచ్చు
గారవింపవచ్చుఁ గోరి వారి
జ్ఞానమొసఁగి జనులఁ గడతేర్పఁ గలిగిన..."

ఆనాటి సమాజమున శైవ, వైష్ణవ మతగురువులు చేయుచున్న దుర్మార్గపు చేష్టలు వర్ణనాతీతములు. వీరు సంఘమును, శనిదేవతలవలె నానాబాధలు పెట్టుచుండిరి. బారెడేసి జడలు, భస్మంబు పూతలు, పులితోళ్లు, కక్షపాలలతో అపరశంకరులవలె వేషములు వేసికొని, మోక్షధర్మముల నుపన్యసించుచు, యోగసిద్ధులను దెలుపుచు వంచనమతులై గుంపులు గుంపులుగా తిరుగుచుండిరి. ఇక వైష్ణవ గురువులా, వారు పట్టుబట్టలను ధరించి, పట్టె నామములను తీర్చుకొని సాక్షాత్ ఆదివిష్ణువు అవతారమువలె నటించుచు విఱ్ఱవీగుచు తప్ప త్రాగి లోకులను చెఱచుచుండిరి. ఈ పరాన్నభుక్కులను, ఈ యాత్మవంచకులను వేమనార్యుడు ఎంత తీక్ష్ణముగా విమర్శించెనో చూడనగును:

"మతపు వేషగాండ్రు మహిమీఁద పదివేలు
మూఢజనులఁ గలఁప మూఁగుచుండ్రు
కొంగలు గుమికూడి కొఱకవా బోదెలు..."

"బొరెడేసి జడలు భస్మంబు పూఁతలు
మరునితోడ మాఱు మలయఁగలఁడు
ముంజి కోకలెల్ల లంజె కోకలకాయె..."

"పొడుగు గల్లుసట్టె పులితోలు భూతియు
కక్షపాలలు పదిలక్షలైన
మోతచేటు గాని మోక్షంబు లేదయా..."

"పట్టుబట్టఁ గట్టి పట్టెనామముఁ బెట్టి
వట్టి భ్రాంతిఁజెంది వైష్ణవుఁడయి
లొట్టి త్రాగి యతఁడు లోకులఁ జెఱచురా..."

ఈ మోసగాండ్రు వేషభాషలతో అమాయక ప్రజల నాకర్షించు చుండిరి. ఆకు లలములు తినుటవలన కాయసిద్ధి కలుగునని జనులకు బోధించుచుండిరి. మూఢ ప్రజలు వారి మాటలను పరమప్రమాణముగా తీసికొని నానావస్థలను పడుచుండిరి. "ఆకులు – అలములు తిన్నంతలో కాయసిద్ధులు కలిగిన ఎన్నో రకములైన ఆకు లలములు తినుచున్న మేకపోతులకు ఎందులకు కాయసిద్ధులు కలుగ లేదు? మీరు విచక్షణాజ్ఞానమును పెంపొందింప జేసికొనుడు. అంధవిశ్వాసములనుండి విముక్తి పొందుడు" అని వేమన్న పదేపదే బోధించెను.

"ఆకులెల్ల దిన్న మేకపోతులకెల్ల
గాకపోయెనయ్యొ కాయసిద్ధి
లోకులెల్ల వెఱ్ఱిపోకళ్లు పోదురు..."

వేమన బోధనలు ఆ వెఱ్ఱిప్రజల తలలకెక్కుటలేదు. వారికి బోధించుట చాల కష్టము. పొట్లకాయ చివరనైనను ఒక తాయి

కట్టి చక్కజేయవచ్చునుగాని కుక్కతోక చక్కజేయ ఎవరికి సాధ్య మగును? అని ఒక్కొక్కప్పుడు బాధపడుచుండెడివాడు. ఉదాసీన భావుడు కామిచే నిస్పృహ చెందక, మఱల మఱల బోధించు చుండెడి వాడు.

వేమన్న ఏకేశ్వరోపాసకుడు. మూఢభక్తి అజ్ఞానమునకు చిహ్నమని ప్రజలకు చాటిచెప్పెను. విగ్రహారాధనను తీక్ష్ణముగా ఖండించెను. ఆ దేవుడు గొప్ప – ఈ దేవుడు కొద్ది అని దేవతలలో, ఈ మతము శ్రేష్ఠము – ఆ మతము హీనము అని మతములలో హెచ్చు తగ్గులు, భేదములు ఏర్పఱచి వాదులాడుకొనుచున్న మూఢ జనుల నుద్దేశించి ఈ విధముగా ననెను:

"పసుల వన్నె వేఱు పా లేకవర్ణమే;
పుష్పజాతి వేఱు పూజ యొకటి
దర్శనములు వేఱు దైవంబ దొక్కటి..."

"దర్శనములు వేఱైనను దేవు డొక్కడే. ఏకేశ్వరోపాసన చేయుడు. దేవతలలో, మతములలో లేనిపోని భేదములను కల్పించు కొని ఎందులకు మీ బుద్ధిని పలువిధముల పోనిచ్చెదరు? జీవుడే దేవుడు. జీవులను ప్రేమింపుడు. వారికి ప్రియమును జేకూర్పుడు. రాళ్లను పూజించిన ప్రయోజనము లేదు" అన్న వేమన్న ప్రబోధ మును చూడుము:

"శిలలఁజూచి నరుఁడు శివునిగా భావించు
శిలలు శిలలుగాని శివుఁడు కాఁడు
తనదులోన శివునిఁ దా నేల దెలియఁడో..."

"శివుఁడు గలఁడటంచు శిలలకు మ్రొక్కెడి
వెఱ్ఱి జీవులార! వెతలు విడుఁడి
జీవులందె గాక శిలల నేమున్నది..."

"తోలు కడుపులోన దొడ్డవాఁడుండఁగ
రాతి గుళ్లలోన రాశిఁబోయ
రాళ్లు దేవుఁడైన రాసులు మ్రింగఁడా?..."

దేవుడు నిష్పక్షపాతి. అతడు కర్మసాక్షి మాత్రమే. అతనికి లంచములిచ్చి మోక్షమును బడయగోరువారు శుద్ధ మూర్ఖులు. ఎవరు సహృదయులో, ఎవరు మానవత్వము గలవారో, ఎవరు సచ్ఛీలురో, ఎవరు భూతదయాపరులో వారు మాత్రము దేవుని అనుగ్రహమునకు పాత్రులు – అని తెలిసికొనవలెను.

"రాతిబొమ్మ కేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తాను కోరునా దేవుడు?..."

రాతిబొమ్మకు అందమైన గుడ్డలెందుకు? గుళ్లు గోపురములెందుకు? పూర్ణకుంభము లెందుకు? ఇవన్నియు కావలెనని దేవుడు కోరునా? అతి డట్లు కోరిన దేవు డెట్లగును? ఇ దంతయు ఆత్మవంచన, దంభము తప్ప మరేమియు కాదు.

కొంతమంది బసవభక్తులు రాతిబసవని చూచినప్పుడు మాత్రము రంగుగా ప్రదక్షిణము చేయుచుందురు. అశేష ప్రజానీకమునకు అన్నమొసగు అసలు బసవని ఏదో నెపమున గ్రుద్దుచుందురు. నిజమును పరికింప ఈ వీరశైవులు (బసవ భక్తులు) పరమ పాపాత్ములు. దయాదాక్షిణ్యము లన్నవి వీరికే కోశమునను లేవు.

"రాతి బసవనిఁగని రంగుగా మ్రొక్కుచుఁ
గునుకు బసవనిఁగని గ్రుద్దుచుంద్రు
బసవభక్తులెల్లఁ బాపులు తలపోయ..."

ఈ విధముగా వేమనార్యుడు దురాచారములకు నెలవైన కుహనాసన్న్యాసులను, ఆత్మవంచనాపరులైన మతగురువులను, దురా

హంకారపూరితులైన కొంతమంది బ్రాహ్మణులను, వారియందు భక్తిశ్రద్ధలుగల మూర్ఖప్రజలను అత్యంత దారుణముగా విమర్శించెను. తెలుగు సమాజమును సంస్కరించి ఉత్తమ జీవనమార్గమును చూప అవిరళకృషి సల్పిన సహృదయాగ్రగణ్యుడు వేమనార్యుడు. ఇతనిలో కొంచెము దుడుకుతనము, మోటుతనము ఆ యా సందర్భములలో నగుపించును. వానిలో స్వార్థమను పదార్థము రవంతైన లేదు. కావున దానిని మనము పచ్చకప్పురపు పలుకులవలెనే తీసికొనవలెను. ఉదాసీనభావులు కాని పవిత్రహృదయుల మాటలే అట్లుండును. వారు అరాచకమును చూచునపుడు ఆవేశపూరితులు, అగ్గిరాములు నగుదురు. కాని వారి హృదయములు నవ్యనవనీతములు. వేమన్న దుడుకుతనమును సమర్థించు ఈ పద్యమెంత భావోజ్వలమో పరికింపుడు :

"చాకివాఁడు కోక చీఁకాకుపడఁజేసి
మయిలఁబుచ్చి మంచి మడువుజేయు
బుద్ధిచెప్పువాఁడు గ్రుద్దిన నేమయా..."

అని గ్రుద్దిచెప్పెను. నిజమేకదా! బుద్ధిచెప్పు సహృదయుఁడు గ్రుద్దినను మనము సహింపవలసినదే!

భాషలో కొంత భేదమున్నను సర్వజ్ఞుడు కూడ వేమన్న శ్రేణిలోనే కులమతభేదములను నిశితముగా విమర్శించెను. కుహనా సన్న్యాసుల మోసములను ఖండించెను. 12-వ శతాబ్దమున మత ధార్మిక విప్లవమూర్తియైన బసవేశ్వరుడు కుల మత విభేదరహిత నాగరిక సమాజ నిర్మాణమునకు బ్రహ్మాండమైన ఉద్యమమును లేవదీసెను. ఆ మహాపురుషుని కృషి ఫలితముగ కర్ణాటక సమాజములో ఒక నూతన చైతన్యము వచ్చెను. మత సాంఘిక న్యాయమేర్పడెను. ఆ మహానుభావుని విప్లవచ్ఛాయలలో పెరిగిన ప్రగతిశీలుడు మన సర్వజ్ఞుడు. ఈ సంస్కారభావుడు కుల మత విభేదములతో, అంధ విశ్వాసములతో, అనేకవిధముల సతమతమగుచున్న ప్రజానీకమును

దృష్టిలో పెట్టుకొని చెప్పిన హేతువాద విలసితములైన ఈ వచనములు చూడుడు :

" అవయవగళెల్లరిగె సవనాగి ఇరుతిరలు
భవి భక్త శ్వపచ శూద్రరివరింతెంబ
కవన వె తణదు సర్వజ్ఞ."

" నడెవుదొందె భూమి కుడివుదొందె నీరు
సుడువగ్ని యొందె ఇరుతిరలు కులగోత్ర
నడువె యత్తణదు సర్వజ్ఞ"

మానవు లందఱికి అవయవము లన్నియు సమానముగా నుండ ఇతడు భవి యనియు, అతడు భక్తుడనియు, ఇతడు శ్వపచుడనియు, అతడు శూద్రుడనియు భేద మెక్కడనుండి వచ్చినది?

మనము నడచు భూమి ఒక్కటి. త్రాగు నీరు ఒక్కటి. కాల్చు అగ్నియు ఒక్కటియై యుండగ కుల గోత్రము లెక్కడివి? అని సూటిగా హృదయము విప్పారునట్లుగ ప్రశ్నించినాడు. వివేచనా రహితులు, జ్ఞానశూన్యులు మాత్రమే జాతి కుల మత భేదములను పాటింతురని చెప్పెను.

సర్వజ్ఞుని కాలమున కర్ణాటక దేశమున వాచనామతులైన కొంతమంది సన్న్యాసులు శరీరములనిండ విభూతి నలది, రుద్రాక్షమాలాలంకృతులై, తత్త్వవేత్తలవలె నటించుచు, మూఢ ప్రజలకు మోక్షసాధనముల బోధించుచు తిరుగుచుండిరి. ప్రజలు వారి మోసపు మాటలను విశ్వసించుచుండిరి. ఈ మోసగాండ్రను, దంభాచారులను విమర్శించుటలోను, హేళన చేయుటలోను సర్వజ్ఞుడు కూడ వేమనవలె వాడియైన భాషనే వాడెను.

తత్త్వమెఱుగక తాము భ్రాంతులై యుండియు, అమాయక ప్రజలను భ్రాంతులుగా చేయుచుండిన ఆత్మవంచకులను సర్వజ్ఞుడు

గాడిదలతోను, మేడిచెట్లతోను సరిపోల్చెను. మఱియు ఎట్టివారు నిజమైన యతులో ప్రజల కెఱుకపఱచెను.

"కత్తె బూదిని హొరళి మత్తెయతి యప్పుదే?
తత్త్వ వఱు యదలె భసిత విట్టవ శుద్ధ
కత్తె యంతెంద సర్వజ్ఞ."

"అత్తి మరతా కాయ హొత్తిద తెఱవంతె
తత్త్వభేదవను అరియదెయ రుద్రాక్ష
హొత్తు ఫలవేను? సర్వజ్ఞ."

"మండె బోళాదవర కండు నంబలిబేడ
ఖండితమప్ప పరతత్త్వ విషయవను
కండు నంబువుదు సర్వజ్ఞ."

"నిత్య నేమగళేకె మత్తె పూజెగళేకె
నెత్తి బోళేకె జడెయేకె వదనది
సత్యవుళ్ళవగె సర్వజ్ఞ."

గాడిద బూడిదలో పొరలినంతమాత్రమున నది యతి యగునా? తత్త్వము నెఱుంగక భస్మము శరీరమునిండ పూసికొనినవానిని నిజముగా గాడిద యని చెప్పవలెను.

మేడిచెట్టునిండ కాయలు వ్రేలాడుచుండును. విరగకాచిన ఆ చెట్టువలె ఈ కపటసన్న్యాసులు తత్త్వ మెఱుంగకుండ మెడనిండ రుద్రాక్షమాలలు వేసికొనినంతమాత్రమున ఏమి ప్రయోజనము? అని నిర్దాక్షిణ్యముగా విమర్శించెను.

'తలలు బోడులైనంత మాత్రమున తత్త్వమెఱుంగనివారి దరిచేరవద్దు. పరతత్త్వ మెఱిగినవారిని జేరి భక్తితో సేవింపుడు' అని ప్రజానీకమునకు బోధించెను.

పరతత్త్వమెఱిగిన నిజమైన యతికి ఏ వేషములు నవసరము లేదు. అతడు నోములు నోచ నవసరములేదు. జడచిక్కులు అంత

కంటె నతనికి అవసరములేదు. అతని సత్యవ్రతమే చాలును. అత డే విధముగ నున్నను బాధలేదు. మహావ్యక్తి నిరాడంబరుడై యుండును. అత డెప్పుడు కూడ తనకు సర్వము తెలియునని అధికప్రసంగము చేయడు. కాని ఆదర్శము చూపును. అతనికి ఉపదేశముకంటె ఆదర్శమే గొప్పది. అట్టి యతిని చేరి సద్గతిని పొందుడు-అని సర్వజ్ఞుడు అజ్ఞానాంధకారములో నున్న జనసముదాయమునకు జ్ఞానోపదేశము చేసి, వెలుగుబాట చూపెను.

సర్వజ్ఞుడు కూడ వేమన్నవలె రాళ్లను, రప్పలను పూజించుట వలన ప్రయోజనములేదని పదేపదే బోధించెను. 'కారుణిక పురుషుడు మీలో నుండగ వారణాసికి వెళ్లనవసరములేదు. ఈ దేహమే దేవాలయము. జీవుడే దేవుడు. విగ్రహారాధనమువలన మీకు మోక్షము రాదు. ఇది మీ యజ్ఞానమునకు ప్రబల చిహ్నము. జీవ దయాళురై, సచ్ఛీలురై, జ్ఞానభక్తితత్పరులై మనుడు. అదే నిజ మైన మోక్షసాధనము.

"తన్న లిహ లింగవను మన్నిసలి కటియదే
బిన్నణది కడెద ప్రతిమెగళి గెఱగువ
అన్నెయత నోడు సర్వజ్ఞ."

"కల్లు కల్లనె ఒట్టి కల్లినలి మనెకట్టి,
కల్ల మేల్కల్ల కొళువ మానవరెల్ల
కల్లి నం తిహరు సర్వజ్ఞ."

"కల్లుగుండిన మేలె మల్లిగెయు అరళిక్కి-
నిల్ల దెహాణెయ బిడివర్కెబుగుటిల్ల
దిల్ల కాణయ్య సర్వజ్ఞ."

ఆత్మయందు గల హరుని సేవింపక జ్ఞానహీనులై రాతివిగ్రహ ములను పూజించుట, మ్రొక్కులు చెల్లించుటవలన మీకు ప్రయో జనములేదు. విచక్షణాదృష్టితో మీరే ఆలోచింపుడు.

రాయిమీద రాయిపెట్టి రాళ్లతో ఆలయమును కట్టి అందు నొక రాతిని ప్రతిష్ఠించి దానిని దేవుడని అత్యంత భక్తితో కొలుచు జనుడు విచక్షణాజ్ఞానములేని చైతన్యరహితమైన రాయియే యగును.

గుండురాతికి పూలదండలు వేసి తలగుండు ఆ గుండురాయికి డీకొట్టగ బుడిపి కాక వారికేమి ప్రయోజనము కలుగును?'

మూఢవిశ్వాసములలో మునిగియున్న అమాయకపు ప్రజలకు ఎన్నివిధముల బోధించినను వారి బండతలల కెక్కుటలేదు. వారు పైవేషములకే ప్రాధాన్య మిచ్చుచుండిరి. స్వార్థరహితుడైన సర్వజ్ఞుడు ఉదాసీనభావుడు కాడు. అత డీవిధముగా వారితో ననెను :

"మట్టి శ్రీగంధవను ఇట్టితా నొసలొళగె
నెట్టనె స్వర్గపడె వడె సాణికల్
కెట్టి కేడెను సర్వజ్ఞ."

మట్టి, శ్రీగంధము బాగుగా నొసట పూసికొనినంతమాత్రమున మీకు మోక్షము కలుగునని భ్రమపడవద్దు. అట్లయిన గంధపు ఱాయి ఏ పాపము చేసెను? దానికెందుకు మోక్షము లభింపదాయె? అని ప్రశ్నించెను.

'ఓ అమాయకపు ప్రజలారా! మూఢవిశ్వాసములనుండి విముక్తి గాంచుడు. పైవేషములో నేమియులేదు. సజ్జనులు కండు. మోక్షమార్గమును చూపునది మీ పవిత్రహృదయము. మీ విచక్షణాజ్ఞానము. వీనిని పెంపొందింపజేసికొనుడు' అని పలువిధముల బోధించెను.

సర్వజ్ఞుడు కూడ వేమన్నవలె అత్యంతావేశపూరిత హృదయుడు. ఇందులో వేమన్నకంటె ఒక మెట్టెక్కువే అని చెప్పవచ్చును. కొన్ని సందర్భములలో ఈతని మాటలు చాల మోటుగా ముండ్ల కొరడాతో కొట్టినట్లుండును. నిర్మల హృదయమునకు నైజగుణమే కదా ఇది! "బుద్ధిచెప్పువాడు గ్రుద్దిన నేమయా?" అన్న వేమన్న

మదుకుతనములో కొంచెము మృదుత్వ మున్నది. కాని సర్వజ్ఞునిలో మృదుత్వమనెడి పదార్థమే లేదు. ఈ వచనమును చూడుడు:

"కరెయదలె బరువవన, బరెయవలె ఓదువన
బఱిగాలినింద నడెవవన కరెతందు
కెరదింద హొడెయెంద సర్వజ్ఞ."

'పిలువకయే వచ్చువాడును, వ్రాయకయే సదా చదువు వాడును, పాదరక్షలు లేకుండ వట్టికాళ్లతో నడచువాడును-వట్టి బుద్ధి లేనివారు. అట్టివానికి మాటలతో బోధించుట చాల కష్టము. అందుచేత అతనిని దగ్గఱకు చేరిచి చెప్పుతో కొట్టుటయే సరియైన మందు' అనెను.

ఎవరి మాటలు వాడిగానుండునో వారి హృదయము నవ్య నవనీతమువంటిదని మనము తెలిసికొనవలెను. వేమన్న సర్వజ్ఞులు ఉదాసీనభావులు కారు. స్వార్థమనునది వారి కే కోశములోను లవ లేశమైనను లేదు. పరోపకార పరాయణులు కావున వారేమన్నను వారెంత ఘాటుగా, మోటుగా పలికినను సహృదయులు భరింప వలసినదే!

జాతి కుల మత – ధనిక దరిద్ర వ్యత్యాసము లేని నాగరిక సమాజ నిర్మాణమే వేమనార్యుని ధ్యేయమని అతని పద్యములే మనకు చెప్పుచున్నవి. సంకుచిత కుల మత విభేదములు తొలగి మానవజాతి యంతయు నొక కుటుంబమువలె మనవలెనని యతడు తలంచెను. కుల మత భేదములను రూపుమాపు కార్యక్రమములో నాగరికుడు న్యాయమార్గము తప్పక తన ఆర్థికస్థితిని పెంపొందజేసికొనుట చాల ముఖ్యమనెను. మానవుని సాంఘిక సమస్యలకు అతని ఆర్థికసమస్యలకు పరస్పరసంబంధ మున్నది. కూడు, గుడ్డ, నివాసము–ఈ మూడు మానవుని మనుగడకు ముఖ్యావశ్యకములు. కూటికి గుడ్డకు ఇబ్బంది పడక సుఖముగా ప్రశాంతముగా ఎక్కువకాలము జీవించుటకే మానవుడు పుట్టెనుగాని "జాతస్య మరణం ధ్రువమ్" అను వేదాంతోక్తిని ముందిడుకొని, అచిరకాలములో చనిపోవుటకు మానవుడు పుట్టలేదు. చెట్లకొమ్మలపైని, చెట్లతొఱ్ఱలలోను నివసించిననాటినుండి ఈనాటివరకు జరిగిన మహాయుగ పరంపరలో మానవుడు తెచ్చిన పెక్కు విప్లవములు, వివిధ సంస్కరణలు అతడు సుఖముగాను ప్రశాంతముగాను ఎక్కువకాలము జీవించుటకే! అందువలన అతడు సుఖముగా జీవించుటకు ధన మావశ్యకము. సంఘములో అతనికి గల గౌరవ ప్రతిష్ఠలకు, ఇతర భౌతిక సౌఖ్యములకు ధనమే ఆలంబనము. "సర్వే గుణాః కాంచన మాశ్రయంతి" అనికదా! భర్తృమహాకవి చెప్పియుండెను. దీనిని గూర్చి మన వేమన్న ఏమిచెప్పెనో చూతము:–

"ధనము లేమి యనుట దావానలంబగు
తన్నుఁజెఱుచు మీఱి దాపుఁజెఱుచు
ధనము లేమి మదిని దలపనె పాపంబు"

ధనము లేమి యనుట దావానలముతో సమానము. దావానలము తన్ను చెఱచును. సమీపించినవారిని కాల్చివేయును. దారిద్ర్యము మనస్సున తలంచినను మహాపాపమని చెప్పవలెను.

అందుచే ప్రతి నాగరికుడు ధన సంపాదనకై పాటుపడవలెను అని చెప్పెను. మఱియు—

"కులము గలుగువాడు గోత్రంబు గలవాడు
విద్యచేత విఱ్ఱవీగువాడు
పసిడిగల్గువాని బానిస కొడుకులు"

మాది గొప్పకులము, మేము పేరుగాంచిన వంశమునకు చెందిన వారము. మా గోత్రము ఋషి గోత్రము. మేము విద్యావేత్తలము. మా తాతలు, ముత్తాతలు మహామహోపాధ్యాయులు, అని విఱ్ఱవీగువారు కూడ ఆ యా సందర్భములందు ధనముగలవారికి దాసీపుత్రులతో సమాన మగుదురు.

"కులములేనివాడు కలిమిచే వెలయును
కలిమిలేనివాడు కులము దిగును.
కులము కన్న నెన్న కలిమి ప్రధానంబు"

సమాజములో తక్కువకులమువారుగా జూడబడువారుకూడ కలిమిచే పెద్దకులమువా రగుచున్నారు. కలిమిలేని సవర్ణులు కూడ కులము దిగుదురు. కులముకంటె కలిమియే ప్రధానమైన దని వేమనార్యుడు సకారణముగా నొక్కి చెప్పెను.

## చిన్న కథ

గొల్లరాముడు తన కులవృత్తిని మాని బొగ్గుల వర్తకము చేసెను. అతని యదృష్టము పండినది. అర్ధరాత్రిలో ఐశ్వర్యవంతుడయ్యెను. ఉభయ భాషా ప్రవీణులు, ప్రముఖశాఖ బ్రాహ్మణోత్తములు వగు పరబ్రహ్మశాస్త్రిగారు దారిద్ర్య బాధచే మాన పౌరుషములు గోల్పోయి పది రూకలకై పంచరత్నములు ఆ గొల్ల రామునిపై చెప్పిరి.

"ఉద్దండ దుగ్ధ జలనిధి నుద్భవ శశి రామమూర్తి" అని అతనిని

రామునిచేసి చంద్రునితో సరిపోల్చెను. ఆహా! పదిరూకలకై పర బ్రహ్మశాస్త్రి ఎంత పతనావస్థ పొందెనో పరికింపుడు.

"దాసి కొడుకైనగానీ
కాసులు గలవాడె రాజు గదరా సుమతీ!"

ఇది జరిగినకథయే. ఇట్టి కథలు గత చరిత్రలో ఎన్నియో కలవు. ప్రస్తుత సమాజములో కూడ ఇట్టివి పెక్కులు వినుచున్నాము. ధనమే సాంఘిక సమస్యలను చాలవఱకు పరిష్కరించుటలో దివ్య సాధనమై వెలయుచున్నది.

వేమన్న కాలమునాటి తెలుగు సమాజము కుల మత భేదము లనెడి కుళ్ళుతో చెప్పరానంత ధనిక దరిద్ర వ్యత్యాసముతో నిండి యుండెను. ఆత్మవంచన లేని సహృదయాగ్రగణ్యుడు మన వేమ నార్యుడు. ఆ సమస్యలను పరిష్కరించుటకు త్రికరణ శుద్ధిగా ప్రయ త్నించెను. అతడు ధనికులను చూచి "కలవారు కరుణామయులై లేని వారికి సహాయపడవలెను. పెక్కుమంది కూటికి, గుడ్డకు లేక మల మల మాడుచుండగ, కొద్దిమంది సర్వభోగములను అనుభవించుటవలన సమాజములో అశాంతి ప్రబలును. అశాంతితో కూడిన సమాజ మన్నికష్టముల కాలవాల మగును." అని బోధించెను. "జనాః సుఖినోభవంతు" అని కదా ఆప్తవాక్యము!

"ఆకలన్నవారి కన్నము బెట్టిన
హరుని కర్పితముగ నారగించు"

ఆకలన్న పేదల కన్నముపెట్టుటయే శివుని పూజించినట్టు. "జీవులందెకాక శిలల నేమున్నది!" జీవుడే దేవుడు. ఈ దేహమే దేవాలయము. జీవులను ప్రేమింపుము. మానవసేవయే మాధవసేవ అనుమాట మరువకండి! అని అనేక విధముల కలవారి హృదయము కరుగునట్లు బోధించెను. బోధించుటయే గాదు. వట్టిలేని పేదవానికి పాత్రాపాత్ర విచక్షణ లేకుండ సహాయపడవలెనని కోరెను.

"దోసకారియైన దూసరికాడైన
పగతుడైన వేద బాహ్యుడైన
వట్టిలేని పేదవాని కీదగు నీవి
ధనికునకు నొసంగ దగదు వేమ!"

మన సంఘమున చాల మంది ధనవంతులు కొన్ని కులముల వారికి- అందులో ముఖ్యముగా కొన్ని శాఖలవారికి- వారిలో కొన్ని కుటుంబముల వారికి మాత్రము దాన ధర్మములు చేయుదురు. ఆ దాన గ్రహీతల కలిమి లేములతో ధనవంతులకు నిమిత్తము లేదు. అసలు తిండికి లేని నిరుపేదలకు సహాయపడరు. ఒకప్పుడు సహాయపడినను వారు పాత్రాపాత్రముల నెన్నుదురు. ఈ దాన ధర్మములు వారు మనసార చేయరు, ఇతరులు మెచ్చుకొనవలయునని చేయుదురు. అంతయు ఆత్మవంచన, ఆడంబరము తప్ప మరేమియు లేదు.

వేమన్న వట్టిలేని పేదవారికి మాత్రము దానము చేయుడని గట్టిగా చెప్పెను. అదియే యదార్థమని దానమని నొక్కి వక్కాణించెను. ఆ వట్టిలేని పేదవాడు దోసకారియైనను, దుష్టుడైనను, శత్రువైనను తుదకు సవర్ణులచే వేదబాహ్యుడుగా చూడబడిన చండాలుడైనను సరియే అతనికి తప్పక కలిమి కలవాడు దానము చేయవలసినదే! ఏ కులమునకు చెందినను, ఏ శాఖకు సంబంధించిన దైనను అది దానము కాదని నిషేధించెను. ఇట్టి కులమత విచక్షణా జ్ఞానము కూడ ధనవంతుల కనవసరమనెను.

వేమన్న వట్టి లేనివారనుటలో గంభీరార్థ మిమిడి యున్నది. శాస్త్రదృష్టితో ఆలోచించినవారికే దానిలోని లోతుపాతులు తెలియును. వేమన్న ప్రగతి శీల దృక్పథమున కీ మాట చక్కని ప్రతిబింబమై వెలయుచున్నది. ఆ కాలమున చాలమంది ధనవంతులు తారి ధనమును వేశ్యలకొఱకు, ఇతర దుర్వ్యసనములకు వెచ్చించుచుండిరి. గాని, కూటికి గుడ్డకు లేని నిరుపేదలకు ఒక కాసైనను

నముదా చేయకుండిరి. "ఒక కాసు ధనము వెంటరాదు. దానంబు చేయుడో" అని వేమన్న గొంతెత్తి పలువిధముల బోధించెను. ఆ బోధలు హృదయము లేని ధన మదాంధుల చెవుల కెక్కుచుండుట లేదు. ఉదాసీన భావము ఏ కోశమునను లేని ఆవేశపూరితుడు వేమన్న. అతడు కోపమాపుకొనలేక ఈ విధముగా—

"ఆకలి గొనివచ్చెనని పరదేశికి
పట్టెడన్నమైన పెట్టలేడు
లంజెదాని కొడుకు లంజల కిచ్చురా!"

అని అత్యంత దారుణముగా తిట్టినాడు. అంతటితో నాగక ఉద్రిక్త స్వభావుడగు ఈతడు కొన్ని సాహసపు మాటలు కూడ పలికెను.

"ద్రోహబుద్ధినైన దొంగతికమునైన
సటలనైన సాహసమునసైన
సంపదధికువలన సాధించి వానిని
బడుగునకు నొసంగ బాగు వేమ"

ఎట్టి సాహసపు పనులు చేసియైనను వట్టిలేని పేదవారికి సహాయపడవలెననెను.[1*] ఇదే ఉత్తమ ధర్మమనెను. ఇట్టి విప్లవాత్మకమైన బోధలు చేసిన ప్రత్యక్ష వేదాంతి ఆంధ్ర సారస్వతమున నింకొకడు లేడని గట్టిగా చెప్పవచ్చును.

వేమన నిరుపేదలయెడ పక్షపాతము కలవాడు. కరుణాపూరిత హృదయులై వట్టి లేని పేదవారి ప్రాణములు నిలుపవలయుననెను. దీనికి మించిన మానవధర్మము ఇంకొకటి లేదని యీ విధముగా బోధించెను.

---

1* ఈ సందర్భమున రాబిన్‌హుడ్ కథ మనకు జ్ఞప్తికి వచ్చును. రాబిన్‌హుడ్ గొప్ప మానవతావాది. ధనవంతులనుండి ధనమును బలవంతముగా నైనను తీసికొని నిరుపేదలకు దానము చేయుటయే పరమ ధర్మమని భావించి, ఆచరణలో పెట్టిన పుణ్యాత్ముడు.

"జీవి పోకముందె జీవ వస్తువు లిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలగు వెనుక జీవవస్తువు లేల!"

అని ఉత్తమ ధర్మమును చాటి చెప్పెను. ఇదే వేమనార్యుడు విశ్వమానవ లోకమున కిచ్చిన దివ్య సందేశము.

## వేమన్న - తార్కిక దృక్పథము

వేమన్న ఆర్థికసిద్ధాంతము లటుండగ అతని తార్కిక దృక్పథము మానవసమాజము నెంతో ఉత్తేజపఱచుచున్నది. అతడు లోకుల వెఱ్ఱిపోకళ్ళను ఏవగించుకొనెను. వారి అంధ విశ్వాసముల కత్యంత విచారము వెలిబుచ్చెను. మూఢభక్తికంటె జ్ఞానభక్తి శత సహస్ర విధముల గొప్పదని ఎంత బోధించినను మానవులు అర్థము చేసికొను స్థితిలో లేరు. అట్టివారికి బోధించు టెందులకని వేమన్న ఉదాసీన భావుడు కాలేదు. అది యాతని స్వభావమునకే విరుద్ధము. "వివర మెరుగనట్టి వెఱ్ఱి జీవులార!" యని వారికి విసుగు విరామము లేకుండ పదే పదే జ్ఞానోపదేశము చేయుచుండెడివాడు.

జనులలో తార్కికదృష్టి పెంపొందింపజేయవలెను. వారు వివేచనాపరులు కానినాడు అతని బోధనల నవగాహన చేసికొన నేరరు. వారిని చుట్టిముట్టియున్న సమస్యలేవియు పరిష్కరింపబడవు. అందుచేత అతడు ఒక సందర్భమున రాముని దైవత్వమును గూర్చి కొన్ని మాటలు వారికి చెప్పెను. ఈ మాటలు హేతువాదులైన భావుకుల మెదడులకు మంచి విందు నొసంగి, ఆనందము చేకూర్చెను.

రాముడు సర్వగుణ సంపూర్ణుడనియు, దుష్టులను శిక్షించుట కును, శిష్టులను రక్షించుటకును ఈ భూలోకమునకు వచ్చిన ఆదివిష్ణు వనియు రామాయణ మహాకావ్యమున వర్ణింపబడెను. సమస్తహిందువులకు రాము డత్యంత ప్రీతిపాత్రమైన దేవుడు. ఇక ఆంధ్రులగూర్చి వేఱె చెప్పనవసరము లేదు. ఆ మహానుభావునిలో కొన్ని సందర్భము

లందు సామాన్య మానవునియందు గల కొన్ని బలహీనతలున్నట్లు మనకు తెలియుచున్నది. అట్టి బలహీనత లున్నవాడు మానవాతీత శక్తులు గల దేవు డెట్లగును! అని వేమన్న ప్రజల నడుగుచున్నాడు. ఈ లోపములు లోపములు కావని ఎవ రెన్నివిధముల సమర్థించినను ప్రగతిశీలుడైన వేమన్నకు సంతృప్తి నీయజాలవు.

రాముడు మానవమాత్రుడు ఒక రాజగు దశరథుని పెద్ద కుమారుడు. పితృవాక్య పరిపాలనా దురంధరుడు. గొప్ప పరాక్రమ వంతుడు. ధర్మస్వరూపుడు. పరస్త్రీ పరాఙ్ముఖుడు. పతితపావనుడు. దయాసముద్రుడు. కరుణామయుడు. ఇట్టి లక్షణ లక్షితుడైన పురుషోత్తముడు. కావున ప్రజ లితనిని దేవుని చేసి పూజించు చున్నారు. అని చెప్పిన వేమన్నకు అభ్యంతరము లేదు.

శీలమందు, పవిత్రతయందు దేవునిలో విశ్వాసమున్న వేమన్న కివి యన్నియు అత్యంత ప్రీతి పాత్రములు. కాని ప్రజలు వివేచనా పరులై మెలగవలెనని అతని కోరిక.

మానవమాత్రులకు బలహీనత లుండుట సహజము. వారు తప్పులు చేయుచుందురు. దిద్దుకొందురు. వానిని గూర్చి ఎవరును విచారింపరు. కాని సాక్షాదవతార పురుషుడని చెప్పబడు రామునిలో బలహీనత లగుపించిన మనస్సునకు బాధ కలుగును. కొందరా బాధను, ఆ సందేహమును నిర్భయముగా బయటకు చెప్పుదురు. మనోధైర్యము చాలని మరికొందరు దేవునిలో తప్పులెంచుటయా? అని బయట కనుటకు భయపడుదురు.

వేమన్న విశుద్ధమానసుడైన తార్కికుడు. నిర్భయుడు. తనకు కలిగిన సందేహమును జంకు గొంకు లేకుండ చెప్పు స్వభావము కలవాడు. మన మితనితో నేకీభవించినను, ఏకీభవించకపోయినను ఇతని వాదనాపటిమను, తార్కిక దృష్టిని మాత్రము తప్పక అభినందింపవలసిన దే!

అత డీ విధముగా చెప్పెను:

"కనక మృగము భువిని కానరా దనకుండ
తరుణి విడిచి పోయె దాశరథియు
తెలివిలేనివాడు దేవు డెట్లాయెరా?"

బంగారు లేడి రూపమున వచ్చిన మారీచ రాక్షసుని రాముడు గుర్తింపలేకపోయెను. దుర్మార్గులు, దుష్టులు, భయంకరాకారులు, మాయావులునైన రాక్షసులతో నిండిన అరణ్యప్రాంతమున తమ్ముని శక్తిపై ఆధారపడి, లేదనకుండ లేత వయస్సులోనున్న ప్రియమైన భార్యను పర్ణశాలలో విడిచి, ఆమె కోర్కెను తీర్చుటకై జింకను పట్టుటకు పోయెనట. విచక్షణా జ్ఞానము, తెలివితేటలు గలవాడు ఆ విధముగా చేసి యుండెడివాడు కాడు. రాముడు నిజముగా వట్టి తెలివితేటలు లేనివానివలె అగుపించుచున్నాడు. అట్టివాడు దేవు డెట్లాయెను? అని ప్రశ్నించుచున్నాడు.

ఇంకొకచోట రామునిగూర్చియే చెప్పిన వేరొక పద్యమును చూడవలెను.

"అగ్నిబాణముచేత నంబు ధింకినపుడె
రాముఁ డవల కేగ లావు మఱచె
వరుస కొండ్ల మోసి వారిధేటికి గట్టె?"

రావణుని చంపుటకై శ్రీరాముడు వానర సైన్యముతో వారిధిని దాటి లంకలో ప్రవేశించవలెను. దాటుటకు సాధ్యము కాని విధమున సముద్రము ఉప్పొంగుచుండెను. అంత రామునకు కోపము వచ్చెను. అగ్నిబాణము ప్రయోగించి అంబుధి ఇంకునట్లు చేసెను. అంత శక్తి సంపన్నుడైన రాముడు వారిధిని దాటి అప్పుడే ఆవలి ఒడ్డునకు వెళ్ళియుండవచ్చును గదా? అటు చేయక వరుస కొండలు మోసి వారిధేటికి కట్టెను? అనెను? దీనిని కూడ సమర్థించువారు కోకొల్లలు. కాని వేమన్నవంటి వాస్తవిక వాదికి బోధించుట సాధ్యము కాదు.

'విచక్షణాదృష్టి, వివేచనాశక్తి, వాస్తవా వాస్తవ విషయ పరిజ్ఞానము మానవున కత్యంతావశ్యకములు. వానిని పెంపొందింప జేసికొనుటలోనే మనుష్యుడు మానసిక శక్తిని సంపాదించును. అప్పుడే అతడు తన్ను చుట్టుముట్టియున్న వివిధ జటిల సమస్యలను సక్రమముగా పరిష్కరింప సమర్థుడగును. అని వేమనార్యుని ప్రగాఢ విశ్వాసము.

## సర్వజ్ఞుడు

సంఘములో మనుష్యుడు సుఖముగా జీవించుటకును, అతని గౌరవ మర్యాదలకును ధనమే ముఖ్యాధారమని సర్వజ్ఞుడు కూడ వేమన్నవలె నొక్కి వక్కాణించెను. మానవులు న్యాయము తప్పక శ్రమపై నాధారపడి ప్రశాంత జీవితమును నడుపవలెను. కుల మత సంకుచిత భావములు లేని సహజ సహకార సంఘ నిర్మాణమునకు పాటుపడవలెను. ఐహిక సుఖముల కాలంబనమైన ఆర్థికస్థితిని పెంపొందింపజేసికొనవలెను. ధనములేని వారిని సమాజము గౌరవింప దని సర్వజ్ఞుడు ఈ విధముగా జెప్పెను.

ధనకనక వుళ్ళనక దినకర నంతక్కు
ధన కనక హోదమరు దినహోఘూర
శునక నంతక్కు సర్వజ్ఞ"

మనుష్యుడు ధనకనకములు కలిగియుండిన దినకరునివలె ప్రకాశించును, ధనములేని మరునాడే పాడువారి శునకమగును. అందుచేత మానవుడు ధనసంపాదనచేసి తన సాంఘిక గౌరవమును పెంపొందజేసికొనవలెను.

సర్వజ్ఞుని కాలమున కర్ణాటక సమాజము కూడ వేమన్న కాలపు తెలుగు సమాజమువలె ధనిక దరిద్ర వ్యత్యాసములతో సతమత మగుచుండెను. ధనవంతులు ధర్మబుద్ధిగలవారై పేద ప్రజానీకమునకు సహాయపడవలెనని సర్వజ్ఞుడు కోరెను.

యుత్తమధర్మమని బోధించెను. దయాదాక్షిణ్యాది గుణ విశేషములు మానవత్వమునకు ప్రతిబింబములు. ఉత్తమ రూపమును గోరు మానవులు ఈ సుగుణ విశేషములను దాల్తురని నుడివెను. దాత ప్రత్యక్ష దైవమని చెప్పిన ఈ వచనము తిలకింపుడు.

“ఈ వంగె దేవంగె అవుదంతరవయ్యా
దేవను జగకె కొడుతిహాను కయ్యారె
ఈవనే దేవ సర్వజ్ఞ”

“ఇక్కువవ నూరి గోదొక్క లెందెన బేకు
అక్షయ పవన పడెదు కైలాస డిం
దొక్కలిర బందస ర్వజ్ఞ”

దాతకును దేవునకును తారతమ్యమేమి? దేవుడు స్వర్గము దిగివచ్చి చేతిలో బెట్టునా? దాతరూపమే దైవము. అని దాతను దైవముతో పోల్చెను.

దానము చేసిన వాడు అక్షయమగు కైలాసమున నివసించుట కర్హుడగును. అనగా ఉత్తమగతిని పొందునని సర్వజ్ఞుని భావము.

ఈ దాన ధర్మములు చేయుటలో కూడ ఏ విధమైన వ్యత్యాసము చూపరాదని వేమన్నవలె ఇతడును నొక్కిచెప్పెను.

“మేలు కీళన బేడ, శీలవను బిడ బేడ
కాలవకాలవెన బేడ, ధర్మదా
శీల బేరెండ సర్వజ్ఞ”

వీడుత్తముడు, వాడధముడు అను భేదభావము చూపక దయానిధులై దానబుద్ధి విడువక (మనమున ప్రకాశింప) కాలాకాలముల పాటింపక ధర్మము చేయుటయే దాత గొప్పతనమనెను.

వేమన్నవలె సర్వజ్ఞుడు కూడ నిరుపేదలకు దానము చేయుటయే నిజమైన దానమనెను. ఆకలన్నవారికి అన్నము పెట్టుటయే శివుని పూజించుట యనెను. అన్నదానముకంటె మిన్న దానము లేదని వేనోళ్ళ చాటి చెప్పెను.

"అన్న దేవరముండె ఇన్ను దేవర ఉంటె
అన్న విరువనక ప్రాణవు జగదొళ
అన్నవేదైవ సర్వజ్ఞ"

"అన్నవను ఇక్కువను, నన్నియను నుడియువదు
తన్నంత పరర బగెదొడె కైలాస
బిన్నాణవక్కు సర్వజ్ఞ"

అన్నదేవునికంటె గొప్పదేవుడింకొకడు లేడు. అన్నము లేకుండ మానవుడు బ్రతుకగలడా? అన్నమే కదా ప్రాణము. అందు వలన అన్నదానము చేసి బీద ప్రజానీకము ప్రాణములు నిలుపుడు.

అన్నము పెట్టువానికి, సత్యము పలుకువానికి, బద్ధశత్రునైనను మిత్రునివలె చూచువానికి కైలాసము చేతిలోనిదగును-అని చెప్పెను.

సర్వజ్ఞుని ధర్మోపదేశములు మానవత్వములేని ధనమదాంధుల హృదయముల కెక్కుట లేదు. తోడిమానవులు దారిద్ర్యముతో బాధ పడుచుండ ధనవంతులు సుఖములెట్లు అనుభవింతురు? ఇతరుల కష్టములు తమ కష్టములుగ భావించి వారి నాదుకొనవలెను. పరోపకారబుద్ధి లేని ధనవంతుల జీవితములు నిరర్థకములు-అని కలవారి హృదయములు కదులునట్లు ఉపన్యసించెను.

"ఎరెయ లొల్లదలోభి, కరెయలొల్లద ఆవు
బఱుగాల పయణ ఇవుమూఱు తన్నతా
నిఱిదు కొండంతె సర్వజ్ఞ"

దానము చేయని లోభి, పాలీయని ఆవు, పాదరక్షలు లేకుండ ప్రయాణించుట- ఈ మూడు ఆత్మహత్యా సదృశములని సర్వజ్ఞుడు

చెప్పెను. బీదల కుపయోగపడని ధనవంతుడు గొడ్డుటావుతో సమాన మని విమర్శించెను.

మానవుడు సంఘజీవి. సంఘాభివృద్ధికై అతడు పాటు పడ వలెను. "పరోపకారార్థమిదం శరీరమ్" అను సూక్తి నతడెప్పటికి మరువరాదు. తోడిమానవుడు సుఖముగ నున్ననాడే తాను నిజమైన ఆనందము ననుభవించును. ఇదే మానవ జీవితములోని పరమ రహస్యము.

సర్వజ్ఞుడు గొప్ప మానవతావాది యనియు, అభ్యుదయ భావు డనియు ఈ వచనములే మనకు సాక్ష్యము. వేమన్నవలె ఇతని జీవితాశయము కూడ కుల, మత భేద రహిత సమాజసహకార సంఘ నిర్మాణమే యని స్పష్టమగుచున్నది.

వేమన్నవలె సర్వజ్ఞుని తార్కికదృక్పథము కూడ భావుకుల ను త్తేజపరచుచున్నది. అతడు జాతి, కుల మత విభేదముల గూర్చియు, ప్రజల మూఢ విశ్వాసములగూర్చియు చెప్పిన కొన్ని వచనములు అతని అభ్యుదయ దృష్టికి చక్కని ప్రతిబింబములై వెలయుచున్నవి. అవి యన్ని యటుండ అత డొక సందర్భమున జైనుల అహింసావాద మును ఖండించుటలో జూపిన స్వాతంత్ర్యము, వాదనాపటిమ, చాతుర్యము-అన్నిటికంటె అతని శాస్త్రదృష్టి అద్భుతము. ఈ అణుయుగమున గల భావుకులను గూడ ఆశ్చర్యచకితులను చేయు చున్నది. ఏది హింస? ఏది అహింస? హింస చేయకుండ మానవుడు మనగలడా? మొదలగువానిగూర్చి అత్యంత తీక్ష్ణముగా నాలో చించి అతడు చెప్పిన ఈ వచనములు చూడనగును.

"జీవ జీవ య తిందు జీవిపదు జగవెల్ల
జీవదిం హోరగె లింబు వరనాశానె
జీవనీ జగవు సర్వజ్ఞ"

"చరజీవవను తిందు చరిసి హుదు జగవర్ధ
చరిసదిహాజీవి గళ తిందు జగవర్ధ
చరిసువుదు నోడ సర్వజ్ఞ"

జీవుడు జీవులను భక్షించియే జీవయాత్రను సాగించుచున్నాడు. జీవులకు భిన్నమైనవానిని తిని జీవించువానిని నేను చూడలేదు. జీవహింస అధర్మమని చెప్పు విధివ విధిని నిల్చునుః అని ప్రశ్నించెను.

ఈ లోకములో జనులు సగభాగము చరజీవులను తినుచున్నారు. మిగిలిన సగము అచర జీవులను తినుచున్నారు. అచర జీవులును జీవులే. జీవులను తినకుండ మనుష్యుడు మనజాలడు. అందుచేత జీవహింస అని చెప్పుట అర్థములేని మాట. అని సర్వజ్ఞుడు జీవధర్మమును ఖండించెను.

సర్వజ్ఞు డీ విధముగా అహింసా తత్త్వములోని మూలసిద్ధాంతములను చక్కగా వివరించినాడు. నవీనకాలమువాడైన కీ॥ శే॥ జగదీశచంద్రబోస్ ఇన్వెన్షన్ ప్రకారము సమస్త చరజీవులవలె అచరజీవులైన చెట్లుకూడ అన్ని జీవలక్షణములు కలిగి యున్నవని తెలిసికొనుచున్నాము. జైనుల అహింసా సిద్ధాంతము ప్రకారము చెట్లను నఱకుట కూడ హింసయే యగును. జైనమతస్థులు నోళ్ళకు, కాళ్ళకు గుడ్డలు కట్టుకొని తిరుగుచుందురు. అహింసా సిద్ధాంతము అత్యంత సూక్ష్మమైనది. అది హేతువాదము ముందు నిలువజాలదు. 16-వ శతాబ్దము వాడైన సర్వజ్ఞుడు ఈ సిద్ధాంతము నింత చక్కగా శాస్త్ర దృష్టితో చర్చించుట ఆశ్చర్యకరము.

మన పండితలోకము పందొమ్మిదవ శతాబ్ది మధ్యకాలము వఱకును వేమన్నను ఒక చిన్న తరగతికి చెందిన కవిగా కూడ పరిగణింపలేదు. వారి దృష్టిలో కవిత్వమనగా మాటల కూర్పులు; అక్షరముల రమ్యత, సమాసముల బిగువు, అలంకారముల సొబగు మాత్రమే కాబోలు! వేమన్న ఆ కోవకు చెందిన కవి కాడు. ఇతడు సహజకవి. ఇతని కవిత్వము వాస్తవికతకు పట్టుకొమ్మ, భావోత్కర్షకు ప్రతిబింబము. భావనాశక్తికి పరమావధి. సాధారణముగా తెలుగువాడు తన దైనందిన జీవితములో ఏ భాష మాటాడునో ఆ నిసర్గమనోహరమైన సజీవభాష వేమన్నది. కండ గల తీయని జాతీయము లీతని కవితాసామగ్రి ప్రాతిపదిక. సులభ సుందరమగు పదముల కూర్పుతో, స్వానుభవముతో నిండి, నిశితమై తార్కిక దృష్టితో నొప్పి తెలుగుజాతి మనస్తత్వమును నిలువుటద్దములో నీడవలె చూపునది ఈ ప్రగతిశీలుని కవిత్వము.

ప్రాచీన ప్రబంధ కవులవలె వేమన్న తన కవిత్వమును పాండిత్య ప్రదర్శనకు గాని, ధన సంపాదనకు గాని, కీర్తికొఱకు గాని చెప్పలేదు. వారివలె ఊయల మంచములో నూగుచు, రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చు కప్పురవిడె మందుకొని కావ్యరచన చేయలేదు. పూసెజ్జపై పరుండి వివిధములైన విరహతాపము లనుభవించుచు, మన్మథ-చంద్ర-మలయానిలములను నిందించు రాజకన్యలను వర్ణించుటయందు తన కవితాశక్తిని ప్రదర్శింపలేదు. ధరణీశులకు ధనవంతులను స్తుతి పాఠములు చేయుచు, ధన-కనక-వస్తు- వాహనాదులను పొందుటకై హీనమైన పని కవి కింకొకటి యుండదని అతడు భావించి యుండెను. అందులకు నిదర్శనముగా నాత డొకచోట ఏదానికైనను కృతి నిచ్చి, పొట్టపోసుకొను ఆత్మ గౌరవము లేని హీనకవుల గూర్చి చెప్పిన ఈ పద్యము చూడనగును:-

"తోటకూరకైన దొగ్గలికైనను
తవిద కుడుముకైన తవుడుకైన
కావ్యములను జెప్పి ఘనులైరి"

ఈ సందర్భములో తెలుగు వాఙ్మయమున "ఇమ్మను జేశ్వరాధములను తృణీకరించి శ్రీహరికి తన కృతి నిచ్చిన పోతనామాత్యుడును, "ప్రభుదురాత్ముల నెవ్వాడు ప్రస్తుతించు"—అన్న సంకుసాల నృసింహకవియు, "రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు"- అన్న ధూర్జటికవియు మనకు స్మరణకు వత్తురు. "నిను వినా ఇతరులను గొల్వను; నిధి చాల సుఖమా? రాముని సన్నిధి చాల సుఖమా?" అని సంకీర్తనము చేసిన అపరనారదుడగు త్యాగరాజు మన కీ సందర్భమున స్మరణీయుడే. వేమన్నయు నిట్టి మనస్తత్వము కల కవి యని వేఱ చెప్పనవసరము లేదు.

వేమన్న తన కవిత్వమును సమాజ శ్రేయస్సుకై అంకితము చేసెను. తాను నివసించు సంఘమే అతనికి గొప్ప పాఠశాల. ఆ పాఠశాలా జీవితములో అతడనేక విషయములను గ్రహించెను. అనేక విషయములందు అఖండమైన యనుభవమును సంపాదించెను. తనకు తప్పని తోచిన దానిని ధైర్యముగా, మొగమాటము లేక విమర్శించెను. సర్వ స్వతంత్రుడగు నాతడు ఒకరి నిగ్రహానుగ్రహములమీద ఎన్నడు ఆధారపడలేదు. సాంఘిక న్యాయ రక్షణకొఱకు, ఆర్థిక స్వాతంత్ర్యమునకై ప్రజలు మూఢవిశ్వాసములనుండి విముక్తి పొందుటకు వారు విచక్షణా జ్ఞానమును, విమర్శనా దృష్టిని పెంపొందింపజేసికొనుటకు అవిరళకృషి సల్పిన ప్రజాకవి, ప్రత్యక్ష వేదాంతి వేమన్న.

వేమన్న కవితా తత్వమును చర్చించి వెల్లడింపక పూర్వము కవిత్వ మనగా నేమియో విచారింతము.

ఒక విషయమును గూర్చి వ్యక్తిలో గలుగు భావములను భాషారూపముగా ఇతరుల హృదయములోనికి ప్రవేశింప జేయుటయే

కవిత్వము. ఈ భావములు రమణీయములైన పదములతో ఒప్పి యుండవలెను. ఈ కవితాశక్తి ప్రతిభ, ఆవేశము రెండును అవసరములే. అది ఎంత శక్తిమంతముగా పరిణమించిన అంత ఉత్తమ కవిత్వ మగును. దాని కుదాహరణముగా ఆదికవి యైన వాల్మీకి పొందిన స్థితిని చూడనగును:-

క్రౌంచ ద్వంద్వములోని మగపక్షి నిధనమును గాంచిన క్షణముననే అతడు శోకరసావేశపూరిత హృదయు డయ్యెను. సంస్కార భావుడైన అతని హృదయకుహరమునుండి అప్రయత్నముగా వెలువడిన మాటలే ఉత్తమ కవిత్వముగా రూపొందినవి. మహా కావ్యమగు రామాయణమునకు బీజ[1]మైనవి.

పూర్వాలంకారికులు కవిత్వ తత్త్వమును గూర్చి యే మని చెప్పిరో ఇచ్చట కొంచెము చూతము:-

1. "నియతికృత నియమ రహితాం,
హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం
నవరస రుచిరాం నిర్మితి
మాదధతీ భారతీ కవేర్జయతి."

(మమ్మటుడు)

మమ్మటుడు అలంకార భాష్య మనదగు తన "కావ్య ప్రకాశము"లో కవిబ్రహ్మ సృష్టి, సృష్టికర్తయగు విరించి నిర్మాణము కంటె విలక్షణమైనదనియు విశిష్టమైనదనియు వివరించి యుండెను.

సృష్టికర్త నిర్మాణము ప్రకృతి నియమముల ననుసరించి యుండును. ఉదాహరణకు చంద్రుడు పగటిభాగమున, సూర్యుడు రాత్రివేళ కానరాడు. కవి దానికి వ్యతిరేకముగా కూడ సృజింప గలడు. బ్రహ్మసృష్టిలో సుఖ దుఃఖములు రెండును కలవు. కవి సృష్టి

1. మానిషాద! ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీః సమాః
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామ మోహితమ్.

మాత్రము హ్లాదైకమయమైనది. విరించి సృష్టి ఇతరములపై ఆధార పడి యుండును. కవిబ్రహ్మ సృష్టి యనన్యపరతంత్రమైనది. బ్రహ్మ సృష్టిలో లవణామ్ల-కటు - కషాయ - తిక్త మధుర రసమూర్తులు మాత్రమే కలవు. ఇక-కవిసృష్టిలో శృంగార, హాస్య, కరుణ, రౌద్ర, వీర, భయానక, భీభత్స, శాంతా, ద్భుతము లనెడి నవరసము లున్నవి.

ఇట్టి విలక్షణ కవితాసృష్టి సర్వజన హృదయానందకరమై యుండుటచే బ్రహ్మసృష్టి నతిక్రమించుటలో వింత యే మున్నది?

2. ఇష్టార్థ వ్యవచ్ఛిన్నా పదావళీ కావ్యమ్. (దండి)

3. వాక్యం రసాత్మకం కావ్యమ్. (విశ్వనాథుడు)

4. రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్. (పండితరాయలు)

కవిత్వము నిస్సీమము, నిర్బంధ రహితము, హ్లాదైకమయము, అనన్య పరతంత్రము. నవరస రుచిరము. మనోహరార్థ భూషిత పదములతో నొప్పినది. రస స్వరూపమైన వాక్యములతో రమణీ యార్థమును ప్రతిపాదించునది. మఱియు వర్ణనా నిపుణకవికర్మ కవి త్వమని మమ్మట దండి, వ్వనాథ, పండితరాయలు నిర్వచనము చేసిరి.

వీరిలో ండితరాయల రమణీయార్థ ప్రతిపాదక శబ్దము కావ్య మను లక్షణ మత్యంత మనోహరమైనది. రమణీయార్థ ప్రతిపాదక శబ్ద మనగా రమణీయములైన అర్థములను తెలుపు శబ్దము. ఈ రమణీ యార్థమును తిరిగి తిరిగి భావించుటచే లోకోత్తరమైన ఆనందము కలుగును. ఈ యానందము చమత్కారమనుటయు గలదు. ఆనంద వర్ధనాచార్యుని ధ్వని సిద్ధాంతములో పండితరాయల రమణీయార్థము లీనమైపోయినదని వేఱ చెప్పనవసరము లేదు.

పాశ్చాత్య లాక్షణికులు కవులునైన వర్డ్సువర్తు, షెల్లీ మొద లగువారు భావోత్కర్షను వెలిబుచ్చుటయే కవిత్వమనిరి.[1]

కవి హృదయము సంస్కారపూరితమై ప్రతిభాన్వితమై యుండ వలెను. సహజమైన ప్రజ్ఞయే కవిత్వమునకు కారణము. తక్కిన శక్తులు కవిత్వమునకు వన్నె తెచ్చును.[2]

కవియొక్క ఆత్మీయతా ప్రభావమువలన కావ్యము రూపొందును.

ఇంక కావ్యలక్షణమును వివరించుటలో అభిప్రాయభేదము లున్నవి. మమ్మటాదులు కొందఱు శబ్దార్థములు రెండును కావ్య శరీరమని యభిప్రాయపడిరి. కాని బాగుగా పరిశీలించిన పిదప "సాహిత్య దర్పణ"కారుడగు విశ్వనాథ కవిరాజు, రసగంగాధర కర్తయగు జగన్నాథపండిత రాయలు "శబ్దమే కావ్య శరీరమని" నిర్ణయించి యున్నారు. ప్రాచీనుడగు దండ్యాచార్యుడును "ఇష్టార్థ మును వివరించు పదముల సముదాయమే కావ్యశరీరమని నుడివి యున్నారు. వారివారి లక్షణములు చూడనగును.

వేమన్న ప్రతిభాశాలి యైన గొప్ప ప్రజాకవి. ఈతని కవిత్వ మున నెందు తడవిన నందు మరందము చిందినట్లు రమణీయార్థముల తోను, లోకోక్తులతోను, నిదర్శనములతోను నిండియుండును. అలతి యలతి పలుకులతో నత్యంత గంభీరవిషయములను చెప్పు నేర్పులో తిక్కన తర్వాత ఈతనినే చెప్పవలెను. ఈతని కవితాశక్తి యెట్టిదో డా. కీ॥ శే॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు చెప్పిన ఈ మాటలు చూడనగును :

"అరిది విలుకాని యుజ్జ్వల శరమునకును అట్టిగుఱి, పదును, పాతమును రావు. నిదర్శనములు చూపుటలో నితి డద్వితీయుడు.

---

1. Poetry is the sportaneous outflow of powerful feelings. It takes its origin from emotion recollected in tranquility —Wordsworth.
2. Poetry may be defined as the expression of imagination —Shelly.

మఱి అవి యెన్నియు గూఢములు కావు, దృష్టములు. శ్లేషచే స్థాపింప బడిన సామ్యములట్లు దిక్కు, నర్థము లేనివి కావు. వైశద్యమును గుణ మితనియందు ప్రబలము. మనము ప్రతిదినము చూచుచు 'నంతేకదా!' యని ఆదరము, అవధానము నుంచని విషయములనే యీతడు గ్రహించి, భావనాశక్తిచే కాంతి, రూపము, ప్రాణము నావహింప జేసి యెదుట నిలుపగా, గుర్తు తెలియక పూర్వము మనచే లెక్కింపబడనివయ్యును, నిది యేదో యమానుష విగ్రహములని విస్మయము చెంది గారవింతుము.

ఈ గారడీవిద్యలోఁ దెనుగున నితఁడు ప్రథముడు. సామాన్య వస్తువులకేదో ఒక కామరూపమునిచ్చి వెలయించుట యీతని మహాత్మ్యములలో మొదలింటిది. ప్రకృతి స్వరూపములను ఎంత చక్కఁగాఁ దన సృష్టిభావములతోఁ జూచి యొకటిరెండు మాటల తోనే యచ్చటచ్చట వానిని సాక్షాత్కరింపఁజేసి యున్నాడనుట వేఱ నేనొత్తి చెప్పవలయునా? ప్రకృతి యనఁగా మనవారిలో ననేకులకు నిఘంటువులలో నుండు ప్రకృతియేగాని మూలింటికి బయట నున్న ప్రకృతి యెట్టిదో తమ స్వంతకన్నులతోఁ జూచిన పాపమునఁ బోరు! అట్టివారికి వేమన యనుసరణీయమగు త్రోవఁ జూపించినాఁ డనుటలో నించుకయు గుణాధిక్యస్తుతి లేదు.''

విద్యలో, కావ్యమును నిర్మించుటలో కవికి కొంత సామగ్రి యావశ్యకమై యున్నది. దానిని గూర్చి మమ్మటుడు తన గ్రంథమగు ''కావ్య ప్రకాశము''లో ఇట్లు చెప్పియున్నాడు.

''శక్తిర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్,
కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే''

శక్తియు, అనగా ప్రతిభ, లోకవ్యవహార కావ్యశాస్త్రాది పరిశీలనాదులయెడ గల నైపుణ్యము, అభ్యాసము అను నీ మూడును కవికి కావ్య నిర్మాణములో కారణ మగునని దీని యభిప్రాయము.

రసగంగాధరకర్త యగు జగన్నాథ పండితరాయలు మాత్రము "తస్యచ కారణం కవిగతా కేవలా ప్రతిభా" అని కవి యందు గల ప్రతిభయొక్కటే కారణమని చెప్పియున్నాడు. అయినను వ్యుత్పత్త్యభ్యాసములు కూడ కావ్యకరణమున కారణమగునని పండిత రాయలును సమ్మతించినట్లు తెలియుచున్నది.

మహా ప్రతిభావంతుడగు వేమన్నకు శక్తి నైపుణ్యము లుండుటవలన నిరంతరాభ్యాసము లేకపోయినను, అద్భుతమగు కృతిని రచింపగల్గెనని మనము గ్రహింపవలసి యున్నది.

వేమన్న భావనాశక్తికి ప్రతిబింబ మనదగిన ఈ పద్యము చూడుడు :-

చదువులందు పాడిమొదవులందు స్త్రీల
పెదవులందు రాజ్యపదవులందు
ఆశలుడిగినట్టి యయ్యల మ్రొక్కెద"

రమణీయమైన పదములతో నొప్పిన ఈ పద్యము ఎన్ని పర్యాయములు చదివినను తనివితీరదుకదా! ఒక మహాకావ్యములో చెప్పవలసిన కొండంత విషయము ఒక చిన్న పద్యమనెడి అద్దములో జూపిన వేమన ప్రతిభా విశేషము లేమని కొనియాడదగును. శైవ మహాకవి పాల్కురికి సోమనాథుడు చెప్పినట్లు "అల్పాక్షరముల ననల్పార్థ రచన. కల్పించుటయే కాదె కవి వివేకంబు" ఈ వివే కము వేమన్నయందు సార్థకమైనది. ఇట్టి నిక్కమైన మంచి నీల మొక్కటి చాలదా? రసవిహీనమైన శతాధిక పద్యములెందుకు?

"నిక్కమైన మంచి నీలమొక్కటిచాలు
తళుకు బెళుకు రాళ్ళు తట్టెడేల?"

ఇట్టి ధ్వనిగర్భితములైన పద్యరాజములు వేమనార్యుని కవిత్వ ములోఎన్నియో చూడనగును.

"ఆలివంకవారు ఆత్మబంధువులైరి
తల్లివంకవారు తగినపాటి
తండ్రివంకవారు దాయాది పగవారు"

నిన్నగాక మొన్నవచ్చిన భార్యవంకవారు ఆత్మబంధువులైనారు. తల్లివంకవారు తగుపాటి మాత్రమే! తండ్రి వంకవారు మాత్రము దాయాదులు పగవారు అయినారని వేమన్న చెప్పెను. ఇది లోకము పోకడ.

మనమునకు మంచి మందు నిచ్చెడి ఈ జీవిత సత్యమును వేమన్న ఎంత మనోహరముగా చెప్పెనో చూడుడు:—

"సతుల గవయనేల? సుతుల బడయనేల?
వెతల బడఁగనేల? వెఱ్ఱితనము
నేలమీది తాయి నెత్తికెత్తినయట్లు"

సతులగవయు టెందులకు? సుతుల బడయు టెందులకు? పిమ్మట నానావిధములైన బాధలు పడు టెందులకు? ఇదంతయు మనుష్యుని వెఱ్ఱితనము. నేలనున్న తాయిని నెత్తికెత్తిన యట్లగును. అనగా అన్నిబాధలకు మూలము మనుష్యుని సంసారమే యని భావము.

సంసారముమీది యీ యసహ్యాభావము మన హృదయము లోనికి చొచ్చుకొని, పీఠమేర్పఱచుకొని పలుమారులు స్మరణకు తెచ్చును. మనము వెంటనే సన్యాసులము కాకపోయినను ఈ పరమ సత్యము మాత్రము మన హృదయములో నెల్లప్పుడు ధ్వనించుచునే యుండును.

## వేమన్న కావ్యసుందరి

సౌందర్యమునకు, సౌశీల్యమునకు ప్రతిబింబమనదగిన మఱి కొన్ని వేమన పద్యములు చూడవచ్చును. వీనిలో పండితరాయల రమణీయార్థ స్వరూపమైన వేమనార్యుని కావ్యసుందరిని దర్శింతుము:—

"కలువపూలవంటి కన్నులుండిన నేమి?
చిలుకపలుకులట్లు పలుక నేమి?
తెలివి బలిమి కలిగి తేజరిల్లగ నేమి?
తులువగామి యలరు నెలత వేమ॥"

స్త్రీ గొప్ప సౌందర్యవతి కావచ్చును. ఆమె కన్నులు కలువ పూలవలె అందచందములు గలవి కావచ్చును. ఆమె మాటలు చిలుక పలుకులువలె ముద్దుముద్దుగా మనోహరముగా నుండవచ్చును. గొప్ప బుద్ధిబలము గలది కావచ్చును. ఇవన్నియు ఆమెకు యోగ్యతలే కాని ఆమె శీలవతి గాకున్న ఈ యోగ్యతలన్నియు వృథా యని చెప్పెను. స్త్రీ తులువ కాకపోవుటచేతనే ప్రకాశించును. శీలమే ఆమెకు వెలలేని ఆభరణము.

తులువయైన భార్యలోని అతిలోక సౌందర్యము గాని, తక్కిన యోగ్యతలు గాని, సహృదయుడైన భర్తను ఆకర్షింపలేవు. ఆకర్షింప లేకపోవుటటుండ ఆమె నరరూప రాక్షసివలెగూడ అతని కగుపించును. అప్పు డామె సౌందర్యమేమైనది? ఆమె శరీరమును వదలి ఎక్కడికి వెళ్ళలేదుకదా!

శీలవతి, గుణవతి, వినయవిధేయతలు గలదియు నగు భార్య రూపసి కాకపోయినను ఆ గుణసుందరిని సహృదయుడైన భర్త ఎంతయో ప్రేమించును. తన హృదయాధిదేవతగా జేసికొని యారాధించును. ఆమెను చూచినప్పుడెల్ల ఆమె శరీరసౌందర్యము అతనికి కానరాదు. ఆమె సద్గుణపుంజమే అతని మనోనేత్రముల కగుపించును. అప్పు డాతడు పరిపూర్ణానందము పొందును. దీనినిబట్టి నిజమైన, స్థిరమైన రామణీయ స్త్రీకి సుగుణ విశేషభూషితమైన, అంతస్సౌందర్యము మీద ఆధారపడియున్నది. కాని బాహ్యసౌందర్యముపై కాదని మనము తెలిసికొనియున్నాము.

పతివ్రత చిలుకవలె పలుకనేర్వనిదైనను ఆమె పలుకులు భర్తకు అమృత తుల్యములు. ఆమె మాటలలోని మాధుర్యమును

మన పల్లెటూరి వేమన్న ఎంత మనోహరముగా వర్ణించెనో చూడవగును:

"పనస తొనలకన్న, పంచదారకన్న
జుంటి తేనెకన్న, జున్నుకన్న,
చెఱకు రసముకన్న, చెలిమాట తీపురా!"

పనస తొనలకంటె, పంచదారకంటె, జున్నుకంటె, చెఱకు రసముకంటె చెలిమాటలు మధురాతిమధురములై యుండునని చెప్పిన ఈ మాటలు అత్యంత రమణీయములు కదా! కావ్యము కాంతతో సమానమైనదని కావ్యతత్త్వవేత్తలు వివరముగా తెలిపియున్నారు.

వాఙ్మయము ప్రభుసమ్మితము, మిత్రసమ్మితము, కాంతాసమ్మితము అని ముప్విధములు. ప్రభుసమ్మితమైనది వైదిక వాఙ్మయము. వేదమునందు చెప్పబడిన "సత్యంవద, ధర్మంచర, నానృతం వదేత్" "నాపరస్వ మపహరేత్" మున్నగునవి. ఇవి రాజశాసనమువంటివి. వానిప్రకారము మనము నడుచుకొనవలసినదే కాని ఎందులకిట్లు చేయవలెను? అని ప్రశ్నించుట సాధ్యముకాదు. ప్రభువునుపోలిన వేదములందు శబ్దమే ప్రధానము.

పురాణేతిహాసాదులు మిత్రసమ్మితములు. అనగా మిత్రుని పోలికవి. మిత్రుడు అహితమునుండి మరల్చి హితము నుపదేశించును. ఆ విధముగనే పురాణేతిహాసాదులు ఆయా వృత్తాంతముల ద్వారా హితోపదేశము చేయును. దీనిలో అర్థము ప్రధానమైనది.

కావ్య వాఙ్మయము కాంతాసమ్మితము. కాంత సుకుమారమైన హృదయము గలది. ఆమె తమ యిష్టానిష్టములను మాటల మూలమున తెలియజేయక తన చేష్టలమూలముగనే తెలియజేయును. ఆ చేష్టలనుబట్టియే ఆమె యిష్టానిష్టములు గ్రహింపవలసియున్నది. కావ్యము వేదమువలె శబ్దరూపమున గాని, పురాణేతిహాసాదుల

వలె అర్థరూపమూలమున గాని హితాహితముల నుపదేశింపదు. వ్యంగ్యమూలముగను. ముఖ్యముగా రసవ్యంగ్య మూలముగను వాని నుపదేశించును. అందువలననే కావ్యమునకు ఇతర వాఙ్మయము కంటె వైలక్షణ్యము, వైశిష్ట్యము ఏర్పడినది. కావుననే కావ్యము కాంతతో సమానమని చెప్పబడినది.

## సర్వజ్ఞుడు

సర్వజ్ఞుడు దైవసృష్టిలోని సౌందర్య చిత్రవిచిత్రములనుగూర్చి చెప్పిన ఈ వచనము లెంత రమణీయములో చూడుడు.

"చిత్రవనునవిలొళు, విచిత్రవను గగగదొళు
పత్రపుష్పగళ వివిధ వర్ణగళింద
చిత్రసివరారు సర్వజ్ఞ"

నెమలి కెవ్వడు చిత్రమైన వర్ణ మొసగెను? విచిత్రమైన రంగులలో ఆకారము నెవడు చిత్రించెను? పత్రపుష్పములకు వివిధములగు రంగులు, పరిమళములు నిచ్చినవా డెవ్వడు?

"ఇంగినొళు నాతవను తెంగి నొళగళసిర
భృంగ కోకిలెయ కంఠదిగాయనవ
తుంబి దవరారు సర్వజ్ఞ"

ఇంగువయందు గల ఇంపు, నారికేళములోని నీరు, భృంగ కోకిలములకు మధురమైన గానము ఎవ డిచ్చెనో అతడే ఆ శిల్పి.

"సణ్ణనెయు మళలొళగె నుణ్ణనెయశిలయొళగె
బణ్ణిసిబరెవపట దొళగె ఇరువాత
తన్నొళగె ఇరనె సర్వజ్ఞ"

సన్నని ఇసుకలోను, నున్నని రాతిలోను, వన్నెపటములలోను ఉండు దీనమందారుండు నీలో, నాలో ఉండ లేదా? అని యడుగుచున్నాడు.

ఈ మూడు చిన్నవచనములలో అనంత సౌందర్య మిముడ్చిన సర్వజ్ఞకవి భావనాశక్తి నేమని కొనియాడదగును! ఈతడు ప్రకృతికవి యనుటకు ఈ మూడు వచనములే చాలును.

ప్రతిభావంతుడైన కవి యేవస్తువును గ్రహించినను దానిని సుందరముగా జేయును. మఱియు నతడు సుందరవస్తువునే వర్ణించిన అది యెంత మనోహరముగా నుండునో వేఱ చెప్పనవసరము లేదు. కావ్యప్రయోజనము ఆనందమేకదా! కవి సుందరసృష్టినిగూర్చి దశరూపకకారుడు చెప్పిన ఈ శ్లోకమును చూడనగును:-

"రమ్యం జుగుప్సిత ముదార మథాపి నీచ
ముగ్రం ప్రసాది గహనం వికృతం చ వస్తు,
యద్వాప్యవస్తు కవిభావక భావ్యమానం
తన్నాస్తి యన్న రసభావ ముపైతి లోకే.

(దశరూపకము 4, 86)

రమ్యము కాని జుగుప్స కలిగించునది కాని, ఉత్తమమైనది కాని అధమము కాని, భయంకరమైనది కాని, ప్రసన్నమైనది కాని, గంభీరమైనది కాని, వికృతముకాని కావ్యవస్తువు, లోకములో కవిచే భావ్యమానమై రసభావములు కలిగింపనిది లేదు. ఆంగ్లమహాకవి షెల్లీ (Shelly) దీనినే ఈ విధముగా వ్యక్తము చేసెను.

Poetry turns all things to loveliness. It exalts the beauty of that which is most beautiful and adds beauty to that which is deformed"

(Shelly)

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున వేమన్న భాషకు ఉపమానములకు, జాతీయములకు ఒక ప్రత్యేకస్థానము కలదు. ఇతని భాష తెలుగు సంస్కృతికి ప్రతిబింబమని చెప్పవలెను. సులభమైన చిన్ని చిన్ని పలుకులతో వక్రతలేని మార్గమున, హృదయమునకు హత్తు విధమున అత్యంత మనోహరముగా నితని ఆటవెలదులు నాట్యము

చేయును. ఈతని మాటలు అందరకు తెలిసిన చక్కని, చిక్కని అచ్చ తెనుగు మాటలు. భావములు సంస్కారపూరితములు; అత్యంత తీవ్రములు. అట్లగుటకు కారణము అది యాతని సొంత మగుటయే.

వ్యక్తియొక్క భావములు సొంతములైనప్పుడే అతని భాషకు ఒకవిధమైన ఠీవి, బిగువు, కాంతి వచ్చును. కవియొక్క హృదయ వైశాల్యమునుబట్టి భాషయొక్క సౌందర్యము హెచ్చును. వేమన్న భాషకు సొగసు, సోయగము వచ్చుటకు అతని నిర్మల విశాల హృదయమే కారణము.

## పద్యముల కూర్పు:-

వేమన్న పద్యముల కూర్పులో కూడ ప్రత్యేకత కలదు. ఇట్టి క్రమశిక్షణమతి యితర కవుల ఆటవెలదులలో కానము. ఈతని భావములు పద్యపాదములయొక్క సరిహద్దులను దాటి విహరింపవు. అట్లే మాటలు పాదాంతములలో నంత మగును. పొరపాటుననైనను రెండవ చరణములోనికి వెళ్లవు. అదియుగాక ఒక్కొక్కమాట సరి పోవునట్లుగ కూడ చాలవఱకు కూర్చును. మాటలుకూడ రెండు మూడు అక్షరములలో నొప్పి కర్ణపేయముగా నుండును.

1. అట్టియాలి విడిచి యడవినుండుట మేలు
2. స్థానబలిమి కాని తనబల్మి కాదయా
3. పసిడి గల్లువాని బానిసకొడుకులు
4. అప్పులేనివాడు అధిక సంపన్నుడు
5. అయ్యవారికైన నాశలు గలుగవా
6. క్రమములోన నుండు సర్వంబు తానౌను.

మొదలగునవి.

కాళిదాసు మందాక్రాంత, భవభూతి "శిఖరిణి, ఆంధ్రమున

తిక్కన, కవిచౌడప్ప, "కందములు" శ్రీనాథుని "సీసములు" పాల్కురికి సోమనాథుని "ద్విపద" వేమన్న "ఆటవెలది" కన్నడ మున సర్వజ్ఞుని "త్రిపది" పేరుగాంచినవి.

## తెలుఁగున ఆటవెలదికిగల స్థానము

వేమన్న దేశీయచ్ఛందస్సులో చిన్నది యగు "ఆటవెలది"ని వరించెను. ఆ యాటవెలదికి తెలుగు సారస్వతమున ఒక ప్రత్యేక స్థానము కలదు. ఇది లేనిది దేశీయచ్ఛందములో పెద్దదగు సీసమునకు పరిపూర్ణతయే లేదు. వేమన్న కవిత్వమునకు సంగ్రహాత, స్పష్టతలు ప్రధాన ధర్మములు. సుదీర్ఘవృత్తములలోగాక చిన్న చిన్న దేశిచ్ఛందములంటే తన భావములను సూటిగా, స్పష్టముగా, డొంక తిరుగుడు లేకుండ వెలువరించెను. అదియుగాక ఇతడు ప్రజాకవి, భావవాది, ప్రజలవాడుక భాషలో ప్రజాబాహుళ్యము వాడు ఛందస్సులో ప్రజలకొఱకు రచన చేయుటయే అతని జీవితమున ధ్యేయముకదా!

## వేమన్న అలంకారములు

వేమన్న చెప్పు ప్రతి న్యాయమునకు ఉపమానము తప్పక ఉండును. ఆ యుపమానములు ప్రయత్నపూర్వకముగా ఎక్కడి నుండియో తెచ్చినవి కావు. కొంతమంది పండిత కవులవలె ఊహించి కుదిర్చిన వంతకంటెను కావు. నిత్యజీవితములో సదా వినుచు అనాదర భావముతో లెక్కసేయనిదానినే అతడు తీసికొని, అద్భుతమైన తన భావనాశక్తిచే దానికి ఒక నూతన రూపమును సృష్టించి మన యెదుట పెట్టును. ఉపమాలంకారము దృష్టాంత నిదర్శనాద్యలంకారములకు తల్లివంటిది. సాదృశ్యగర్భితములైన అలంకారము లన్నియు ఉపమాభేదములే యని అప్పయదీక్షితుని* మతము.

---

* ఉపమైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః॥

దీనిని ప్రజ్ఞావంతులైన కవులు అనేకరీతుల నుపయోగించి, తాము చెప్పు విషయములకు అందములను కూర్తురు. కవికుల గురు వగు కాళిదాసు ఉపమాలంకారమునకు ప్రసిద్ధి. అందుచేతనే "ఉపమా కాళిదాసస్య" అను నానుడి. వేమన్న ఉపమానములు అత్యంత సహజరమణీయములు. వీనికి సాటియైనవి ఆంధ్రసాహిత్యము లోనే లేవని గట్టిగా చెప్పవచ్చును.

ఒక సామాన్యగుణమునుబట్టి ఒక వస్తువును మఱొక వస్తువుతో పోల్చుట ఉపమయగును. చూడుడీ ఉపమానములు ఎంత సహజసుందరములో!

"కులములోన నొకఁడు గుణవంతుఁడుండెనా
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజ మున్నట్లు"

కులములో నొకడు మంచి గుణములు కలవా డున్నయెడల వాని మంచితనమువలన ఆ వంశమంతయు ప్రకాశించును. ఎట్లన మంచిగంధపు వృక్షమున్న వనమునకంతకును దాని సువాసన విలువన వచ్చునుకదా!

సుగంధబంధురమైన ఈ పోలిక అత్యంతమనోహరము.

"ఇంటి యాలు విడిచి యిల జారకాంతల
వెంటఁ దిరుగువాడు వెఱ్ఱివాఁడు
పంటచేను విడిచి పరిగ యేరినయట్లు"

బాధ్యతాయుత నైతిక జీవితరథమునకు పతివ్రతయైన భార్య సారథివంటిది. అట్టి ధర్మపత్నినాధారముగాచేసికొని సహృదయుడైన భర్త జీవితరంగమున విజయభేరి మ్రోగింపగలడు. భర్తకు భార్యయొక్కతే భోగభాగ్యరాలు. అన్యస్త్రీలతనికి తోబుట్టువువంటి

---

ఉపమాలంకారము ఒక నటివంటిది. అది చిత్రవిచిత్రములైన వేషభేదములను ధరించి, కావ్యరంగమున నాట్యమాడుచు, ఆ కావ్యవేత్తల మనస్సులను రంజిల్ల జేయుచున్నది. (చిత్రమీమాంస)

వారు. ఇది బాధ్యతతోకూడిన పరమధర్మము. ఈ ధర్మమును భార్యాభర్తలు పాటింపనినాడు సమాజ క్రమశిక్షణకు భంగము వాటిల్లును. ఈధర్మమును విడిచి, ఇంద్రియలోలుడై, చపలత్వముతో జారకాంతలవెంట తిరుగు మానవుడు వట్టి వెఱ్ఱివాడు. అది బాగుగా పండిన పంట చేనువిడిచి, నేల జారిపడిన వెన్నులకు ప్రాకులాడిన ట్లుండును.

"కూటికి నెడబాసి కూర్చున్న మనుజుఁడు
వెలఁదుల గనుగొన్న వెతలఁజిక్కు
చెలఁగి యగ్నిఁజూచు శలభంబుచాడ్పున"

తినుటకు తిండిలేక మాడుచు ఒకమూలకూర్చున్న మనుజుడు సయితము సౌందర్యవతులైన స్త్రీలను చూచినవెంటనే మరులుగొని అగ్నిని జూచి ఆశలోపడు మిడతలవలె నాశనమగుచున్నారు. ఇంద్రియ నిగ్రహము చిన్న మాటకాదు. "తరమా ఇరు మూటిని గెల్వ?" అని గోపన్న శ్రీరామునితో విన్నవించెను గదా!

"పవనపర్ణాంబు భక్షులైనవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల
తామరసనేత్రలిండ్ల బందాలు కారె?"

అని అల్లసాని పెద్దన వాక్రుచ్చెను.

బాధ్యతాయుత నైతికజీవితమును గుర్తింపని మానవుడు ఇంద్రియములకు బానిసయై యుండునని వేమన ఆర్చుచు హెచ్చరించెను.

"ఎలుక మాలువాఁడు ఏమేమి చదివినఁ
జదివినంతసేపు సద్గుణి యగు
కవసి తామరందు గప్ప గూర్చున్నట్లు"

మానవునకు జ్ఞానము ముఖ్యము. జ్ఞానహీనుడు ఎన్ని నీతులు చదివినను, ఎన్ని ధర్మశాస్త్రములు చూచినను ప్రయోజనములేదు. చదివినంతసేపు అతడు సద్గుణియై యుండును. తరువాత అతడు యథా

ప్రకారము దుర్మార్గపు పనులుచేయును. ధర్మములు, నీతులు పాటిం చుటలో ఆతనికి శ్రద్ధాసక్తులుండవు. కప్ప తామరాకుపై కూర్చున్నంతసేపు గుణియై యుండును. అచ్చటనుండి మారినవెంటనే యథాప్రకారము పురుగులను చంపుట మొదలుపెట్టును. ఈ పోలిక అత్యంత మనోహరము.

"అభిజాత్యముననె యాయువున్నంతకు
తిరుగుచుంద్రు భ్రమలఁ దెలియలేక
ముఱికి భాండమునను ముసరు నీఁగలరీతి"

ఈ లోకములో చాలమంది "నేను సత్కులములో పుట్టితిని. మా తాతలు మహోపాధ్యాయులు, అపర దేవతలు" అని విపరీతమైన ఆత్మాభిమానముతో ప్రాణమున్నంతవరకు ఆ కులతత్త్వములలో కొట్టుకొనుచుందురు. అదంతయు భ్రాంతి యని వారు గ్రహింపరు. కులము హెచ్చుతక్కువలు లేవనియు మానవులందరు ఒకే కుల మనియు, వారివారి పనులనుబట్టి సాధనలవలన గౌరవ మర్యాదలు, జ్ఞానవైరాగ్యములు కలుగుచున్నవనియు సత్యమును గుర్తింపరు. ఇది విచారకరము. ఈ జాత్యహంకారము ఈగలు ముఱికి కుండను జూచి మురిసిపోయి చుట్టుముట్టినట్లుండెను. అది దుర్గంధ మనియు, ముక్కు బ్రద్దలైపోవుననియు అవి భావింపవు. జాత్యహం కారము ముఱికికుండవంటిదనియు, దానిలో మెలగు జ్ఞానహీనులు ఈగలవంటివారనియు చెప్పిన ఈ పోలిక కులతత్త్వ నిర్మూలనలో శ్రద్ధాసక్తులుగల సహృదయులను తీక్ష్ణభావులుగా జేయుచున్నది.

"కట్టెయందు నిప్పు కానని చంద మీ
తనువునందు నాత్మ తగిలియుండు
మఱుగు తెలిసి పిదప మార్కొనవలెనయా"

'నేనే దేవుడను (అహం బ్రహ్మాస్మి) నాలోనే దేవుడున్నాడు.' కట్టెలో నిప్పు ప్రత్యేకముగా మనకు కానబడదు. కట్టెలు ఒకదాని

కొకటి నొఱసినయెడల రెంటి రాపిడివలన అగ్ని పుట్టుచున్నది. ఆ విధముగనే మన శరీరములోఁజేరి ఆత్మయందు నను రహస్యమును మానవుడు తెలిసికొని సాధనలుచేసి శమదమసంపన్నుడై పరిపూర్ణ మానవుడు కావలెను. అని వేమనార్యుడు అద్వైతసిద్ధాంతమును అత్యంత సులభమార్గముల బోధించెను.

## దృష్టాంతములు

ఉపమాలంకార నటియొక్క చిత్ర విచిత్ర వేషములలో మొదటి వేషమనదగు దృష్టాంతము వేమనార్యుని కావ్యరంగమున అత్యంత మనోహర రీతిని (ఆటవెలదిగా) నాట్యమాడుచుండును.

''అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచెముండుటెల్ల గొదువగాదు
కొండ యద్దమందు గొంచెమై యుండదా?''

తనకు సరిపోనిచోట తాను అధికుడనని చెప్పరాదు. అట్టి చోట కొంచెముగా నుండుటయే మంచిది. దాని వలన తన గౌరవ మునకు ఏ విధమైన లోటు రాదు. ఎట్లన అద్దమందు పెద్దకొండ కొద్దిగా కనబడదా? అంత మాత్రమున ఆ కొండకు ఏ విధమైన లోటు కలుగుచున్నదా?

కొండంత భావమును చిన్న పద్య ముకురమున జూపిన వేమన సంగ్రహశక్తి కొనియాడదగినది; అద్దములోని కొండతో పోల్చుట అత్యంత మనోహరము.

''ఉప్పుఁగప్పురంబు నొక్క పోలికనుండుఁ
జూడఁజూడ రుచుల జాడ వేఱు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా''

ఉప్పు కర్పూరము రెండును చూచుటకు (సాదృశ్యాకారము) ఒకే విధముగా నుండును. కాని నాలుకపై పెట్టిన వాని రుచుల

జాడ వేఱని తెలియును. (నిజరూప మర్థమగును). ఆ విధముగనే మనుష్యులొకప్పుడు ఆకారములో, తీరుతెన్నులలో, నొకే విధముగా కనుపింపవచ్చును. బాహ్యాకారమునుబట్టి వారి ఆంతర్యమును నిర్ణయింపలేము. సత్పురుషులు వేఱుగా నుందురు. పరీక్షలవలనగాని వారి మంచితనము మనకు తెలియదు. వారు చేసెడి ఘనకార్యముల వలనగాని వారి గొప్పతనము తెలియదు.

ఈ పద్యములో పోలిక ఎంత మనోహరముగ నున్నదో, ఈ దృష్టాంత మెంత రమణీయమో పరికింపనగును.

"గంగిగోవుపాలు గంటెడైనను జాలు
గడవెడైన నేమి ఖరము పాలు
భక్తిగల్గు కూడు పట్టెఁడైనను జాలు.'

శ్రేష్ఠమైన ఆవుపాలు గంటెడైనను చాలును. గాడిదపాలు కడవడైనప్పటికిని ప్రయోజనములేదు. ఆ విధముగనే ప్రేమతో బెట్టిన అన్నము పట్టెడైనను తృప్తిగలిగించును. "ప్రియమెసగం దగంబిలిచి పెట్టినకూడదిలెస్సకూడు" అన్న భారత పద్యపాదము కన్న వేమనార్యుని దృష్టాంతము మిన్న యనుపించుచున్నది.

"అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారినెల్లఁ దొలగఁగొట్టు
చెప్పుదినెడి కుక్క చెఱకుతీ పెఱుగునా?"

చెప్పు తినుట కలవాటు పడిన నీచపు కుక్కకు చెఱకునందలి మాధుర్యము తెలియనట్లు అల్పబుద్ధి యగు నీచున కధికారమిచ్చిన, దొడ్డగుణములు గల మహనీయులలోని మంచితనమును తెలిసికొన నేరక వారిని తన యొద్దనుండి తఱిమివేయును.

ఈ దృష్టాంతము మన నిత్య జీవితానుభవముగదా! చూడుఁడు :-

"తామసించి చేయఁదగఁ బెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమగును.
పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె?"

ఎంత ప్రయత్నించినను పచ్చికాయను పండుచేయలేము. పండు కాకపోవుట అటుండ అది కుళ్ళిపోవును. ఆ విధముగనే ఏ పనినైనను తొందరపడి చేయరాదు. తొందరపడుటవలన ఆ పని చెడుటయేకాక అంతకంటె నష్టము కూడ కల్గును. మానవుడు నిదానముతో ప్రతిపని చేయవలెనని వేమనార్యుడు చక్కని దృష్టాంతము నిచ్చెను :-

తల్లిదండ్రులందు దయలేని పుత్రుఁడు
పుట్టనేమి వాఁడు గిట్టనేమి?
పుట్టలోనఁ జెదలు పుట్టవా? గిట్టవా?

పుట్టలోన జెదలు పుట్టినను చచ్చినను వానివలన ప్రయోజనము లేనట్లు కని, పెంచి పెద్దచేసిన తలిదండ్రులమీద దయలేని కొడుకుండినను లేకున్నను ఒక్కటే. ఎందుకును లాభము లేదు. హృదయమునకు చురుక్కున తగులు చురకత్తివంటి దీదృష్టాంతము.

ఇట్టి దృష్టాంతము లింకను ఎన్నియో కలవు: -

"పెట్టిపోయ లేని వట్టినరుఁడు భూమి
పుట్టనేమి? వాఁడు గిట్టనేమి?
పుట్టలోనఁ జెదలు పుట్టవా? గిట్టవా?"

"ఎంత చదువు చదివి ఎన్నియో విన్నను
హీనుఁ డవగుణంబు మానలేఁడు
బొగ్గుఁ బాలఁగడుగఁ బోవునా నైల్యంబు'

"ధనము కూడఁబెట్టి దానంబు సేయక
తాను తినక లెక్క దాచుఁగాక
తేనెటీఁగ గూర్చి తెరువరి కియ్యదా!"

"నిక్కమైన మంచినీల మొక్కటిచాలు
తళుకు బెళుకు రాలు తట్టెఁడేల?
చదువఁ బద్యమరయఁ జాలదా యొక్కటైన"

"ఓగునోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావమిచ్చి మెచ్చుఁ బరమలుబ్ధు
పంది బురద మెచ్చు, పన్నీరు మెచ్చునా?"

"మతపు వేషగాండ్రు మహిమీద పదివేలు
మూఢజనులగలప మూగుచుండ్రు
కొంగలు గుమిగూడి కొఱకవా బోదెలు"

"ఆకు లెల్లఁదిన్న మేకపోతులకెల్ల
గాకపోయెనయ్యె కాయసిద్ధి
లోకులెల్ల వెఱ్ఱిపోకళ్ళు పోదురు."

## నిదర్శనాలంకారములు

నిదర్శనము ఉపమాలంకారనటియొక్క విచిత్రవేషములలో రెండవదని చెప్పనొప్పును.

సదృశ వాక్యార్థములకు ఐక్యారోపము నిదర్శనము.

"అలయఁజేసి మలఁచియులిగండ్లు మలిగఁడ్లు
తిరిపెమిడెడు కటిక దేబెలెల్ల
నెలమి మన్నుదినెడి యెఱ్ఱలాడురు సుమీ"

బుద్ధిహీనులు వెనుకముందు లరయక సంపదలే శాశ్వతములని భావించి, దయాశూన్యులై ఇంటికి వచ్చిన అతిథిని అనేక పర్యాయములు త్రిప్పి ప్రాణము విసిగింతురు. అతడు వదలి వెళ్ళలేని సమయమున చివరకు అతడు చిక్కిన, మన్ను మశానము కలిసిన-ఎందుకు పనికిరాని తరకలను తిరిపమిడెదరు. ఈ కఠినాత్ములు నిజముగా మన్నుదిని బ్రతుకు ఎఱ్ఱలవంటివారని వేమన హృదయములేని లోభివారి నత్యంత తీవ్రముగా విమర్శించెను.

ఇచట కటిక దేబెలకును, ఎఱ్ఱిలకును ఐక్యము.

"అరయ దోఁచికొనుచు గురువని తన్నెంచి
తిరుగువాఁడు తన్ను నరయ లేఁడు
పనికిమాలినట్టి బానిస కొడుకురా..."

లోకములో వంచనాయతులు వివిధరీతుల నమాయకపు ప్రజలను మోసము చేయుచుందురు. గురువులని పేరుపెట్టుకొని దీక్షలిచ్చుచు జనుల ధనము నపహరించుచుందురు. వారు నిజముగా ప్రజాశ్రేయస్సునే కోరు గురువులైన సర్వవిధముల నాదర్శవంతులై యుందురు. అట్టి ఆదర్శపురుషులు మొదట ధర్మమును ఆచరణలో పెట్టి పిదప నుపదేశము చేయుదురు. ఆచరణశూన్యులు నిజమైన గురువు లెన్నటికిని కారు. వారు 'పరాన్నభుక్కులు, పనికిమాలిన తొత్తుకొడుకు'లని వేమన కుహనాగురువులను నిర్దాక్షిణ్యముగ తిట్టెను. ఇచట గురువునకు బానిస కొడుకునకు ఐక్యము.

"వాక్కుశుద్ధిలేని వైపగు దండాలు
ప్రేమకలిగినట్టె పెట్టనేల?
నొసటి బత్తిచూపు నోరు తోడేలయా?"

దుర్మార్గులు అందరివలెనే బయటకు వినయవిధేయతలు చూపుచుందురు. అందరు ఒక నమస్కారము పెట్టిన ఈ నీచులు చాటుమాటున దూషించుచు ముందునకు వచ్చినపుడు వంకదండము లనేకము పెట్టుదురు. పరోక్షమున కపటము చూపుచు, ప్రత్యక్షమున దండములు పెట్టుటెందులకు? ఆత్మవంచన కాదా? నొసలు భక్తిని చూపును. నోరుమాత్రము హింస చేయును. ఇట్టి వాక్శుద్ధిలేని నీచుల నెప్పటికి నమ్మరాదని వేమన ఆత్మవంచనపై ధ్వజమెత్తెను. ఇచట నోరు తోడేళ్ళకు ఐక్యము.

"స్థిరులుగాక క్షుద్రజీవులలోఁ జేరి
హెచ్చు తగ్గులందు హీనమతులు
గాడ్దెపిల్లలగుచు గ్రక్కునఁ జెడుదురు"

మానవులకు స్థిరమైన నడవడి అవసరము. దానివలననే వారికి సంఘములో గొప్ప గౌరవము కలుగును. చపలచిత్తులై అవసరార్థము క్షుద్రజీవులలో జేరి నీచమైన పనులు చేసిన హీనమతులందరు గాడిద పిల్లలయి గ్రక్కున చెడుదురు.

గాడిద పిల్లలు మొదట ఎంతయో మృదువుగా నుండును. పెరిగి పెద్దవగుసరికి వాని నిజరూపము ప్రత్యక్షమగును. ఆ విధము గనే నీచులలో స్థిరబుద్ధి లేనివారి స్నేహము మొదట సుఖముగా నుండి క్రమముగా హీనస్థితికి దిగజారునని వేమన స్థిరమైన నడవడి జనుల కందరికి వలయునని నొక్కి వక్కాణించెను. ఇచట హీనమతు లకును, గాడిద పిల్లలకును ఐక్యము.

"ఇనుము విఱిగెనేని యినుమారు ముమ్మారు
కాంచి యతుక నేర్చు గమ్మరీడు
మనసు విఱిగెనేని మఱి కూర్పరాదయా"

ఎంత కఠినమైన ఇనుము విఱిగి తునకలైనను కమ్మరీడు రెండు మూడు సార్లు కాల్చి యతుకగలడు. మనస్సు విఱిగినయెడల మరల యతికించుటకు ఎవరికిని సాధ్యము కాదు. మానవుడు మనస్సు విఱుగ కుండునట్లు మాటలాడుట నేర్చుకొనవలెను. ఇచట విరిగిన ఇనుము, విఱిగిన మనస్సులకు నైక్యము.

## అర్థాంతరన్యాసాలంకారము

"అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచునుండు
తినఁగ తినఁగ వేము తియ్యనుండు
సాధనమునఁ బనులు సమకూరు ధరలోన"

పాడగా పాడగా రాగము కుదురును. తప్పకుండ ప్రతిదినము తినగా వేపాకు రుచించును (తియ్యనగును). ఆ విధముగనే సాధన మున అన్ని పనులు నెరవేరునని ఆశావాదములో అచంచ

విశ్వాసముగల వేమన్న ఈ అర్థాంతరన్యాసమున దాని నత్యంత మనోహరముగ జెప్పెను.

"మేక కుతుకఁబట్టి మెడచన్ను గుడువఁగా
ఆఁక లేల మాను నాశగాక
లోభివాని నడుగ లాభంబు గలుగునా!"

మేక మెడను కూడ రెండు చన్నులు వ్రేలాడుచుండును. అవి పాలిచ్చునను భ్రాంతితో కంఠమునుపట్టి చన్ను గుడిచిన ఆకలి తీరునా? ఆ విధముగనే హృదయములేని లోభివారి నడుగుటవలన సుంతైన లాభము లేదని వేమన లోభివారిపై దండయాత్ర ప్రకటించెను. ఈ పోలికలోని రమణీయతను గూర్చి చిరునవ్వుతో నాలోచింతుము.

మేడిపండుచూడ మేలిమైయుండును
బొట్ట విచ్చి చూడఁ బురుగులుండు
బిఱికివాని మదిని బింక మీలాగురా!"

మేడిపండు చూచుటకెంతయో పుష్టిగా, అందముగా నుండును. వానిని చిదిమి చూచినచో నిండుగా అసహ్యముగా పురుగు లుండును. ఆ విధముగనే డంబములు చెప్పుకొను అల్పమానవుడు పైకి గొప్పగా కనబడినను మనస్సున పిరికిగుణ ముండును. మేడిపండువంటి అల్ప మానవుల నెందరినో మన నిత్యజీవితములో జూతుము.

"పసులవన్నె వేఱు, పాలేకవర్ణమౌ
పుష్పజాతి వేఱు, పూజ యొకటి
దర్శనములు వేఱు, దైవంబదొక్కటి"

పసువుల ఆకారములు, రంగులు వేఱైనను, వాని పాలు మాత్రము ఏకవర్ణము. పుష్పములు అనేకవిధములుగా నున్నను, పూజ మాత్రము ఒక్కటే. ఆ విధముగనే దర్శనములు వేఱైనను దేవుడు మాత్రము ఒక్కడే యని అందఱు తెలిసికొనవలెను. ఈ

అర్థాంతర న్యాసము వేమనార్యుని ఏకేశ్వరోపాసన సిద్ధాంతమునకు ప్రతిబింబమై వెలయుచున్నది.

## కావ్యలింగము

"కులము హెచ్చుతగ్గు కొదువలు పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చుతగ్గుమాట ఎట్లెఱుంగగవచ్చు"

దైవసృష్టిలో అన్ని జాతులు ఒకటి తరువాత ఒకటి పుట్టినవి. ఈ జాతులన్నియు తోబుట్టువులవంటివి. వీనిలో హెచ్చుతగ్గుమాట అర్థము లేనిమాట. హెచ్చుతగ్గులెట్లు తెలిసికొననగును? అందువలన అభేదభావమును కట్టిబెట్టి మానవులందరు ఒక జాతిగా మనవలెను. వసుధైక కుటుంబవ్యవస్థ నెలకొల్పవలెనని వేమన ఏనాడో ఎలుగెత్తి చెప్పెను.

తాను తెలుపు విషయమును సమర్థించు హేతు విందు కావ్య లింగాలంకృతిని వివరింపబడినది.

## సారాలంకారము

"పనస తొనలకన్న పంచదారకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలిమాట తీపురా"

పనస తొనలకంటె, పంచదార దానికంటె, జున్ను దాని కంటె. చెఱకు రసము దానికంటెను వేమనార్యుని సుందరియొక్క మాటలు మధురమైనవి. అని ఉత్తరోత్తరోత్కర్ష చెప్పుచు, లోక విషయము వివరింపబడినవి. కావున ఇచట సారాలంకారము.

## వేమన్న ప్రకృతి పరిశీలనము

"గాజుకుప్పెలోన కదలుచు దీపంబ
దెట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టి వాని దేహంబులందును"

మృద్ఘటమునందలి దీపముకాంతి నీయనట్లు అజ్ఞానియందు ఆత్మకాంతి లేదు. గాజుకుప్పెలోని దీపమువలె తెలిసినట్టి వారి దేహమున జ్ఞానము ప్రకాశించును. జ్ఞాని గాజుకుప్పెవంటి వాడని చెప్పు వేమన ప్రకృతి పరిశీలనము నీయుపమ చాటుచున్నది. ఇంకను కొన్ని యుదాహరణములు జూడుడు :-

"ఎంత చదువు చదివి యెన్నియో విన్నను
హీనుఁ డవగుణంబు మానలేడు
బొగ్గు పాలఁ గడుగఁబోవునా మలినంబు"

"తామసించి చేయఁ దగ దెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషముమగును,
పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె?"

"పెట్టిపోయలేని వట్టినరుడు భూమి
పుట్టనేమి? వాడు గిట్టనేమి?
పుట్టలోనఁ జెదలు పుట్టదా? గిట్టదా?"

### జాతీయములు

వేమన మన నిత్యజీవితములోని యనుభవములో నున్న చర్యలు, విను లోకోక్తులు, కనుసాదృశ్యములు, తెలిసికొను మానవ జీవితములోని మహనీయ ధర్మములు, నీతులు, సామెతల రూపమున

చూపి చిత్తమున కత్యంతానందము చేకూర్చును. ఇతని జాతీయములు ఇతని యుపమానములను మించి యున్నవని చెప్పవచ్చును. ఉదాహరణమునకు :—

1. కుక్కతోఁకఁబట్టి గోదావరీదునా?
2. బుద్ధిచెప్పువాడు గుద్దితే నేమయా?
3. చందనంబు ఘనత పంది యేమెఱుగును?
4. మంత్రజలముకన్న మంగలి జలమెచ్చు.
5. మాట వినని యాలు మగనికి మరగాలు.
6. చెట్టు ముదరనిచ్చి చిదిమిన పోవునా?
7. ఏటివంక దీర్ప ఎవరికి తరమౌను?
8. అప్పులేనివాడె అధిక సంపన్నుడు.
9. కూర లేని తిండి కుక్కతిండి.
10. గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు.
11. కదనభోతు జూచి కాలుండు నవ్వురా.
12. కాపులేసివాని కాపుర మడుగరా!

## వేమన్న హాస్యము

వేమన కవిత్వములోని ఇంకొక గొప్ప లక్షణము హాస్యము. ఇతని హాస్యము మోటుహాస్యము కాదు. మిక్కిలి సున్నితమై, వ్యంగ్య మర్యాదా విలసితమై యుండును. దాని కుదాహరణముగా ఈ పద్యములు చూడుడు.

"గుహాలలోనఁ జొచ్చి గురువుల వెదకంగ
క్రూరమృగ మొకండు తారసిలిన
ముక్తిమార్గ మదియె ముందుగా జూపురా!"

'గొప్పగురువులు గ్రామములలో నుండరు. కొండగుహాలలో నుందురు. వారి నాశ్రయింపక ముక్తిమార్గము లేదు' అని నమ్మ

మూఢజనులు, గురువులగూర్చి గుహాప్రాంతములలో తిరుగుచుండ, వారి అదృష్టము పండి, క్రూరమృగ మొకండు తారసిలిన అదియే వారికి ముందుగా ముక్తి చూపుననెను. ఇందలి హాస్యధోరణి ఎంత మృదువుగా నున్నదో పరికింపనగును.

"సకల యజ్ఞములను సకల తీర్థంబుల
తలలు గొరుగకున్న ఫలము లేదు
మంత్ర జలముకన్న మంగలిజల మెచ్చు"

ప్రతి తీర్థములోను, ప్రతియజ్ఞము నందును ప్రాయశ్చిత్తార్థమై తలలు గొరుగకున్న ఫలము లేదందురు. ఇచ్చట పవిత్రము చేయునది, ఫలము నిచ్చునది మంత్రజలమా? మంగలి జలమా? మంగలి నీళ్లే మేలని వేమన చెప్పెను. ఇందలి ధ్వని గర్భిత హాస్యరసము అత్యంత మనోహరము. తార్కికదృక్పథము గల సహృదయులు దీనిని బాగుగా నభినందింతురు.

"లోభివానిఁజంప లోకంబు లోపల
మందు వలదు వేఱె మతము కలదు
పైకమడిగినంత భగ్గున బడి చచ్చు"

'ఈ లోకములో లోభివానిని చంపుటకు మందక్కఱలేదు. దానికి ఒక ఉపాయమున్నది. అతనిని పైకమడిగినంతనే భగ్గున పడి చచ్చును' అని లోభిమీద అసహ్యాభావమును గూడ అత్యంత మృదువైన హాస్యముతో జోడించి చెప్పెను. ఇట్టిదే ఇంకొక పద్యము:—

"గొడ్డుటావుఁ బితుకఁగుండఁ గొంపోయిన
పండ్లు రాలఁదన్ను, పాల నీదు;
లోభివాని నడుగ లాభంబు లేదయా"

గొడ్డుటావును పితుకుటకై కుండ గొంపోయిన అది పాలనీయక పోవుట యటుండ పండ్లు రాలునట్లు తన్నును. పాలు పిండుటకు ప్రయ

క్షించినవాని తెలివితేని తనమునకు తగిన శాస్తె అది. అట్లే లోభివానిని యాచించువానికి అట్టి ఫలితమే కలుగునని విని చిఱు నవ్వు నవ్వని వారెవరు?

## సర్వజ్ఞుడు

సర్వజ్ఞుని కవిత్వము ధారాశుద్ధికి పెట్టినది పేరు. వేమన్న కవిత్వమువలె అది సామాన్యజనుల కర్థమగు భాషలో అపార లోక జ్ఞాన విలసితమై ఉపమా, దృష్టాంతాలంకారశోభితమై, సహృదయ చిత్తాహ్లాదకరమై యొప్పియుండును. ఈతని శైలినిగూర్చి శ్రీ వి. కె. భానోజీగారు ఇట్లు చక్కగా వివరించియున్నారు.

"భావసౌందర్యము హెచ్చుకొలది భాషకు సొంపు, సోయ గము, సత్త్వము చేకూరును. అది వ్యక్తి హృదయౌన్నత్యము తో బాటు ఉద్గత శీలమును వివరించును. మనస్సును బోలిన మాటలు, భావమును పోలు భాష వశమగును..."

మానవున కన్వయించు ఈ రీతి కవితా విధానమునందును సత్యము కానగును. కవియొక్క ప్రతిభ భావాభివ్యక్తికి ఉచిత మగు పదజాలమునే అందిచ్చును. ప్రతిభ, అభ్యాసబలము. దానికి సంస్కారము తోడైనప్పుడు అభివ్యక్తమగు నర్థము, భాష తగురీతి ననుసరించును.

కవి, పండితులలో గానవగు అహంకారము సర్వజ్ఞునిలో లవలేశమైనను కానరాదు. అపార లోకజ్ఞానముతో నీతని కవిత్వ మొప్పియుండును. ఈతని పలుకులలోని సొబగు, సోయగము అంద జేని ఆకర్షించును.

సర్వజ్ఞుని వచనములలోని గొప్పలక్షణము పరిపూర్ణత. ఒక మాట హెచ్చుకాక, ఒకమాట తక్కువకాక తూచినట్లు అతని త్రిపది పరిధిలో నత్యంత మనోహరముగా నిమిడియుండును. మొదటి పాదములో జనుల నాకర్షించి, రెండవ పాదములో భావనా గాంభీ

ర్యమును చూపును. ఈ రెండు చరణములగూర్చి ఆలోచించుచుండ, మూడవ చరణము కొరడాదెబ్బవలె వచ్చి పడును.

ఈ మాటలవలన సర్వజ్ఞుని కవితయొక్క నిజరూపము మనకు వ్యక్తమగుచున్నది. "వాక్యం రసాత్మకం కావ్యమ్" (రస స్వరూప మైన వాక్యము కావ్యము) అని విశ్వనాథుని కావ్యనిర్వచనము. ఇది సర్వజ్ఞుని కవిత్వమునకు సర్వవిధముల నన్వయించును. ఒకచోట అతడు చెప్పిన ఈ వచనమే దానికి చక్కని నిదర్శనము:—

"అర్థ విల్లదహాడు వ్యర్థసాహిరవిద్దు
అ రి యిం క తె యరచి దడదరల్లి
అర్థ వుంటెంద సర్వజ్ఞ"

అర్థములేని మాటలు వేయియైనను ప్రయోజనము లేదు. మనసిచ్చి గాడిద యఱచినను అందు అర్థ ముండదుకదా?

ఈ మాటలు కేవలము సంగీతమునకే కాదు; కవిత్వమునకు గూడ అన్వయించుచున్నవి. రసాత్మకమైన ఒక్కమాట చాలును. రసహీనమైన వేయిమాట లెందుకని సర్వజ్ఞుని భావము. దీనినే వేమన్న:—

"నిక్కమైన మంచినీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాళ్ళు తట్టెడేల?
చదువఁ బద్యమరయఁజాలదా? యొకఁడైన" అనెను.

సర్వజ్ఞుడు సమాజ న్యాయముకొఱకు పాటుపడిన గొప్ప ప్రజాకవి, "జాతి-కుల-మత-ధనిక-దరిద్ర భేదరహిత సహజసహకార నిరాడంబర సంఘ జీవిత నిర్మాణము"నకు తన కవితాశక్తి నంతయు నుపయోగించెను. మూఢ విశ్వాసములను, మూర్తి పూజలను ఖండించెను. త్రికరణశుద్ధితో నిండిన భక్తియే మోక్షసాధనమని నొక్కి చెప్పెను. జాతి-కుల-మత-విభేదములు మూలమట్టుగా తొలగని నాడు సమాజమునకు శాంతి లేదని గట్టిగా చెప్పెను. "స్వర్గవిమె

లెగెరియిల్ల" "దేవరవికుల భేవిల్ల" అని పెక్కు విధముల ఉద్బోధించెను. ధనవంతులు ఉదారభావులై పేద ప్రజానీకమునకు తోడ్పడవలెనని కోరెను. ప్రజలు స్వార్థరహిత బుద్ధిగలవారై, దైవభక్తిపరులై, ధర్మావలంబకులై ప్రశాంత జీవితమును వడుపవలెనని బోధించెను.

## సర్వజ్ఞుని లౌకిక జ్ఞానము

సర్వజ్ఞమూర్తి గొప్పలౌకికజ్ఞాన సంపన్నుడు. అల్పసంతోషియని అతని వచనములనుబట్టి తెలిసికొనుచున్నాము. మానవునకు సంతృప్తియే నిజమైన ఆనందము నొసగునని అతని విశ్వాసము * ఇతని నిరాడంబర సంసార జీవితమును ఈ క్రింది వచనములలో జూడవగును:—

"బెచ్చ నామనె యాగి వెచ్చక్కె హొన్నాగి
ఇచ్చె యన్నరివ సతియాగె స్వర్గక్కె
కిచ్చు హాచ్చెంద సర్వజ్ఞ"

"ఎత్తుగళు ఎరడాగి, బత్తదిహహ యనాగి
పుత్రరద్దాగి సతి యొబ్బళాదరె
నిత్యదలి సుఖవు సర్వజ్ఞ"

వెచ్చని యిల్లు, వెచ్చమునకు డబ్బు, రెండెద్దులు, ఐదుగురు కొడుకులు, ఎల్లప్పుడు పాలిచ్చు పాడియావు, వెనుదీయక పనిచేయు కొడంద్రు, ఒక ముసలి అవ్వ. మనస్సెఱిగి మెలగు గుణవతియైన

*"సంతోషి కాడేని శక్రుండైన వశించు
నిర్ధనుండైనను నిద్రపోవు"
"తృప్తిం జెందని మనుజుడు
సప్తద్వీపములనైనఁ జక్కంబడునే"

—బమ్మెర పోతన భాగవతము.

భార్య ఉండినచో స్వర్గమునకే చిచ్చుపెట్టుమని చెప్పెను. అనగా నిరాడంబర ప్రశాంత జీవితమునకు ఈ పై చెప్పబడిన వుండిన చాలు వని సంతృప్తిని వెల్లడించినాడు. ఈ వచనములను బట్టిచూడ సర్వజ్ఞుడుగూడ వేమన్నవలె నూఱుపాళ్ళు గ్రామీణుడని స్పష్టమగుచున్నది.

## సర్వజ్ఞుని వచనములలో పురుషార్థములు

భారతీయ నైతిక, ధార్మిక జీవితమునకు పురుషార్థములు అత్యంత ముఖ్యసాధనములు. హైందవసమాజమున వీనికి మహోన్నత స్థానము కలదు. ఈ నాడు కూడ ప్రజలు వారి దైనందిన జీవితమున ఆ యా సందర్భములందు "పుణ్యమా? పురుషార్థమా?" అని అనుచుందురు. దీనినిబట్టి పురుషార్థములకు మన సమాజములో నెంత గొప్పస్థానము కలదో విశదమగుచున్నది *

ధర్మ – అర్థ – కామ – మోక్షములని పురుషార్థములు నాల్గు. మానవుడు పురుషార్థపరుడు కావలెను. అవి అతని ఐహిక జీవితమును శోభాయమానము, సుఖప్రదమొనర్చును. మన వైదిక గ్రంథమును దీనినే వేనోళ్ళ బోధించుచున్నది.

ఈ లోకమున మానవుడు ధర్మము – పుణ్యము – దేవుడు, మోక్షము మున్నగువానినిగూర్చి అత్యంత భక్తివిశ్వాసములు కలిగియుండును. మోక్షము చతుర్విధ పురుషార్థములలో చివరిది. మృగజీవితమునుండి వేరై, జ్ఞానమూర్తియైన మానవుడు పురుషార్థములను త్రికరణశుద్ధితో నాచరించి, జీవితప్రయోజనమును పొందును.

* ఉడుముండదె నూఱేండ్లును
పడియుండదె పేర్మిఁబాము పదినూఱేండ్లున్
మడువునఁ గొక్కెర యుండదె
కడునిల పురుషార్థపరుడు కావలె సుమతీ.

—సుమతిశతకము.

పురుషార్థములను సాధించి, క్రమశిక్షణతో గూడిన ఆదర్శజీవితమును చూపిన పుణ్యపురుషులు మన పురాణ సాహిత్య ప్రపంచమున పెక్కురు కానవచ్చుచున్నారు. వారిలో నత్యంతముఖ్యుడు దశరథ రాముడు.

మానవుడు ధర్మబుద్ధితో జీవింపవలెను. దయా దాక్షిణ్యాది గుణవిశేషములు కలిగి, విచక్షణా దృష్టితో, క్రమశిక్షణకలిగి, బాధ్యతాయుత నైతిక జీవితమును నడుపవలెను. శీలమే ఆతనికి గొప్ప భూషణము. ఈ గుణవిశేషములు కలిగియుండుటవలననే మానవుడు సృష్టిలోగల సమస్త ప్రాణులలో శ్రేష్ఠుడై వెలుగొందు చున్నాడు. స్థిరమైన నడవడి జనుల కందఱికి వలయును. ఉత్తమ సమాజ నిర్మాణమునకు అత్యంత ముఖ్య ధర్మము లివి. ఈ ధర్మము లన్నియు తన జీవితముద్వారా చూపిన ధర్మాత్ముడు దశరథరాముడు. శ్రీరాముడు ఏకపత్నీ వ్రతుడు; సత్యసంధుడు; దయాసముద్రుడు; గంభీరుడు, పురుషార్థములుసాధించిన ఆదర్శ రాజర్షి. ఈతని గుణ విశేషములగూర్చి మహాకవి వాల్మీకి అత్యంత మనోహరముగ వర్ణించెను * ఇట్టి లోకోత్తర లక్షణ లక్షితుడగుటచేతనే ప్రజ లీతనిని దేవునిచేసి పూజించుచున్నారు.

పూర్వాలంకారికులు కూడ పురుషార్థములు కావ్య ప్రయోజన మనిరి.

*"కోన్వస్మిన్ సాంప్రతంలోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞః సత్యసంధశ్చ సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణచ కోయుక్తః సర్వభూతేషు కోహితః
విద్వాన్ కః కస్సమర్థశ్చ కశ్చైక ప్రియదర్శనః
ఆత్మవాన్ కః జితక్రోధః ద్యుతిమాన్ కోఽనసూయకః
కస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే
ఏత దిచ్ఛామ్యహం శ్రోతుమ్"

—వాల్మీకి రామాయణమ్ ప్రథమసర్గః

"ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యం కళాసుచ
కరోతి కీర్తిం ప్రీతించ సాధుకావ్య నిషేవణమ్"

అని చతుర్వర్గ వ్యుత్పత్తియే కావ్యప్రయోజన మనిరి.

సర్వజ్ఞుని కవిత్వ స్వరూపముకూడ పురుషార్థ సాధనమే యని చెప్పవలెను. మానవుడు ధర్మబుద్ధి కలవాడై యుండవలెను. ధర్మ బుద్ధి యనగా బీదలకు దానధర్మములు చేయుటయే కాదు. మానవ ధర్మములన్నియు బాధ్యతతో పాటింపవలెను. దీనిని గూర్చి అతడు చెప్పిన ఈ వచనములు చూడుడు:—

## ధర్మము

అరద్దు నుడిదను అరద్దునడెవవను
అరద్దు పదవనిడు వవను లోకక్కె
ఆరాధ్యనక్కె సర్వజ్ఞ"

తెలిసి చెప్పువాడును, తెలిసి నడచువాడును, తెలిసి ముం దడుగు వేయువాడును ఈ లోకమున పూజింపబడుదురు. ఈ త్రివిధు లను శ్రద్ధాసక్తులతో పాటించువాడే ఉత్తమ మానవుడని సర్వజ్ఞుని అభిప్రాయము. ఈ మూడు చిన్నమాటలలో మానవ ధర్మము లన్నియు నిమిడ్చి చెప్పిన సర్వజ్ఞుని సంగ్రహశక్తి నేమని కొనియాడ వగును!

## అర్థము

మానవుని నైతిక, ధార్మిక జీవనమునకు అర్థ మత్యంత ముఖ్య మైనది. లేమి మానవుని సర్వశక్తులను నాశనము చేయును. ఇది భయంకరమైనది. లేమివలన మానవుడు ఒక్కొక్కప్పుడు నీతి నియమములను కూడ తప్పుచుండును. అర్థవంతునకిల నసాధ్యమైనది లేదు. అందుచేత న్యాయమార్గమును తప్పక మానవుడు ధన సంపా దనకై ప్రయత్నింపవలెను. ధనసంపాదనకు అనేక మార్గము లున్నవి.

అందులో ముఖ్యమైనది ఉద్యోగము. ఉద్యోగముచేసి, శ్రమపడి మనుష్యుడు జీవింపవలెను. ఉద్యోగము పురుషలక్షణము కదా!

"ఉద్యోగ ఉళ్ళవన హెద్దువుదు సిరిబందు
ఉద్యోగ విల్ల దిరువవన కరదొళగె
గిద్దు దూపోకు సర్వజ్ఞ"

ఉద్యోగము చేయువానిని లక్ష్మి వచ్చి చేరును. లక్ష్మి శ్రమజీవినే ఆశీర్వదించి ప్రేమించును. ఉద్యోగము చేయకుండ తిరుగు సోమరిని లక్ష్మి ఆశీర్వదింపదు, అతనిని వదలి దూరముగా పోవును. అందుచేత మానవుడు ఏదో యొక ఉద్యోగముచేసి ధనము నార్జింపవలెను. శ్రమచేసి, అర్థము సంపాదించి వానితో దానధర్మములు చేసి ప్రశాంతజీవితమును నడుపవలెనని సర్వజ్ఞుని అభిప్రాయము.

## కా మ ము

కామమనగా 'ఇంద్రియ సుఖముల ననుభవించుట'-అని పురుషార్థములకు సంబంధించిన అర్థము. మనుష్యుడు శీలమును విడువక క్రమశిక్షణతో గూడిన కామసుఖము ననుభవింపవలెను. తన ప్రియమైన భార్యయందు మనస్సు లగ్నముచేసి, పరిపూర్ణానందమును పొందవలెను.

"మనబంద హెణ్ణన్ను, వినయ దరికరదిత్తు
మనముట్ట బాళ్వెమాడిదరె అమృతద
కెనయు సవిదంతె సర్వజ్ఞ"

మనస్సునకు నచ్చిన మానిసిని వివాహమాడి ఆమెకు హితమగునట్లు ప్రేమ జీవితమును సాగించిన అది అమృతముమీది మీగడ తిన్నంత ఆనందము కలుగును. వారి జీవితము అత్యంత శోభాయమానవముగా నుండును, క్రమశిక్షణతో గూడిన పవిత్ర దాంపత్య జీవితముగూర్చి వచించిన సర్వజ్ఞని ఈ వచనము అత్యంత మనోహరము గదా!

పరస్త్రీ గమనము మహాపాపమని చెప్పిన ఇంకొక వచనమును చూడనగును :—

"ముట్ట దంతిర బేకు ముట్టవలె ఇర బేకు
ముట్టియూ ముట్టదిర బేకు పరస్త్రీయ
ముట్టదవ కెట్ట సర్వజ్ఞ"

మానవుడు తన నైతిక, ధార్మిక సంపదచే భక్తి, జ్ఞాన, వైరాగ్యములలో నొక్కనదైన మోక్షమును పొందగల్గునని సర్వజ్ఞుడు వచించెను.

"సుధియు సుదెయను కవిదు ముకది మంత్రవనెనెదు
ఉదయురాగ దొళునిందిర్ద శివయోగి
నిధి పురుషకాణో! సర్వజ్ఞ"

వీరశైవ వచనకర్తలందరు సదాచార సత్కర్మల నాచరించుట ద్వారా మానవుడు సంస్కార హృదయుడై చివరకు లింగైక్యము పొందునని చెప్పియుండిరి.

## సర్వజ్ఞుని ఛందస్సు

సర్వజ్ఞుడు గ్రహించిన 'త్రిపది' కన్నడ సాహిత్యమున అత్యంత ప్రసిద్ధిగాంచిన ఛందస్సు. ఇది కన్నడము మాటాడు జన సామాన్యమునకు మిక్కిలి ప్రియమైనది. ఈ ఛందస్సు కర్ణాటక సాహిత్యమున 'గాయత్రి' వంటిదని చెప్పిన ఆచార్య శ్రీ బేంద్రే మాటలలో కొంచెమైన అతిశయోక్తి లేదు. గ్రామీణులు దీనిని అనేక విధముల నుపయోగించుచున్నారు. జోలపాటలకు, స్త్రీలపాటలకు, రోకటిపాటలకు, పొలము పాటలు మున్నగువానికి ఈ ఛందము మూలము. 'వేమన్న'కు ప్రియమైన ఆటవెలది కంటె సర్వజ్ఞుని 'త్రిపది' సంగీతమునకు పనికి వచ్చు స్థిరమైన 'లయ' గతి కలది. దీనిని వచనమనుట కంటె పాట అనుట మేలని శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ చెప్పిరి.*

* శ్రీ అనంతకృష్ణశర్మ వేమన. పుట. 120

ప్రాచీన కాలమునుండి జానపద గేయములలో నీ ఛందము కానవగుచున్నది. ఇది శుద్ధ దేశీయచ్ఛందమని వేఱ చెప్పనవసరము లేదు. ఇతర వచన కవులు సిద్ధరాము, అక్కమహాదేవి మున్నగు వారు కూడ దీనిని వాడియున్నారు. వేమన్న ఆటవెలదినివలె సర్వజ్ఞుడు దీనినే ప్రధానముగా వాడెను. ఈ సంస్కార హృదయుడు చేబట్టుటచేత దీనికి నెనలేని గౌరవము వచ్చినది. దీని రూపమును దిద్ది తీర్చుటకే సర్వజ్ఞుడు కన్నడ సాహిత్య ప్రపంచమున అవతరించెనా! అని మన కొకప్పు డనిపించును. ఈతని 'త్రిపది' మార్గము క్రముని మార్గమువలె వెలసినది. లలిత మనోహర పదములతో సహజాలంకార శోభితమై, భావగాంభీర్యముట్టిపడ ఈతని వచనములు సర్వజ్ఞుల నానంద డోలికల నూగించును.

## సర్వజ్ఞుని అలంకారములు

సర్వజ్ఞుడు వేమన్నవలె సర్వస్వాతంత్రుడు. ఒకరి దయాదాక్షిణ్యముల మీద ఆధారపడినవాడు కాడు. తన కవిత్వమును ఇతరుల మెప్పుదలకు వ్రాయలేదు. తక్కిన కర్ణాటక పండిత కవుల వలె ఈతని కవిత్వము శబ్దాలంకార సహిత సంస్కృత భూయిష్ఠ రచన కాదు. సామాన్య కన్నడిగులు వారిదైనందిన జీవితములో నుపయోగించు అత్యంత సులభసుందర జాతీయపదజాలముతో ఈతని కవిత్వము కలకల లాడుచుండును.

సర్వజ్ఞుడు ప్రౌఢాలంకారముల జోలికి పోలేదు. ఇతని కవిత్వములో సాధారణముగ కానవగునవి ఉపమా, రూపక, దృష్టాంతాలంకారములు. అవి కూడ ఎక్కడనుండియో తెచ్చికొనినవియు కృత్రిమములును కావు. మనకు చిరపరిచితములైనవే. వానికి ఒక క్రొత్త రూపమునిచ్చి మన కన్నులముందు నుంచును. ఇందులోకూడ ఈతడు వేమన సోదరు డనుట స్పష్టము. ఈతని ఉపమాలంకారముల కుదాహరణముగా ఈ వచనములు చూడనగును:—

"అ తి మరతా కాయ హా తిద్ద కెరదంతె
తత్త్వభేదవను అరియదెయె రుద్రాక్ష
హాొత్తు ఫలవేను సర్వజ్ఞ"

మేడిచెట్టు నిండ కాయల గుత్తులు వ్రేలాడునట్లు తత్త్వమెరుగని యతి మెడనిండ రుద్రాక్షమాలలు వ్రేలాడిన ఏమి ప్రయోజనము? మేడిచెట్టుకు తత్త్వమెఱుగని ఈ మొద్దు యతికి వ్యత్యాసమే లేదని సర్వజ్ఞుని భావము. ఈ పోలిక అత్యంతమనోహరము.

"మండె బోళిసికొండు తుండుగంబళి హాొదెదు
హిండన గళిద గజదంతె ఇప్పవర
కండు నంబువుదు సర్వజ్ఞ"

తలను బోడిచేసి తుండుకంబళి కప్పుకొని, గర్వరహితుడై గుంపువీడిన ఏనుగవలె స్వేచ్ఛగా తిరుగు జ్ఞానికడకు వెళ్ళుడని ప్రజలను కోరెను.

గర్వరహితుడై తిరుగు యతిని గుంపు వీడి తిరుగు ఏనుగతో పరిపోలుట్చ చక్కగా నున్నది.

## రూపకాలంకారము

"ధ్యానదా హాొసబత్తి మౌనదాతిళి దుష్ట
స్వానుభవవెంబ బెళగినా జ్యోతియ
జ్ఞానవం సుడుగు సర్వజ్ఞ"

ధ్యానమనెడి క్రొత్త వత్తిని, మౌనమనెడి తేటనేయి యందిడి, స్వానుభవమనెడి జ్యోతిని వెలిగించిన అజ్ఞానమనెడి తిమిరమును దహించును.

"ఒడలెంబ హుత్తక్కె నుడివనాలిగసర్ప
కడు రోషవెంబ విషవేరి సమతెగా
రుడిగ నంతక్కు సర్వజ్ఞ"

శరీరమనెడు పుట్టలో నాలుక అనెడు పాము, కోపమనెడు విషమే మనలను దుఃఖములో ముంచును. కావున దాని నణచుటకు 'గారుడమంత్రము' నిగ్రహశక్తి అని మానవుడు తెలిసికొనవలెను:

ఇచ్చట మానవశరీరము పుట్టయనుటలో గొప్ప యౌచిత్య మున్నది. పుట్ట కెట్లు రంధ్రము లుండునో మానవశరీరమునకు కూడ నట్లు రంధ్రము లున్నవి. కోపము దారుణమైన విషమువంటిదే. ఇట్టి భయంకరవిషమును గ్రక్కు పామును స్వాధీనమందుంచుకొనుటకు గారుడమంత్రమనెడు నిగ్రహశక్తి కావలెను. ఈ రూపకాలంకారము అత్యంత మనోహరముగా నున్నది.

## దృష్టాంతాలంకారము

"కత్తె బూదిలి హొరళి మత్తెయతియప్పుదే?
తత్త్వవరియలె భనిక విచ్చప శుద్ధ
కత్తె యంకెంద సర్వజ్ఞ"

గాడిద బూడిదలో పొరలినంత మాత్రమున అది 'యతి' యను పేరు పొందగలదా? పరతత్త్వ మెఱుంగక శరీరమునిండ బూడిద పూసికొనిన 'యతి'ని ఖరమని ఎందుకు చెప్పరాదు?

"చచ్చు వాతెరదింద కచ్చువాళుని లేసు
నిచ్చలు ఉలివ సకియింద ఉరిదిర్ద
నిచ్చు తా లేసు సర్వజ్ఞ"

కఱచెడి చెప్పులకంటె కాళ్లకుక్క మేలు. ఎల్లప్పుడు దుర్భాషలాడు భార్యకంటె మండుచున్న అగ్ని మేలు. ఈ దృష్టాంతము మృదురీతిని సూటిగా హృదయమునకు దగులుచున్నది.

"గంధవను తేవల్లి ఒందు నొణవను కాణె
మలవ సంధిసి బిడువల్ల నూణముత్తు
వందవను నోడు సర్వజ్ఞ"

గంధము తీయునప్పుడు అచ్చట ఒక ఈగయు వ్రాలదు. మలవిసర్జన చేయు స్థలమున ఈగలు విపరీతముగా వ్రాలును. ఈ దృష్టాంతము కొంచె మసహ్యముగా నున్నను ఇందులో సత్యమున్నది. ఇట్టి దృష్టాంతములు సర్వజ్ఞుని వచనములలో నెన్నియో చూతుము.

"బెట్ట కర్పూర వురిదు భొట్టిదలు బూదిల్ల
నెట్టనెగురువి గెరగి దన సంసార
సుట్టు హోగువదు సర్వజ్ఞ."

కొండంత కర్పూరము వెలిగించినను ఒకరవ్వైన బూడిద మిగలనట్లు మంచిగురువును సేవించినవారికి అన్ని సంసార సంబంధ మైన దుర్గుణములు, పాపములు పూర్తిగ పోవును.

"మాతు బల్లాతంగెయూతవదు సురిదంతె
మాతాడ లరియ దాతంగె బరియూత
నేతాడి దంతె సర్వజ్ఞ"

నేర్పుతో మాటలాడ నేర్చినవానిమాటలు ఏతములో నీళ్ళు తోడినట్లు క్రిందికి పోవును. మాట నేర్పు చాలని వాని మాటలు ఏత మునకు వ్రేలాడునట్లుండును. అనగా నేమియు ప్రయోజనముండదని భావము.

"జాతిహీనన మనెయ జ్యోతి తాహీనవే?
జాతివిజాతి యన బేడ దేవనొలి,
దాతనె జాత సర్వజ్ఞ"

జాతి హీనుని యింట వెలసిన జ్యోతి హీనమగునా? జాతి, విజాతి, అని యనవద్దు. దేవునకు ప్రియమైనవాడే ఉత్తమజాతికి చెందినవాడు. అనగా సత్పురుషుడే ఉత్తమజాతికి చెందినవాడని సర్వజ్ఞుని అభిప్రాయము.

ఈవిధముగా సహజ దృష్టాంతములకు నిలయమై ఒప్పు చున్నది సర్వజ్ఞుని కవిత్వము.

# వేమన్న సర్వజ్ఞులు మర్మకవులా?

వేమన్న సర్వజ్ఞులకు వేదాంతకవులుగా కూడ ప్రచార ముండుటవలన, వీరి రచనలలో అచ్చటచ్చట కొన్ని అస్పష్టమైన వేదాంత సత్యములుండుట మూలమున కొంతమంది వీరిని మర్మకవు లనియు చెప్పెదరు. అసలీ రహస్యవాదము వారి కవిత్వములో నున్నది లేనిది చర్చించుటకు పూర్వము మర్మకవిత్వమనగా నేమో దాని కాపేరు ఎట్లు వచ్చెనో మొదలగువానినిగూర్చి ఇచ్చట కొంచెము తెలిసికొందము.

మర్మకవిత్వమనగా అస్పష్టమైన కవిత్వమని యర్థము. అది సామాన్యజనులకు అగమ్యగోచరమై యుండును. సామాన్య జనులకే అననేల? సహృదయులను గూడ ఒక్కొక్కప్పుడు ముప్పుతిప్పలు పెట్టును. దానిని అర్థము చేసికొనుటకు కొన్ని ప్రత్యేకమైన మార్గము లున్నవి. ముఖ్యముగా ఆధ్యాత్మిక భావసూత్రములు దానికి చాల ముఖ్యము.

కుక్క తిన్నవాడు గురులింగజంగము
పంది తిన్నవాడు పరమయోగి
ఏన్గు తిన్నవాడు ఎంత సుజ్ఞానిరా!

మర్మకవిత్వము సామాన్యముగా తేటగీతి, త్రిపదివంటి చిన్ని పద్యములలోను, తత్త్వములలోను, కందార్థములోను ఉండును. ఇది గానమునకు, భావమునకు సమాన ప్రాధాన్యము నిచ్చును. ఇందలి భాష కూడ అత్యంత సులభమై సామాన్యుడగు అక్షరాస్యునకు కూడ అందుబాటులో నుండును.

ఈ ప్రక్రియ భారతదేశమున చాల సనాతనమైనది. దీనికి బీజము వేసినవారు వేదఋషులని చెప్పవచ్చును. తరువాత మత సంప్రదాయములలో నిట్టి కవిత్వ మంకురించి, శాఖోపశాఖలుగ నభివృద్ధి పొందినది. వైష్ణవకవుల కీర్తనలయందు దీని నెక్కువగ చూడగలము. దీనికి కారణము వైష్ణవులకు ప్రధానమైనది భక్తి. దానికి

ప్రేమ ఆలంబనము. జీవాత్మకును, పరమాత్మకును గల సంబంధమును రాధాకృష్ణుల ప్రేమలీలలను సంకేతించి వారు కీర్తనము చేసిరి. విరహిణి యైన నాయిక ఎన్ని యవస్థలకు పాల్పడునో, తన్ను రాధగను, పరమాత్మని కృష్ణునిగను సంకేతించుకొని, భక్తుడు అన్ని యవస్థలు అనుభవించును. చివరకు పారవశ్యము పొందును. పన్నిద్దరాళ్వారులలో నమ్మాళ్వారునకు ఆ దశ కలిగినట్లు చెప్పుదురు. రామకృష్ణ పరమహంస, చైతన్య స్వాములకు గూడ ఈ యనుభవమే కలిగినదని చెప్పుదురు. తెలుగువారిలో త్యాగరాజు, రామదాసు మొదలగువారు గొప్ప మర్మకవులని చెప్పవలెను. ఉత్తరాదిని కబీరు కూడ ఈ సంప్రదాయమునకు చెందిన కవియే!

ఆంధ్రదేశమున ఇంకొక విధమైన ఆధ్యాత్మిక కవిత్వము ప్రచారములో నున్నది. దీనికి పోతులూరి వీరబ్రహ్మము, అతని శిష్యులు సిద్ధప్ప మొదలగువారు ముఖ్యులు. వీరి కాలజ్ఞానతత్త్వములు అచల మతస్థుల పేరుతో తిరుగుచుండు కొంతమంది బైరాగులు పాడుచుందురు!

ఇది ఇట్లుండ ఇంకొక శాఖ పాశ్చాత్య దేశములనుండి వచ్చి భారతీయ కవులలో ప్రవేశించినది. ఈ ప్రక్రియకు జన్మస్థానము ఫ్రాన్సు. "బాబిలేన్" అను నాతడు దీనికి మార్గదర్శకుడు. తరువాత క్రమముగా యూరపు ఖండమం దంతటను వ్యాపించినది. కీట్సు, వర్డ్సువర్తు, షెల్లీ మొదలగువారు ఈ ప్రక్రియకు సంబంధించినవారే.

ఈ శతాబ్దమున రవీంద్రనాథ టాగూరు ఈ ప్రక్రియకు గురుపీఠమని చెప్పవలెను. వీరిలో ప్రాచ్య పాశ్చాత్య సంప్రదాయములు రెండును చూడగలము. గీతాంజలి, క్రిసెంటుమూను మొదలైనవి ఈ ప్రక్రియకు దర్పణములై వెలయుచున్నవి.*

* When one art can fully be explained by another then, it is a failure.
—Ravindranath Tagore.

రవీంద్రుని శిష్యులు, అనుయాయులుననదగువారు మన ఆంధ్ర దేశమున కూడ పలువురు కలరు. వారిలో అత్యంత ముఖ్యులు సర్వశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, రాయప్రోలు సుబ్బారావు, నోరి నరసింహశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డి మొదలగువారు. శ్రీ రామిరెడ్డి "మర్మకవి" అను పేర ఖండకావ్యమును కూడ వ్రాసి యున్నారు. వీరి కవిత్వములో ఆధ్యాత్మిక వాసనలకంటె భౌతిక భావనా సంబంధ విశేషములు ఎక్కువగా నుండుటచేత వారిని "మర్మకవు"లనుటకంటె ప్రణయకవులు. భావకవు లనుట (Romantic Poets) సర్వ విధముల తగి యున్నది.

ఇక వేమన్న సర్వజ్ఞుల కడకు వత్తము. వీ రిరువురును ప్రగతిశీల దృక్పథము గల ప్రజాకవులు. వీరి కవిత్వములో అస్పష్టతకు, గూఢతకు చోటు లేదు. వీరి రచనలో వైశద్యమను గుణము మెండు. వీ రేవిషయమును చెప్పదలచినను కుండ బ్రద్దలు కొట్టినట్లు సూటిగా, తేటగా, స్పష్టముగా ప్రజాభాషలో హృదయమునకు హత్తునట్లుగ చెప్పుదురు. దాని కుదాహరణముగ ఎన్నియో పద్యములు, వచనములు చూడనగును.

"గంగి గోవుపాలు గంటెడైనను చాలు
కడివెడైననేమి ఖరముపాలు ?
భక్తి గలుగు కూడు పట్టెడైనను చాలు"

"అనువుగాని చోట నధికుల మనరాదు
కొంచె ముండుటెల్ల కొదువ కాదు
కొండ యద్దమందు కొంచెమై యుండదా ?"

దృష్టాంత రమణీయములైన ఈ పద్యరాజములు బాలురకు కూడ మనస్సున కత్తుకొని ఆనందము కలుగజేయును.

"ఆత్మశుద్ధిలేని యాచార మది యేల
భాండశుద్ధిలేని పాక మేల !
చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా !"

"తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్విజనులకెల్ల నుండు తప్పు
తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుగరు"

"మాతనే ఉణకొట్టు, మాతనే ఉడకొట్టు
మాతిన ముత్త కొడకొట్టు బెళిగెహో,
దాననే జాణ సర్వజ్ఞ"

"ఆ దేవ ఈదేవ! మాదేవ నెగ బేడ
ఆ దేవర దేవ భువనదా ప్రాణిగళి
గాదవనె దేవ సర్వజ్ఞ"

అస్పష్టత, అన్వయకాఠిన్యము గల కూట వేదాంతతత్త్వములు కొన్ని వీరి కవిత్వములో కానవగుచున్నవి. అవి వీరివి కావని ఖచ్చితముగ చెప్పవచ్చును. అవి కొందరు బైరాగులు, వేమయ్యలు, మాలదాసరులు, బసవయ్యలు వ్రాసి చేర్చినవి. వీరే పోతులూరి వీరబ్రహ్మముగారి కాలజ్ఞాన తత్త్వములు వేమన్న కంటగట్టుట, వేమన్న పద్యములు తెచ్చి వీరబ్రహ్మముగారి తత్త్వముల కతికించుట చేసి యుండవచ్చును. ఇట్టి పనులలో వీరు సిద్ధహస్తులు. ఇట్లే కన్నడదేశమున బసవభక్తులు కొందరు సర్వజ్ఞుని వచనములను తారుమారుచేసి యుందురని నా దృఢవిశ్వాసము.* అదియుగాక హేతువాదము–రహస్యవాదము (Rationalism and Mysticism) రెండును కలసి మెలసి వెళ్ళుట అసంభవము కదా? అది సాధ్యమని చెప్పిన వారి మాటలు సమర్థనీయములు కావు.

ఈ కవి సోదరులు ప్రతివిషయమును ప్రశ్నించి యుండిరి. (Questioned everything) ఇది వీరిలోని మఱొక ప్రత్యేకమైన గుణవిశేషము.

* శ్రీ కృష్ణశాస్త్రి 'సర్వజ్ఞ కవి.'

"జీవులందెశాశ శిలల నేమున్నది?
"రాయి దేవుడైన రాసులు మ్రింగడా?
"పంది బురద మెచ్చు; పన్నీరు మెచ్చునా?
"పచ్చికాయఁదెచ్చి పడవేయ ఫలమౌన!
"తత్త్వభేదమను అరియదెయె
రుద్రాక్ష పూన్తు ఫలమేను!
చిత్తదలిశివన నెనెయదె దేశవను
సుత్తి ఫలమేను!
"జాతి హీనరమనెయ జ్యోతి తా హీనవె!

మున్నగునవి.

వీరి వేదాంతము మానవసమస్యలకు సంబంధించినది. వీరి భక్తి విచక్షణగల జ్ఞానభక్తి. వీరి మతము ప్రగతిశీల మానవత్వము. వీరి దేవుడు సమస్తలోకములను చల్లగా కాపాడు సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు.

"ఒబ్బనల్లదె జగతె ఇబ్బరుంటె పుత్తె!
ఒబ్బ సర్వజ్ఞ కర్తను జగకెల్ల
ఒబ్బనే దేవ సర్వజ్ఞ"

# వేమన - సర్వజ్ఞుడు
# కొన్ని
# పోలిక పద్యములు

వేమన సర్వజ్ఞుల స్వభావములలో, భావములలో అభిరుచులలో, వాడిన భాషలో కొంత భేదము కానవచ్చినను వీరి జీవితాశయములు మాత్రము ఒక్కటే యని మనము తెలిసికొనగలము. వీ రిరువురు ఒకచోట కలిసికొని మాటలాడుకొనినట్లు వ్రాసిన కొన్ని పద్యములు చూడనగును :

వేమన్న :

"తప్పులెన్నువారు తండోపతండంబు
లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పు;
తప్పులెన్నువారు తమ తప్పు లెఱుఁగరు..."

ఒకరి తప్పులు పట్టువారు ఈ లోకములో గుంపులు గుంపులుగా నుందురు. ప్రతి ఒక్కరియందును దోషము లుండును. కాని యెవరును తమ తప్పును తాము తెలిసికొనరు. అదేమి మానవ స్వభావమో! ఆత్మ విమర్శనము చాల అవసరమని వేమన్న చక్కగా నుడివెను.

సర్వజ్ఞుడు :

"కన్న దోషవనూర బిన్న హిందకె ఇరిసి
అన్య నొందక్కె హులియప్ప మానవను
కున్నియల్లేను సర్వజ్ఞ."

తన దోషములను దాచుకొని ఇతరుల తప్పులను వెదకు మానవుడు కుక్కకంటె హీనుడని సర్వజ్ఞుడు అత్యంత తీక్ష్ణముగ చెప్పెను.

వేమన్న :

"ఆలి మగని మాట కడ్డంబు వచ్చెనా
ఆలు గాదు నుదుటి వ్రాలు గాని
అట్టి యాలి విడిచి యడవి నుండుట మేలు..."

మృదుమార్గమున బోధింపవలెను గాని భార్య భర్త మాటకు అడ్డము రాకూడదు. అడ్డువచ్చిన వారిలో నొక విధమగు అనైక్యత యేర్పడును. వారి బాధ్యతాయుత జీవితము దెబ్బతినును. సుహృదయుడైన భర్త భార్య తిరుగుబాటుతనమును తన దురదృష్టముగ భావించును. అట్టి భార్యను విడిచి వైరాగ్యమును స్వీకరించుటయే (అడవినుండుట) మేలని యెంచును.

సర్వజ్ఞుడు :

"నోరు వా మనె యింద దారి యామర లేసు
హోరువా సతియు బదుకింద హాడెదొయ్వ
మారియే లేసు సర్వజ్ఞ."

వర్షమునకు ఉరిసి, కారుచున్న ఇంటికంటె బాట ప్రక్కగల చెట్టు మేలు. సదా కలహించు భార్యకంటె మానవుని పట్టి చంపు అంటురోగము మేలని సర్వజ్ఞుడు చెప్పెను.

వేమన్న :

"మేడిపండుఁ జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడఁ బురుగులుండు
పిఱికివాని మదిని బింక మీలాగురా..."

మేడిపండు చూచుటకు ఎంతో అందముగా నుండును. పొట్ట విచ్చి చూచినచో దాని నిండ పురుగు లుండును. ఆ విధముగనే డంబములు పలుకువాడు బయటకు గొప్పగా కనబడినను మనస్సున మాత్రము పిఱికిగుణ ముండును. ఈ అర్థాంతరన్యాసము అత్యంత మనోహరము కదా!

సర్వజ్ఞుడు :

"కెంపు హంపలి నొళగె కెంపు ఇట్టియ హణ్ణు
కెంపుంటు ఒళగె విషవుంటు దుర్జనర
పెంపు ఇంతెంద సర్వజ్ఞ."

ఇట్టియ ఫలము. ఎట్టిని పండ్లలో నత్యంత సుందరమైనది. కాని దాని లోపలిభాగము విషముతో నిండి యుండును. ఆ విధము గనే దుర్జనుడు పైకి మంచివానివలె కనుపించినను వాని హృదయము మాత్రము విషముతో నిండియుండునని సర్వజ్ఞుడు చెప్పెను.

వేమన్న :

"ఇనుము విఱిగెనేని యినుమారు ముమ్మారు
కాంచి యతుకనేర్చు కమ్మరీఁడు;
మనసు విఱిగెనేని మఱి యంట నేర్చునా?..."

ఎంతటి కఠినమైన యినుమైనను విఱిగిన దానిని కమ్మరీడు రెండు మూడు పర్యాయములు కాల్చి యతుకగలడు. ఇది సాధ్యమైన పని. కాని మనస్సు విఱిగినయెడల అతుకుటకు ఎవరికిని సాధ్యము కాదని వేమన్న భావము.

సర్వజ్ఞుడు

"కావ కబ్బునవు తా హొద్దెడనె కూడువుదు
హోదల్లి మాతమరెదడె కబ్బునవు
కాదారి దంతె సర్వజ్ఞ."

విఱిగిన ఇనుమును కాల్చి అతుకవచ్చును కాని హృదయము నకు బాధ కలిగించు మాట మాత్రము చల్లారి గట్టిపడిన యినుము కంటె కఠినమైనదని సర్వజ్ఞుడు చెప్పెను.

వేమన్న

"కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను మిగుల గోడు చెందు
కోపమడఁచెనేని కోరిక లీడేరు..."

కోపమువలన గొప్పతనము తగ్గిపోవును. కోపముచేత చివరకు చిన్నతనము కూడ కలుగును. కోపము మనుష్యులకు చాల చెడ్డది.

కోపమును ఎవరు విడుతురో వారి కోరికలన్నియు నెఱవేరునని వేమన్న "శాంతమే సకల కార్యసాధన"మని చెప్పెను.

సర్వజ్ఞుడు

"కోప నెంబుదు కేళు పాపద నెలెగట్టు
కోప దొళు నేణు హారిదంతె నరకదొళు
కోపి తానిళివ సర్వజ్ఞ.

కోపము మనుష్యుని చెఱచును. కోపము పాపము కూడ. నీళ్ళు తోడునప్పుడు చేదత్రాడు తెగి నూతిలో పడునట్లు కోపము గల మనుష్యుడు నరకమునందు పడును.

సర్వజ్ఞుడు కూడ వేమన్నవలె మానవులకు శాంతమే భూషణమని దృష్టాంత పూర్వకముగా నత్యంత మనోహర రీతిని చెప్పెను.

వేమన్న :

"నిజము లాడు వాని నిందించు జగమెల్ల
నిజము లాడరాదు నీచుతోడ;
నిజమహాత్ముతోడ నిజమాడ వలయురా..."

నిజము పలుకువారిని నీచలోకము నిందించును. కావున నీచుల కడ నిజము పలుకరాదు. నిజమైన మహాత్ములయొద్దనే నిజము పలుక వలెను అని వేమన లౌకిక ధర్మోపదేశము చేసెను.

సర్వజ్ఞుడు

"కండంతె హేళివరె కెండవాగువరు భూ
మండల దొళగె కండితవనాడు వర
కండిహుదె కష్ట సర్వజ్ఞ

లోకమునందు జనులు నిజము చెప్పువారిని గాంచినంతనే నిప్పువలె మండిపడుదురు. (యథార్థవాది బహుజన విరోధి కదా!).

కాని అటువంటి ఖండితవాదులను (సత్యసంధులను) ఈ లోకమున కనుగొనుటయే బహు కష్టమని సర్వజ్ఞుని భావము.

వేమన్న :

"ఆడువారి గన్న నర్థంబు పొడగన్న
సారమైన రుచుల చవులఁగొన్న
అయ్యగార్లకైన నాశలు బుట్టవా?...'

ఆడువారిని గాంచినను, ధనము చూచినను, మధుర పదార్థములు రుచిచూచినను, అయ్యగార్లకైన (గురువులకైన) ఆశలం కలుగును. అనగా కాంతాకనకములు, సారమైన రుచులు ఎట్టివారినైన ఆకర్షించునని వేమన భావము.

సర్వజ్ఞుడు :

"హెణ్ణన్ను హొన్నన్ను హణ్ణాదమరగళను
కణ్ణినలి కండు మనదలి బయస దిహ
అణ్ణగళు యారు సర్వజ్ఞ."

వనితను, కనకమును, రుచికరమైన పండ్లను చూచిన వానిని మనస్సున ఆపేక్షింపనివారు ఈ భూలోకమున నెవరు కలరు? అనగా ఎవ్వరును లేరని భావము.

వేమన్న :

"భూతి దేహమందు పూసితే నాయెనా?
నిష్ఠ శివునియందు నిలుపవలయుఁ
గాక భస్మమందు గాడిద పొర్లదా..."

శివునియందు నిష్ఠ నిలుపకుండ బూడిద శరీరమునిండ పూసికొనినంతలో ప్రయోజన మేమి?

గాడిద బూడిదలో పొర్లాడును. అంతమాత్రమున దానికి మోక్షము వచ్చునా?

సర్వజ్ఞుడు :

"కత్తె బూదిని హొరళి మత్తెయతి యప్పుదే?
తత్త్వ వరి యదలె భసిత విట్టవ శుద్ధ
కత్తెయంతెంద సర్వజ్ఞ."

ఖరము బూడిదలో పొరలినంత మాత్రమున యతి యగునా? అట్లే పరతత్త్వము నెఱుగకుండ భస్మము పూసికొన్నయతనిని గాడిద యని చెప్పవలెను.

వేమన్న :

"హృదయమందు నున్న యీశునిఁ దెలియక
శిలలకెల్ల మ్రొక్కు జీవులార!
శిలల నేమి యుండు? జీవులందే కాక!"

హృదయమునందు నున్న ఈశ్వరుని తెలిసికొనలేక ఱాళ్లకు మ్రొక్కులిడు జీవులారా! జీవులందు కాక శిలలలో నేమి యున్నది? జీవుడే దేవుడని నమ్ముడు అని వేమన్న యుద్బోధించెను.

సర్వజ్ఞుడు :

"తన్నలిహ లింగవను మన్ని సవికరి యదె
బిన్నణది కడెద ప్రతిమ గళిగెరగువ
అన్నెయవనోడు సర్వజ్ఞ."

ఆత్మయందుండు హరుని పూజింపక కాళికాది విగ్రహములను పూజించుట, మ్రొక్కులు చెల్లించుట మీకు సరిగా నున్నదా? అని సర్వజ్ఞుడు మూఢప్రజల నడుగుచున్నాడు.

వేమన్న :

అన్నమిడుటకన్న నధిక దానము లేదు
ఎన్ని చేయనేమి యెన్నఁబోరు
అన్న మెన్న జీవనాధార మవునయా..."

జీవనాధార మగుటచేత అన్నదానమునకు మించిన ఉత్తమ దాన మింకొకటి లేదు. ఏ దానమువలనను తృప్తిపడని వారు అన్న దానమువలన సంతృప్తిపడుదురు. కనుక అన్ని దానముల యందును అన్నదానము సర్వశ్రేష్ఠమైనది.

సర్వజ్ఞుడు :

"అన్నదాన గళింద మున్న దాళగళిల్ల
అన్నక్కె మిగులు ఇన్నిల్ల జగదొళగె
అన్నవే ప్రాణ సర్వజ్ఞ."

అన్నదానమునకు మించిన దానములేదు. అన్నమునకు మించినది ఈ ప్రపంచమున నింకొకటి లేదు. అన్నమే సమస్త జీవులకు ప్రాణము కదా!

వేమన్న :

"ఒడలు బడలఁజేసి యోగుల మనువారు
మనసు కల్మషంబు మాన్పలేరు,
పుట్టమీఁదఁ గొట్ట భుజగంబు చచ్చునా?..."

శరీరము బడలఁజేసి (యోగాసనములు మొదలగునవి వేసి) యోగులమని చెప్పుకొనువారు మనసులోని కల్మషమును మాత్రము పోగొట్టుకొనలేరు. పుట్టమీద కొట్టినచో లోపల నున్న పాము చచ్చునా? అనగా మనస్సును జయింపవలెనుగాని, ఊరక యోగాసనాదులవలన శరీరమును డడలజేయుటచేత ప్రయోజనము లేదని భావము.

సర్వజ్ఞుడు :

"ఒడల వండిసి ముక్తి పడెదెనెంబవ హెడ్డ
బడిగె యలి హొడె యలడ గిహా సర్ప
మడియువుదె హేళు సర్వజ్ఞ"

భావము సమానము.

వేమన :

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండుఁ
జూడఁ జూడ రుచుల జాడ వేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా..."

ఉప్పు, కర్పూరము చూచుటకు ఒకే విధముగా నుండును. రుచి చూచిన తరువాత కాని ఏది ఉప్పో, ఏది కర్పూరమో తెలిసికొనలేము. అదే విధముగా పురుషులలో పుణ్యపురుషులైనను, నీచులైనను ఒకే విధముగా కనుపింతురు. వారి వారి గుణములనుబట్టి మనము పుణ్య పురుషులను, ఇతరులను గుర్తింపవచ్చును.

ఇదే భావమును సర్వజ్ఞుడిట్లు చెప్పెను :

"కల్లుప్పు కర్పురవు సొల్లెరడు థాతొందు
ఖుల్ల నొళిదన రూపొందు గుణదొళగె
ఎల్ల అంతరవు సర్వజ్ఞ."

వేమన్న :

"బందె తాళ్ళు దెచ్చి బంధించి కట్టంగ
లింగఁడేమి దొంగిలించినాఁడొ !
ఆత్మలింగమునకు నర్పింప నేరరో..."

ఆరాధ్యులు లింగమును విడిపోకుండ త్రాళ్ళతో గ్రుచ్చి మెడలో వేసికొందురు. నిజమునకు ఇట్లు బంధింపవలసినది దొంగలను కదా! లింగమూర్తిని దొంగను కట్టినట్లు బందె త్రాళ్ళతో కట్టివేయుట కాతడు చేసిన దొంగతనమేమి? కావున నట్లు చేయుట తెలివితక్కువతనము, దంభము తప్ప మఱేమియు కాదు. ఎల్లవేళల నెడబాయని ఆత్మలింగము ఉండగా దాని నేల పూజింపరు? అని వేమన యడుగుచున్నాడు.

సర్వజ్ఞుడు :

"కట్టలూ బిడలు శివ బట్టలవ కద్దనే!
కట్టలూ బేడ బిడ బేడ 'కణ్ణు మన
కట్టిదరె సాకు సర్వజ్ఞ."

వేమన్న చెప్పినట్లే చెప్పి సర్వజ్ఞుడు కంటిని, మనస్సును నిగ్ర హించిననే చాలునని చెప్పెను.

వేమన్న :

"ధనము కూడఁబెట్టి ధర్మంబు సేయక
తాను లెస్స దినక దాఁచు లోభి;
తేనె నీఁగ గూర్చి తెరువరి కియ్యదా...

ఇదే భావమును సర్వజ్ఞు డిట్లు చెప్పెను

"కొట్టుంబ కాలదవి కొట్టుణలి కటియదె
హుట్టులిన ఒళగె జేనిక్కి-పరరింగె
బిట్టు హోవంతె సర్వజ్ఞ."

వేమన్న :

"దేహమందు నున్న దేవునిఁ దెలియక
తీర్థవాసులంచుఁ దెలియువారు
గంధతరువు మోయు గాడిదచందంబు..."

తన శరీరమునందు నున్న ఆత్మరూపమైన భగవంతుని తెలిసికొనలేక తీర్థముల వెంబడి తిరుగువారు చందనవృక్షమును మోయు గాడిదవంటివారని వేమన భావము.

సర్వజ్ఞుడు :

"ఎత్తు గాణవ హొత్తు సుత్తి బందరేను
చిత్తదలి శివన నెనెయదె దేశవను
సుత్తిఫలవేను ? సర్వజ్ఞ,"

ఎద్దు దినమంతయు గానుగను చుట్టును. దానివలన ఫల మేమి? చిత్తమున శివుని స్మరింపక తీర్థయాత్రలని దేశమంతయు తిరిగి వచ్చినను ప్రయోజనము లేదు.

ఈ విధముగా పోలికలు గల పద్యములు మఱి కొన్ని కలవు.

# వేమన్న సర్వజ్ఞుల
# తాత్త్విక సిద్ధాంతములు

ఈ సృష్టి స్థితి లయములకు హేతు వేది? మానవుని సుఖ దుఃఖములకు కారణ మేది? జీవులకు పునర్జన్మ కలదా? జీవిత ప్రయోజన మేమి? వీనిని గూర్చి మానవుడు మృగములనుండి వేత్తై నాగరికుడైన నాటినుండి ఆలోచింపదొడగెను. ఆ యాలోచన ఇంతవఱకు తేలలేదు. ఆ సందేహ నివృత్తికొఱకే విశ్వమానవ ప్రపంచ మంతటను ఆ యా యుగములలో, ఆ యా కాలములయందు వివిధమతములు, అనేక విధములైన తాత్త్విక సిద్ధాంతములు ఆవిర్భవించినవి.

మతములు ఒక ప్రత్యేకమైన ప్రయోజనమును ఆకాంక్షించి స్థాపింపబడినవి. కాగా రాను రాను కాలము గడిచిన కొలది అవి ఆకాంక్షించిన ప్రయోజనమునకు దూరమై, దురహంకార దురభిమాన మూర్ఖత్వములకు నిలయములైనవి. మతము పేర మారణ హోమములెన్నియో జరిగినవి. మన భారతదేశ చరిత్రలోనే కాక విశ్వమానవచరిత్రయం దంతటను మత యుద్ధములు చెలరేగి మానవ సమాజమును నిర్దాక్షిణ్యముగా భస్మీపటల మొనర్చిన భయంకర ఘట్టములు లెక్కలేనన్ని కలవు. సహృదయులు, సమన్వయభావులు, సంస్కృతీపరులు, సమ్యగ్దృష్టి గల మహాపురుషులు కొందఱు ఆ యా కాలములలో అవతరించిరి. వారు ఆ యా మత తాత్త్విక సిద్ధాంతము లకు కట్టువడినవారై యుండియు వాని దురభిమానములకు లోనుగాక మానవుని పురోగమనమునకు తోడ్పడు నైతిక సిద్ధాంతములను ప్రవచించుచు, ధర్మములను బోధించుచు సామరస్య సంస్కారభావ ములతో, సమాజాభివృద్ధికి అవిరళ కృషి సల్పియుండిరి. అట్టి మహా వ్యక్తులలోని వారే మన వేమన్న సర్వజ్ఞులు.

వేమన్న సర్వజ్ఞుల కాలములందు ఆంధ్ర కర్ణాటక దేశము లందు వ్యాప్తిలో నుండిన ముఖ్యమైన మత సిద్ధాంతములు రెండు- ద్వైతము, అద్వైతము.

ద్వైతము :

ఈశ్వరుడు సకల చరాచర ప్రపంచమును వినోదమునకై సృజించి, పెంచి, తన కిష్టము వచ్చినప్పుడు సమయించును. ఆ సృష్టి కర్త నారాధించి ప్రసన్నుని చేసికొనిన, దయానిధియైన ఆతడు తన లీలారూపమైన సృష్టియందలి బంధములనుండి విముక్తి ప్రసాదించి మనలను తనయొద్ద శాశ్వతముగా నుంచుకొనుననియు, అదే మోక్ష మనియు సగుణ బ్రహ్మవాదులైన ద్వైతుల సిద్ధాంతము.

అద్వైతము :

అద్వైతమనగా రెండవది లేనిదని యర్థము. సత్యజ్ఞానా నందాత్మకము, పరిణామాతీతము, వికార విరహితము, అఖండము, నిర్దోషము, సర్వ వ్యాపకమునైన బ్రహ్మ మను సత్యపదార్థము తప్ప మఱియొకటి లేదని ఈ మత సిద్ధాంతము. అద్వైత మతమునందు ఈ సత్యము పారమార్థికమనియు, వ్యావహారిక మనియు, ప్రాతిభాసిక మనియు మూడు విధములు. మాయ అని చెప్పబడు అవిద్య (అజ్ఞానము) జీవులను చీకటివలె ఆవహించి ప్రపంచమునందు భేద భావము కలిగించుననియు, ఈ భేదభావమే నరక హేతువనియు వీరి వాదము. త్రాటిని చూచి పాము అనుకొని భయపడినప్పుడు ఆ భ్రాంతిని నివారింపనంతవఱకు భయ మెట్లు తీరదో, అట్లే లౌకిక వ్యవహారములయందు మాత్రమే సత్యముగా కనుపించు అవిద్యను తొలగింపనంతవఱకు పారమార్థిక సత్యము గోచరింపదు. కనుక మోక్షము లభింపదని తాత్పర్యము.

దృశ్యమానమైన బహిరంతర ప్రపంచము అనిత్యమని నిర్ణ యించి అద్వైతులు రూపనామ రహితమైన నిర్గుణ బ్రహ్మమును ఆశ్రయింతురు. అద్వైత మతమునందు సగుణ నిర్గుణములకు నిజమైన ఉపాధిభేదము లేకపోయినను, సగుణోపాసకులకు ప్రారబ్ధకర్మము ననుసరించి జనన మరణము లుండుననియు, నిర్గుణోపాసకులకు

సాయుజ్య మోక్షమే తప్ప జన్మమరణము లుండవనియు నిర్దేశింప బడినది. అందుచేత మనస్సును లయముచేసి, నిర్గుణ బ్రహ్మమును ఆరాధించుటయే ఉత్తమపథమని ఆచార్యులు బోధించిరి.

ఇట్టి నిర్గుణతత్త్వము స్వాధీనమనస్కులైన మహాపురుషులకే తప్ప సామాన్య మానవులకు ఆచరణీయమైన అంశము కాదు. లౌకిక జీవితమునందు నిత్యము ఎదురగుచుండు కష్టనష్టములు, రాగ విరాగములు, సుఖదుఃఖములు మొదలైన ద్వంద్వ భావములనుండి విముక్తి పొందుట సాధ్యముకాదనియు, దీనికై చాల ఓర్పు, దృఢత్వము కావలెననియు ఆచార్యులు గుర్తింపకపోలేదు. కనుక మనస్సునకు ఏకాగ్రతను కల్పించుటకై మొదట సగుణమగు వస్తువు నుపాసింపవలెననియు, అట్లు ఆ వస్తువును ఒక సర్వ సద్గుణ సంపూర్ణునిగా ధ్యానించుచుండిన కొన్నాళ్ళకు ఆ ధ్యానము నిర్గుణోపాసనకు మార్గము చూపుననియు, సగుణోపాసన లేనిదే నిర్గుణోపాసన సాధ్యము కాదనియు అద్వైతులు తలచిరి.

ఈ అద్వైతమునందు అనేక భేదములు పొడసూపినవి. కాని మన దేశమున మాత్రము ముఖ్యమైనవి మూడు. అవి 1. శ్రీవైష్ణవము, 2. వీరశైవము, 3. శాంకరము (శంకరాచార్యుల సిద్ధాంతము)

వైష్ణవ సిద్ధాంతమనగా ( రామానుజార్యుల సిద్ధాంతమని చెప్పవలెను.

ఈ ప్రపంచము భగవంతునినుండియే సృజింపబడినది కావున 'ఇది, మట్టితో చేయబడిన కుండ మట్టికన్న ఎట్లు వేఱుకాదో' ఆ విధముగనే భగవంతునికంటె సృష్టి వేఱుకాదని చెప్పుచు దీనికి విశిష్టాద్వైతమని పేరు పెట్టినను, ఇది ముక్తియందు జీవుడు వేఱు దేవుడు వేఱని చెప్పుటచేత దీనిని ద్వైతమనియే చెప్పవలెను.

వీరశైవము :-

వీరశైవము విశిష్టాద్వైతముకంటె ముఖ్య తత్త్వము

లందెక్కువ భేదము లేకున్నను మోక్షావస్థయందు శివునితో సాయుజ్యమును చెప్పుచు జీవబ్రహ్మల కైక్యము నిది విశిష్టాద్వైతము కన్న నెక్కుడుగా నంగీకరించినది.

శంకరాద్వైతము:-

మోక్షస్థితిలో మాయా జనితమైన జ్ఞానము నిత్య శుద్ధబుద్ధమైన బ్రహ్మ స్వరూపము మాత్రము నిలుచునని చెప్పుచున్నది. అద్వైతానుభవము విషయమున రామానుజ శంకరుల నడుమనున్నవారు వీర శైవులు. భక్తియే జీవునకు శివునితోడ సాయుజ్యమును కలుగ జేయును. అదే ముక్తి.

ఈ శంకరుని అద్వైతమతము మేధావుల నెక్కుడుగా నాకర్షించినది. బసవేశ్వరుని వీరశైవము సామాన్య ప్రజలలో నెక్కువగా వ్యాప్తిపొందినది. రామానుజుని మతము కూడ సామాన్య ప్రజల నాకర్షించినది. వీరశైవ, వైష్ణవమత స్వీకరణకు జాతి కులభేదములు లేవు, కనుక నిమ్నజాతులవారు కూడ ఈ రెండు మతములను స్వీకరించి సంఘములో కొంత గౌరవమును సంపాదించిరి.

వేమన వీరశైవ మతమున పుట్టి సంసార సుఖదుఃఖముల నన్నింటిని అనుభవించి రసవాద సంబంధమున శివయోగుల సహవాసముతో సంసారమునందు విరక్తుడై హఠయోగమును సాధించి ఆ తరువాత రాజ యోగాదికములను అభ్యసించి, హరి హరాది సగుణోపాసకుడై బ్రహ్మ సాయుజ్యరూపమగు అద్వైతము ననుభవించి జీవన్ముక్తుడైనట్లు వేమన చరిత్రమును వ్రాసిన శ్రీ వంగూరి సుబ్బారావు, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొదలగువారు ఊహించిరి. ఈ యూహలకు వేమననుగూర్చి వ్రాయబడిన కథలు, వేమన పద్యములు ప్రబలకారణమని వేఱుగా చెప్పనవసరము లేదు.

సర్వజ్ఞునిగూర్చి కూడ కన్నడపండితులు పలువురు ఈ విధముగా ఊహించిరి. "సర్వజ్ఞుడు చిన్నతనమునందే తల్లిదండ్రులను

కోల్పోయి ఇల్లు వదలి ఊరూరు తిరుగుచు గొప్ప లోకజ్ఞానమును సంపాదించి, తరువాత నొక వేశ్యతో సంబంధము కలిగియుండి పిమ్మట విరక్తిచెంది, బసవేశ్వర ప్రతిపాదితమైన లింగధారి వీరశైవ దీక్షను పొంది శివయోగుల సహవాసముతో గొప్ప బ్రహ్మజ్ఞానమును సంపాదించెను. ఆ శివయోగులలో నెవరో యొకరు ఈతనిని లింగాయతునిగా మార్చి యోగమార్గము నుపదేశించినట్లును, తుదకు కాలజ్ఞాని యైనట్లును ఊహించిరి. ఈ ఊహాలు కూడ వేమన్నను గురించి ఊహించిన యూహాలవంటివే. వీరిరువురి పద్యములలో ఇతర కవులచే రచింపబడిన పద్యములు అసంఖ్యాకముగా చేరుటవలన దిక్కుతెన్ను తోచక ఆ పద్యముల ననుసరించి ఈ విధమైన కథలను కల్పించిరి. ఈ యూహాలన్నియు నొకప్రక్కనిడి మనము సత్య దృష్టితో పరికింపవలెను.

ఈ ఇరువురి కవిత్వమున పలుతావులందు శివశబ్దము తాండవ మాడుచుండుటవలన వీరిపై బసవేశ్వర వీరశైవ ప్రభావమున్నట్లు మన మూహింపవచ్చును. వేమన్నకన్న సర్వజ్ఞుని వచనములందు ఈ ప్రభావము ఎక్కువగా కానవచ్చుచున్నది. ఈతని కవిత్వము పరము, తత్త్వము, సాధనము, యోగము మొదలగు శివయోగుల భాషతో నలరారుచుండును. వీరిరువురును మొత్తము పైని ఏకేశ్వరోపాసకులని వారి పద్యములే మనకు స్పష్టము చేయుచున్నవి.*

---

* "పసులవన్నె వేఱు...దైవంబదొక్కటి."
"ఒబ్బనల్లదె జగకె ఇబ్బరుంటె మత్తె
.............................
ఒబ్బనే దేవ సర్వజ్ఞ."
మున్నగు పద్యములు చూడనగును.

వేమన్న సర్వజ్ఞుల కాలమున శైవ వైష్ణవ మతములు దురభిమానమునకు, వంచనకు లోనై ప్రజలను వక్రమార్గములలో పెట్టుచుండెను. బ్రాహ్మణులు నిజముగా తాము భూలోకదేవతలమనియే

భావించుచుండిరి. వైష్ణవులు సాక్షాత్తు ఆది విష్ణువు అవతారములమని తలంచుచుండిరి. జంగాలు తాము పరమశివులమనియే విజృంభించు చుండిరి. కావిబట్టలు కట్టిన మాత్రమున నందఱు తమ్ము గొలువ వలయుననియు, కాదన్నవారు పండితులగుదురనియు భావించు చుండిరి. ఈ మత దురహంకారలను, దుర్మార్గచర్యలను దుయ్యబట్టి దిక్కుతెన్ను తోచని అమాయక ప్రజలను సమ్యక్ మార్గమున నడపిన సహృదయాగ్రగణ్యులు వేమన్న సర్వజ్ఞులు.

వీరిది చాలవఱకు ప్రత్యక్ష వేదాంతము. (Practical Philosophy ప్రజల దైనందిన జీవితమునకు సంబంధించిన సమస్యలే వీరి సమస్యలు. మానవత్వమే వీరి సిద్ధాంతము. మానవుడు తన శక్తి సామర్థ్యము లతో, ధర్మబుద్ధితో, న్యాయదృష్టితో, దయాదాక్షిణ్యాది గుణ విశేషములతో ఉత్తమ సమాజమును నిర్మించుకొని, సుఖశాంతులతో మనుటయే వీరి జీవిత ధ్యేయము. దీనికొఱకై ఈ మహాపురుషులు అవిరళకృషి సల్పి జీవితములను ధన్యమొనర్చుకొనిరి.

# ఆంధ్ర కర్ణాటక సాహిత్య సరస్వతికి
# వీరి కానుకలు

(1) ఈ కవిసోదరులు లలిత మధురమైన ప్రజాభాషలో కావ్యరచన చేసి, అక్షరాస్యులైన ప్రజానీకమునకు కావ్యామృత రసపానమును కలిగించిరి. వీరికి పూర్వమున నున్నవారు పండిత కవులు (పురాణ-ప్రబంధకవులు) వారు రచియించిన కావ్యము లన్నియు భాషా సారస్వతములలో ప్రవేశ మున్నవారికి తప్ప జన సామాన్యమునకు అందుబాటులో లేవు. వీరు ఆ సమస్యను పోగొట్టి క్రొత్త జనతా మార్గమును సృష్టించిరి. ఆంధ్ర కర్ణాటక భాషా సాహిత్యములు వీరి కృషి ఫలితముగ సామాన్య ప్రజల కందుబాటు లోనికి వచ్చినవి.

(2) వీరు తమ జనతా మార్గమున కనుకూలమగు ఛందస్సునే చేపట్టిరి. వేమన్న ఆటవెలది చేపట్టగా, సర్వజ్ఞుడు త్రిపదిని గ్రహించెను. ఈ రెండును ప్రజాజీవితములో పెనవేసికొనిన అసలు సిసలైన దేశీయచ్ఛందములు.

(3) పురాణ ప్రబంధ కవులవలె వీరు ప్రౌఢాలంకారముల జోలికి పోలేదు. వీరి సహజధోరణి కడ్డుతగలనివి, వీరి మనోవేగము నాపనివియు, వీరి భావతీవ్రతను ఎదురించనివియు, కృత్రిమములు కానివియునగు ఉపమ, దృష్టాంతము మున్నగు అలంకారములను వాడిరి. వేమన్న ఉపమలు, దృష్టాంతములు చాల ప్రసిద్ధిగాంచినవి. సర్వజ్ఞుని ప్రకృతివర్ణన, దృష్టాంతములు అత్యంత మనోహారములు.

(4) వీరి కవిత్వము రామణీయకతకు పుట్టినిల్లు. అభ్యుదయ భావులైన సహృదయుల హృదయ కమలములకు సూర్యోదయములు. స్పష్టత, పరిపూర్ణత సంగ్రహశక్తి, భావ తీవ్రత-వీరి కవిత్వమునకు ప్రత్యేక లక్షణములు.

(5) మన భారతీయ సాహిత్యము మత ప్రచారముకొఱకు వ్రాసిన సాహిత్యమనియు, రామాయణ, భారత, భాగవతాది కథలు

తప్ప సాహిత్యమేమియు లేదనియు పాశ్చాత్య పండితులు పలువురు చెప్పుట కద్దు. వీరి అభిప్రాయము అంత సమంజసము కాదనియు మతమునకు ఏ విధమైన సంబంధము లేని సాహిత్యము కూడ మాకు కొల్లలుగా నున్నదనియు ఋజువు చేసిన మహానుభావులీ ప్రగతి శీలురైన ప్రజాకవులు. ఒక విధముగా వీరు పాశ్చాత్యపండితుల విమర్శ నుండి మన సాహిత్య సరస్వతికి విముక్తి కలిగించిన ధన్యాత్ములని చెప్పవచ్చును.

(6) పూర్వ సంప్రదాయ కవులలో లేని పై విశేషములే గాక, ఈ మహాపురుషుల కవితా సాగరమున ఇంక ఎన్నియో అనర్ఘ రత్నములు మనకు లభ్యమగుచున్నవి. వీరు, నైతిక జీవనమును గూర్చియు, సాంఘిక న్యాయరక్షణకొఱకును, ప్రజలు తార్కిక దృష్టిని పెంపొందింపజేసికొనుటకును అవిరళకృషి సల్పిన సంస్కారభావులు. జాతి కుల మత విభేదరహిత నాగరిక సమాజ నిర్మాణము వీరి జీవితమునకు ధ్యేయము.

ఈ విధమున ఈ సంస్కార హృదయులు ఆంధ్ర కర్ణాటక కవితామతల్లులకు అమూల్యములైన కానుక లొసగి, వారి జీవితములను, చరితార్థము చేసికొనిరి.

వళ్లువరు తమిళ సాహిత్య ప్రపంచమున మానవతావాదియైన మహాకవి. ఇతడు క్రీ. పూ. రెండవ శతాబ్దిలో నుండినవాడని చాల మంది పండితుల అభిప్రాయము. ఈతని జన్మస్థలము, కులము, మతము, వృత్తి మొదలైనవానినిగురించి కూడ పండితలోకమున అభిప్రాయభేదములు కలవు. ఇప్పటికిని ఈ వివాదము తేలలేదు.

వళ్ళువరు చెన్నపట్టణములోని మైలాపూరులో నున్న భగవంతుడను బ్రాహ్మణునకు, మఱొక బ్రాహ్మణ కుటుంబమున పెంపుడు బిడ్డగా పెరుగుచున్న 'ఆది' అను పేరు గల మాతెతకు జన్మించినట్లు ఒక కథ. ఈ కథకు నిదర్శనముగా వళ్లువరు ఆలయ మొకటి మైలాపూరులో నిర్మింపబడియున్నది. ఆతని దైవప్రార్థనకు-జన్మమునకు కూడ ఈ సందర్భము ముడిపెట్టబడియున్నది.

''అగరం ముదల ఎళుత్తు, ఎల్లాం
ఆది బగవన్ ముదట్రే ఉలగు''

అక్షర ప్రపంచము అకారముతో ఆరంభమైనట్లు ఈ ప్రపంచమునకు భగవంతుడే ఆద్యుడని దైవపరమగు భావము. దీనిలోనే యతని మాతాపితల స్తుతికూడ ఇమిడియున్నదని పలువురి అభిప్రాయము.

కులము

వళ్లువరు అనగా పూర్వకాలమున గజముపై నెక్కి నగారా ప్రమోగించుచు రాజాజ్ఞను ప్రజల కెఱిగించు ఒక విధమైన జాతివారని చెప్పుదురు.

ఆదిద్రావిడ జాతులలో పురోహితవృత్తిని చేసికొని జీవితము నడుపువారిని కూడ వళ్లువరు లందురని కొందఱు చెప్పుదురు.

మతము - వృత్తి

ఈతడు శైవుడని కొందఱు, వైష్ణవుడని మఱి కొందఱు భావించు

చున్నారు. 'ఏలేలసంగన్' అను నతని సహాయముతో నేతవృత్తి నాధారముగా చేసికొని, జీవయాత్రను సాగించినట్లు కొందఱు చెప్పె దురు. ఇవన్నియు వేమన్న, సర్వజ్ఞుల కథలకు ఏ విధముగను తీసి పోవు. ఇవన్నియు ఊహాగాన జనితములని తెలిసికొనదగును. మహా పురుషుల జీవితగాథలు చాలవఱకు ఈ విధమైన పుక్కిటి పురాణ ములతో నిండియుండుట మన సాహిత్యమున క్రొత్తది కాదు కదా!

## తిరుక్కుఱళ్

తిరుక్కుఱళ్ అనగా పవిత్రమైన పద్యములని యర్థము. ఇది యొక విధమైన దేశీయచ్ఛందమున రచింపబడినది. ఇంత అందమైన- ఆకర్షకమైన ఛందము ఏ యితర ద్రావిడభాషయందును కనుపింపదు (తెలుగులో ద్విపద, కన్నడములో త్రిపదులను వీనితో కొంతవఱకు సరిపోల్చవచ్చును). ఇందు 1330 కుఱళ్లు కలవు.

తిరుక్కుఱళ్ చక్కగా చెక్కి, తీర్చిదిద్దిన మంజుల శిల్పము. అలతి అలతి పలుకులతో నొప్పిన మృదుమధుర మనోహర కావ్యము. ఈ కావ్యమున ననేక లౌకిక ధర్మములు అత్యంత మృదుమార్గమున వివరింపబడియున్నవి.

## పురుషార్థములు

ఇందు పురుషార్థములనుగూర్చి చక్కగా చెప్పబడెను.

## ధర్మము

ధర్మస్కంధము దైవస్తుతితో ప్రారంభమైనది. ఇందు గృహ స్థుని ధర్మములను గూర్చి విపులముగా చెప్పబడినది. సన్యాసాశ్ర మముకంటె గృహస్థాశ్రమము అత్యంతోత్కృష్టమైనదని వివరింప బడినది.

## అర్థము

భూదేవిని ఎన్ని విధములైనబాధలు పెట్టుచున్నను ఆమె దానిని క్షమించుచున్నది. ఆ విధముగనే మానవుడు క్షమాగుణ

సంపన్నుడు కావలెను. నిరుపేదకు దానము చేయుటయే నిజమైన దానము. ధనవంతునికి దానము చేయుట అది యతనికి అప్పిచ్చినట్లగును. విచక్షణా జ్ఞానముతో దానము చేయవలెను. దానశీలుడైన సజ్జనుని హృదయము గ్రామమధ్యమున నున్న ఫలభరిత వృక్షము వంటిదనెను. ఈ విధముగా దానధర్మములలోని ధర్మస్వరూపమును వివరించెను.

కామము

ఈ ఖండములో ప్రేయసీ ప్రియుల పవిత్ర మధుర జీవితమును గూర్చి విపులముగా వర్ణింపబడినది. వళ్లువరు తన సహధర్మచారిణి నా విధముగా ఆరాధించి యుండవచ్చును. ఈ వర్ణన కొంత అతి మాత్రముగా నున్నదని కొందఱు చెప్పుదురు.

మోక్షమును గూర్చి వళ్లువరు చెప్పలేదు. కారణము తెలియదు.

వళ్లువరు ఒక ఋషివంటివాడు. ఇతడు సమాధి నిష్ఠయందుండి, ఒక క్రమపద్ధతిలో తన కావ్యమును రచించినట్లు తోచుచున్నది. బాధ్యతాయుత నైతిక జీవితమునకు సంబంధించిన ధర్మముల ననేకములను చిన్న చిన్న సూత్రములలో నిమిడ్చి, అత్యంత సులభ మార్గమున బోధించిన బోధక శిఖామణి! తిరుక్కుఱళ్‌ను ఒక్క మాటలో 'సర్వ ధర్మసార సంగ్రహ నీతి కావ్య' మని చెప్పవచ్చును.

వేమన్న, సర్వజ్ఞుల పద్యరచనలు ఒక క్రమపద్ధతిలో లేవు. వీరు ఒకచోట స్థిరముగా కూర్చుండి కావ్యమువలె వ్రాయవలెనని నను కొని వ్రాయలేదు. తిరుక్కుఱళ్ వలె తీర్చిదిద్దిన రచనలు చేసిన వారు కారు. వేమన్న పురుషార్థములనుగూర్చి కాని, గృహస్థాశ్రమ, రాజనీతి ధర్మములనుగూర్చి కాని ఎక్కడను చెప్పలేదు. సర్వజ్ఞుడు మాత్రము పురుషార్థములనుగూర్చి చెప్పి యుండెను. ఏది యెటులున్నను 'వాక్యం రసాత్మకం కావ్య'మ్మను విశ్వనాథుని కావ్య

నిర్వచనము ప్రకారము వీరి రచనలు కూడ కావ్యములే అని చెప్ప వచ్చును.

వేమన్న సర్వజ్ఞులు స్వేచ్ఛాప్రవృత్తి గల ప్రజాకవులు. వీరు పద మిడని తావు గాని, దర్శింపని ప్రదేశముగాని, కలిసికొనని మనుష్యులుగాని, తెలిసికొనని విశేషములు గాని లేవనియే చెప్పవలెను. వీరు కూడ తిరువళ్లువరువలె అత్యంత సులభ సుందర దేశియచ్ఛందము (ఆటవెలది-త్రిపది) లో కవిత్వము చెప్పిరి. వేమన్న కవిత్వము వాస్తవికతకు పట్టుగొమ్మ. భావనాశక్తికి ప్రతిబింబము. ఇతడు కూడ వళ్లువరువలె చిన్న చిన్న పలుకులలో గంభీర భావముల నిమిడ్చి చెప్పుటలో సిద్ధహస్తుడు. సర్వజ్ఞునకు గూడ ఈ శక్తి కలదు.

ఈ ముప్పురి స్వభావములలో, రచనా మార్గములలో, ఉపయోగించిన భాషలో, ధర్మములు బోధించు పద్ధతులలో, విశ్వాసములలో భేద మున్నను వీరి జీవిత ధ్యేయ మొక్కటే. అదే విశ్వ మానవ కల్యాణము-ఈ విషయములో వీరియందు గల పోలికలను పరికింతము :

## ముప్పురు ప్రజాకవులే!

వళ్లువరు అందమైన దేశీయచ్ఛందములో ఆ నాటి సామాన్య ప్రజల భాషలో అలతి అలతి పలుకులలో ప్రజాశ్రేయమే పరమార్థముగా కవిత నల్లెను.

వేమన్న సర్వజ్ఞులు కూడ అత్యంత సులభమైన దేశీయచ్ఛందములో, ప్రజల భాషలో అత్యంత మనోహర రీతిని కవిత్వము చెప్పిరి.

## ముప్పురు ఏకేశ్వరోపాసకులే!

వళ్ళువరు ఏకేశ్వరోపాసకుడని అతని కావ్యమున గల మొదటి పద్యమే మనకు చెప్పుచున్నది.

సృష్టికి కారణభూతుడైన ఆది భగవానుని ఈ విధముగా ఇతడు ప్రార్థించెను–

"అగరమ్ ముదల ఎళుత్తు ఎల్లాం;
ఆది బగవన్ ముదర్రే ఉలగు"

వేమన్న సర్వజ్ఞులు కూడ ఏకేశ్వరోపాసకులే.

వేమన్న :

"పసుల వన్నె వేఱు పాలొక్క వర్ణమే
పుష్పజాతి వేఱు పూజ యొకటి
దర్శనములు వేఱు దైవంబదొక్కటి..."

సర్వజ్ఞుడు :

"ఒబ్బ నల్లదె జగకె ఇబ్బరుంటె మత్తె
ఒబ్బ సర్వజ్ఞ కర్తను జగకెల్ల
ఒబ్బనే దేవ సర్వజ్ఞ."

కులము

మానవజాతి యంతయు నొక్క కులమని వేమన్న సర్వజ్ఞులు చెప్పినట్లు వళ్ళువరు చెప్పలేదు. అట నట కొన్ని కుఱళ్ళు కులమును గూర్చినవి అస్పష్టముగా నున్నవి. ఒకటి మాత్ర మాతడు గట్టిగా చెప్పెను.

పుట్టుకతో సమస్త జనులు సమానులే. వారి వారి పనులను బట్టి భేదము లేర్పడుచున్న వనెను.

అల్పుడు మీద నున్నను (అగ్రజాతిగా నున్నను) గొప్పవాడు కాడు; గొప్పవాడు క్రింద నున్నను (తక్కువజాతిగా నున్నను) అతడు గొప్పవాడే. మానవుని హెచ్చు తక్కువలు వారి ప్రవర్తనపై, శీలముపై ఆధారపడియుండు ననెను.

"జనన మొనయు నన్ని-జనులకు; మేల్మి
ఎనయదు క్రియలలో-నేభేదమగుదు. (కుఱళ్ 972)

"అల్పుండు పైనున్న-నధికుండు కాఁడ
నల్పుండు క్రిందున్న-నల్పుండు కాఁడు (కుఱళ్ 973)

'జన్మనా జాయతే శూద్రః, కర్మణా జాయతే ద్విజః' అను మాటలకు వళ్ళువరు మాటలు దగ్గఱగా నున్నవి.

వేమన్న సర్వజ్ఞులు ఏమి చెప్పిరో విందము :

"కులము హెచ్చు తగ్గు కొదువలు పనిలేదు
సానుజాత మయ్యె సకల కులము
హెచ్చు తగ్గు మాట నెట్లుఉంగఁగ వచ్చు?"

సర్వజ్ఞుడు :

"నడెవు దొంచె భూమి కుడివు దొంచె నీరు
సుడువగ్నియొందె ఇరుతిరలు
కులగోత్ర నడువె యత్తణదు సర్వజ్ఞ."

దైవ సృష్టిలో సకల కులములు తోఁబుట్టువులై సమానమైయుండ ఒకటి పెద్దకులము, ఇంకొకటి చిన్న కులమని యెట్లు చెప్ప వచ్చును? కావున హెచ్చు తగ్గు మాటలు కట్టిపెట్టి మానవులందఱు ఒక కులముగా మనవలెనని ఇతడు కోరెను.

దారిద్ర్యము కంటె భయంకరమైన దింకొకటి లేదని ముప్వురును చెప్పిరి.

ఈ ప్రపంచమున మానవునకు దారిద్ర్యము కంటె భయంకరమైన దింకొకటి లేదు. దానినుండి అతడు తప్పక విముక్తి పొందవలెను అని వళ్ళువరు ఈ విధముగా చెప్పెను :

పేదఱిక మను పాపి ఈ భూలోకమునకు వచ్చి, ఈ లోకమును పరలోకమును రెంటిని నాశనము చేయుచున్నది. అనగా మానవుడు ఆ పాడు దారిద్ర్యమునుండి తన ఐహికాముష్మిక సుఖములను రెంటిని గోల్పోవుచున్నాడని ఇతడు చెప్పెను.

"లేమిమించెడి వంత-లెవియని యడుగ,
లేమివోల్వాలవంత-లేమియ చూడ." (కుఱళ్ 1041)

"లేమిడి యను పాపి-లేశం బిహాముఁ బ
రములను జెందనే-రని రీతి వచ్చు." (కుఱళ్ 1042)

వేమన్న దారిద్ర్యమును దావాగ్నితో పోల్చెను:

"ధనము లేమి యనుట దావానలంబగు
తన్నుఁ జెఱచు మీఱి దాఁపుఁ జెఱచు
ధనము లేమి మదిని దలఁప నె పాపంబు..."

ధనము లేమి యని చెప్పుట దావానలముతో సమానమైనది. దావానలము తన్ను దహించుటయే కాక సమీపించువారిని నాశము చేయును. దారిద్ర్యము మనస్సున తలచినంత మాత్రముననే బాధాకరముగా నుండును. అట్లు తలంచుట పాపమని కూడ చెప్ప వలెను. కావున బుద్ధిమంతుడు 'కృషితో నాస్తి దుర్భిక్షమ్'-అను మాట జ్ఞప్తికి తెచ్చికొని ధన సంపాదనకై పాటుపడవలెను.

ధనవంతులు విచక్షణాదృష్టితో పేదవారికి సహాయపడవలెనని ముగ్గురును కోరిరి.

'ధనవంతులు దయానిధులై విచక్షణాదృష్టితో దానమునకు అర్హులైన పేదవారికి మాత్రము దానము చేయవలెను. అదే నిజమైన పాత్రదానము. తక్కినవారి కిచ్చిన దానము ప్రతిఫల మాశించి యిచ్చిన ట్లగును' అని వళ్ళువరు చెప్పెను.

"దీనులకు నొండు నొసఁగుటే దాన మితర
మతా సకల మెంచు ప్రతినిరీక్ష్యార్థయుతము'
(కుఱళ్ 221)

వేమన్నకూడ వీనినే నొక్కి చెప్పెను.
"వట్టి లేని పేదవారికీ దగు నీవి" అనెను.

తన క్రోధమె తన శత్రువని ముప్వురు నుడివిరి.

మానవుడు తన్ను తాను కాపాడుకోనవలెనన్న అతడు తన కోపమును జయింపవలెను. అట్లు జయింపనివాని నతని కోపమే అతనికి శత్రువయి నాశము చేయునని వళ్ళువరు గట్టిగా చెప్పెను:

"మఱచిపోవలెఁ గోప-మట్టేరికైన;
చెఱుపును కలిగించుఁ-జిట్టాడగాను." (కుఱళ్ 303)

"నగవు సంతోషంబు-నట్టియడంచు
బగ కోపమునకంటెఁ-బర మొండు లేదు." (కుఱళ్ 304)

"తనుఁ దాన గావంగఁ-దమియించుఁ గోప
మును; గావ కున్నడం-బొలిపుచ్చు నదియు. (కుఱళ్ 305)

వేమన్న సర్వజ్ఞులు దీనినే సూటిగా చెప్పిరి:

"కోపమునను ఘనత కొంచెమైపోవును
కోపమునను మిగుల గోడు చెందు
కోప మడఁచెనేని కోరిక లీడేఱు..."

"కోపమెంబదు కేళి పాపద నెరిగట్టు
కోపదాళు నేణు హాఱెదంతె నరకది
కోపి తానిళవ సర్వజ్ఞ"

వళ్ళువరు వేమన్నలు అహింసావాదులు. సర్వజ్ఞనకు అహింసలో నమ్మకము లేదు.

సుకృతకర్మ అనగా నేమి? అదే అహింస. జీవులను హింసింపకుండుటయే అహింస. హింసాకృత్యములవలన మానవుని సుకృతములన్నియు నశించును. సమస్త జనులు భూతదయాపరులై మనవలెను.

తనకు గలిగిన దానిని ఇతర జీవులకు పెట్టి తాను భుజించుట ధర్మములలో కెల్ల శ్రేష్ఠ ధర్మము.

ఒక్కటే స్వయంప్రకాశమానమైన వేదన అది అహింస. దీనికి తర్వాత చెప్పదగినది సత్యము. మంచి మార్గ మేదనిన అదే అహింస.

"కర్జమే-దన యహింస; కొల
కర్మయి తన కర్మం-గావించు నన్ని." (కుఱళ్ 321)
"విభజించి సావడి-వే జీవిం బ్రోత
విభ గ్రాంధి కములలో-వెలయు శిరమయి. (కుఱళ్ 322)
"ఏకమై పొల్చున-దేయు హింసవల
జోకమై పొల్చును-సుమి సత్యవాక్కు." (కుఱళ్ 323)
"మంచి దనంబదు-మార్గమేదనంగ
నెంచుకే జీవిని-హింసింపకునికి." (కుఱళ్ 324)

వేమన్న :

"జీవి జీవిం జంప శివుం జంపుటే యగు
జీవుం డరసి తెలియ శివుఁడు గాఁడె?
భావమందు వేగఁ బరికించి చూడరా...'

"జీవి జీవిం జంప జీవికిం జెప్పంగ
జీవి తాన బలిసి చెలఁగుచుండు
జీవహింసకులకుఁ జిక్కునా మోక్షంబు..."

"చంపఁదగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడుసేయరాదు..."

జీవహింస చేయు కరుణావిహీనులకు మోక్ష మెక్కడది? బద్ధ శత్రువులకు కూడ మేలుచేసి పంపువాడే నిజమైన అహింసావాది అని వేమన్న చెప్పెను.

సర్వజ్ఞుడు మాత్రము ఈ విషయమున ఈ యిరువురతో నేకీభవింపడు. అహింస యన్నదే లోకమున లేదని గట్టిగా చెప్పెను. అతడొకచోట జైనుల అహింసా సిద్ధాంతమును ఖండించుచు అన్న మాటలు చూడనగును :-

"చరజీవవను తిందు చరిసిహుదు జగవర్ధ
చరిసదిహా జీవిగళ తిందు జగవర్ధ
చరిసువుదు నోడ సర్వజ్ఞ."
"జీవ జీవయ తిందు జీవిపదు జగవెల్ల
జీవదింహొరగతిం బవర నాశానె
జీవవే జగవు సర్వజ్ఞ."

ముప్పూరు లౌకిక నీత్యుపదేశకులే.

మానవుడు దయాదాక్షిణ్యములతో పాటు నైతిక సంపద కలిగి, బాధ్యతయే తన పరమధర్మముగా నెంచి సంఘాభివృద్ధికై పాటుపడవలెను. అతడు లోకములో మెలగుటకు కేవలము అతని నైతిక సంపదయే చాలదు. లౌకిక జ్ఞానము కూడ చాల అవసరము. దీనిని గూర్చి వళ్లువరు ఈ క్రింది విధముగా చెప్పెను:

"మేధావులకు ప్రోల-మేధావి వలెన
మేధావు లెడ సుద్ద-మిత్రిక యగుమ." (కురళ్ 714)

సున్నపు గోడకు సున్నము పూసిన అది ఆ గోడలో నెట్లు లీనమై పోవునో ఆ విధముగనే బుద్ధిమంతుడు నీచులతో కలసిమెలసి వారితో లీనమైపోయినట్లుండి తన ప్రత్యేకతను కాపాడుకొనవలెను.

వేమన్న సర్వజ్ఞులు ఈ లౌకిక జ్ఞానమునే అమృత మధుర భావమున నుడివిరి :

"నిజము పలుకువాని నిందించు జగమెల్ల
నిజము లాడరాదు నీచుతోను
నిజమహాత్ము తోడ నిజ మాడవలయురా..."

"కండంతె హేళివరె! కెండవాగువరు భూ
మండల దొళగె కండితవనాదు వర
కండిహుదె కష్ట సర్వజ్ఞ."

ఇట్టి లౌకిక జ్ఞానము మానవునకు అత్యావశ్యకము. ఇది లేని నాడు అతడు సమాజములో మెలగుట చాల కష్టము. అడుగడుగున నతనికి చిక్కులు సంభవించును.

ఈ విధముగ ఈ ప్రజాకవులు అనేక విషయములందు సన్నిహితులై అలరారుచున్నారు.

తిరుక్కుఱళ్ చాల కాలము క్రితమే లాటిన్ భాష లోనికి, తరువాత జర్మన్, ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలలోనికి అనువదింపబడినది. ఇతర భారతీయ భాషలలోనికి విరివిగా అనువదింపబడినది. తెలుగులో శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డి, శ్రీ కె. వి. యస్, విద్యానాథులు, డా॥ చల్లా రాధాకృష్ణశర్మ మొదలగు సహృదయులైన పండితులు దీనిలోని వెల్గులు వెలార్చి లోకోపకారము చేసిరి.

తమిళనాడు మూడు విశ్వవిద్యాలయములయందును దీనిపై ప్రత్యేకమైన పరిశోధన జరుగుచుండుట ముదావహము. తిరువళ్ళు

వరు మానవతావాదులైన భారతీయ కవులలో నొకడుగా తమిళ మహాకవులలో మహనీయ మూర్తిగా పేరెన్నిక గన్నవాడు. ఈ మహాపురుషుడు తమిళ నాగరికతా సంస్కృతులకు ప్రతిబింబమై నిలిచెను.

కుఱళ్ అనువాదములు కొన్ని శ్రీ విద్యానంద డా॥ రామలింగాచార్యగారి గ్రంథమునుండి గ్రహింపబడినవి.

హిందీ సాహిత్య చరిత్రలో కబీరునకు యుగకర్తగా ఒక మహోన్నత స్థానము కలదు. ఈ మహానుభావుడు గొప్ప సంఘ సంస్కర్తగా, మానవతావాదిగా, ప్రజాకవిగా పేరు గాంచెను. ఈతడు క్రీ॥ శ॥ 15 వ శతాబ్దిలో జీవించియున్నట్లు తెలిసికొను చున్నాము.

కబీరు నివసించు కాలమున ఉత్తర భారతము హిందూ మహమ్మదీయ మత వైషమ్యములతో మండుచుండెను. మహమ్మదీయులు హిందూమతమును ద్వేషించుటయేగాక హిందువులను నానా హింసలు పెట్టుచుండిరి. హిందువులుకూడ అసహనశీలురై మహమ్మదీయులను 'మ్లేచ్ఛులనియు, అంటరానివారనియు, గాఢముగ ద్వేషించుచుం డిరి. సంఘము పరస్పర విద్వేషములతో అల్లకల్లోలముగ నుండెను. ప్రజలకు శాంతిభద్రతలు లేకుండెను.

పరస్పర ద్వేషములతోకూడ ప్రజలు మూఢవిశ్వాసములలో మునిగియుండిరి. దానిని సదవకాశముగ తీసికొని కుహావాసన్యాసులు, బూటకపు మతగురువులు, దొంగమాలీలు దోపిడిగాండ్రవలె ప్రజ లను వక్రమార్గ గతులుగా జేయుచుండిరి. దిక్కు తెన్ను తోచక జనులు నానావస్థలు పడుచుండిరి. మానవత్వమే మంట గలిసెనా ? అన్నట్లు ఆనాటి సమాజ ముండెను.

హిందూ మహమ్మదీయులలో సరియైన ఐక్యభావ మేర్పడు టకును, ప్రజలు మూఢవిశ్వాసములనుండి విముక్తిగాంచుటకును, కాలుష్య భూయిష్ఠమైన సమాజము నుద్ధరించుటకును ఒక మహాపురు షుడు కావలెను. లేనినాడు సమాజమునకు మోక్షము లేదు. దాని కొఱకై పుట్టెనా అన్నట్లు మహానుభావుడైన కబీరు ఆ శతాబ్దిలో నవతరించెను.

## కబీరు జన్మవృత్తాంతము

వేమన్న, సర్వజ్ఞ వళ్లువరు జన్మవృత్తాంతమువలె కబీరు జన్మ వృత్తాంతము కూడ పిచ్చికథలతో విచిత్రముగ నుండును.

కబీరు రామానందుని శిష్యుడని ప్రతీతి. ఆయనతో ముడి పెట్టిన కబీరు జన్మవృత్తాంత మొకటి కలదు.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు వివేకభ్రష్టురాలైన తన కుమార్తెను తీసికొని రామానందుని సన్నిధికి వెళ్ళి, ఆతని పాదములపై పడెనట. రామానందుడు ఆమెపయి దయాదృష్టులను ప్రసరించి 'పుత్రవతీభవ' అని ఆశీర్వదించెనట. ఆ యాశీర్వాదమాహాత్మ్యమున ఆమె గర్భము ధరించి ఒక మగశిశువును కనెనట. కాని లోక మామెను కులటగ నిందించునేమో అను భయమున ఆమె ఆ శిశువును 'లహర్ తాలాబ్' అను తటాకతీరమున విడచి వెళ్ళిపోయెనట. ఆ దారిని పోవుచున్న మహమ్మదీయ దంపతులు 'నీరూ, నీమా' అను వారు ఆ శిశువును చూచి, దగ్గరకు తీసికొని అత్యంతాప్యాయముగా పెంచి పెద్దచేసిరట! ఆ ప్రేమ ఫలమే మన కబీరట.

పై కథలో చెప్పబడిన రామానందుడు కబీరునకు సమకాలికుడను సంగతిని డా॥ భండార్కర్ మున్నగు విద్వాంసులు నిరాకరించిరి. ఈ రామానందుడు క్రీ॥ శ॥ 1298 లో జన్మించెనని గ్రియర్సన్ పండితుని అభిప్రాయము.

కబీరు జన్మ వృత్తాంతమునుగూర్చి ఇంకొక కథ చూడ నగును.

ఈతడొక బ్రాహ్మణ వితంతువునకు జన్మించినవాడని, తండ్రి యెవరో తెలియనందున లోకాపవాదమునకు వెఱచి తల్లి ఈతనిని విడిచి వెళ్ళిపోగా, నేతపని వృత్తి కల నీరూ, నీమా అను మహ్మ

దీయ దంపతులు ఆ శిశువును కాపాడి పెంచి పెద్దచేసిరట. ఇతడే మన కబీరు.

మరియొక కథ

ఒకరోజు అశానందుడను స్వామి ''లాహర్ తాలాబ్''లో ఒక విచిత్రమైన జ్యోతిని చూచెనట. వెంటనే అతడు రామానందుని కడకు వెళ్ళి దానినిగూర్చి చెప్పెనట. రామానందు డత్యంతానంద ముతో విశ్వకల్యాణ సంధాయకుడైన బాలు డొకడు ఉదయింపగల డని చెప్పెనట. ఆ బాలుడే మన కబీరట.

అంతియే కాక కబీరు అనుపేరు తల్లిదండ్రులు పెట్టినది కాదని, ఆ నామకరణము చేసినది ఒక కాజీ అని తెలియుచున్నది. ఆ కాజీ కబీరునకు పేరిడుటకై ఖురాన్ గ్రంథమును తెఱచి తనకు మొట్ట మొదట కనబడిన ''కబీర్'' అను పేరునే స్థిరపరచెనట. కబీర్ అనగా గొప్ప వ్యక్తియని అర్థము.

ఈ విధముగా నీతనినిగూర్చి విచిత్రమైన కథలు కలవు. ఈ కథలు ఏవి ఎట్లున్నను మొత్తముమీద ఈతడు హిందూ మాత కుదయించి మహ్మదీయ దంపతులచే పెంచబడినట్లు తెలిసికొను చున్నాము. మన పండితులు మహాపురుషులనుగూర్చి ఇట్టి విచిత్ర కథల నల్లుట క్రొత్తయేమియు కాదు కదా!

ఈతని జన్మస్థలము

కబీరు జన్మస్థలమునుగూర్చి కూడ చాల అభిప్రాయ భేద ములు కలవు. ఈతడు మగహర్, కాశీ, వేలహార గ్రామములలో నేదో యొకచోట పుట్టి యుండవచ్చునని పలువురు పండితులు భావించిరి.

## కబీరు కాలము

కబీరు కాలమునుగురించి లెక్కలేనన్ని వాదము లున్నవి. దీనికి తోడు కబీరు పేరు గల వ్యక్తులు పెక్కుమంది యున్నందువ ఈ వాదము లొకదారి తెన్ను లేకుండ సాగినవి. "Kabir and the Kabir Path" అను గ్రంథమున క్రీ॥ శ॥ 1229 నుండి క్రీ॥ శ॥ 1854 వఱకు గల కబీరు నామధేయుల పట్టిక యొకటి ఉన్నది. అందు పేర్కొనబడిన వారిలో 1854 లో మరణించిన షేక్ కబీర్ జులాహా అనునతడే మన కబీరని యొక వాదము కలదు. కబీరు జులాహా (నేతపనివాడు) అని యొక వాద ముండుటయే గాక కబీరు స్వయముగా తాను జులాహానని చెప్పికొనెను. అందుచేత ఈ రెండిటిని ముడిపెట్టు ప్రయత్నము జరిగినది. కబీరు గురువని చెప్పబడు రామానందుడు క్రీ॥ శ॥ 1298 లో జన్మించెనని గ్రియర్సన్ పండితుడు చెప్పియుండుట చేత, దానినిబట్టి కబీరు కాలమును నిర్ణయించుటకు విమర్శకులు ప్రయత్నించిరి. కాని భండార్కర్, మోహన్ సింగ్ మున్నగు పండితులు కబీరు రామానందుని శిష్యుడను వాదమును అంగీకరింప లేదు.

కబీరునుగూర్చిన ప్రస్తావన మొట్టమొదటి సారిగా నాభదాసు రచించిన "భక్తమాల్"లో కనబడుచున్నది. నాభదాసు క్రీ॥ శ॥ 16-వ శతాబ్దిలోనివాడని చరిత్రకారు లూహించిరి. దీనినిబట్టి కబీరు కాలమునకు 16-వ శతాబ్ద పరమావధి యని నిర్ణయింపవచ్చును. కాని భక్తమాల్‌లో చెప్పబడినది మన కబీర్ అని కాని, అది ప్రక్షిప్తము కాదని చెప్పుటకు గాని ఆధారము లేదు. వైష్ణవ భక్తుల చరిత్రములను నోరార వర్ణించిన ఆ గ్రంథమునందు కబీరునుగూర్చి రెండు పంక్తులు మాత్రమే వ్రాయుటకు కారణము తెలియదు. క్రీ॥ శ॥ 15-వ శ॥ నిర్మింపబడిన కబీరు స్మారక చిహ్నములు రెండున్నవి.

కాని ఈ స్మారక చిహ్నముల నిర్మాణకాలము ఊహాగానమే కాని సత్యము కాదని డా॥ రామకుమార్ వర్మగారు భావించిరి. కాగా ఫర్కుమార్ పండితుడు కబీరు పదునాలవ శతాబ్దికి చెందినవాడని, డా॥ గోవింద త్రిగుణాయత్ గారు కబీరు క్రీ॥ శ॥ 1339 లో జన్మించె నని వాదించినారు. డబ్ల్యు. హంటర్ పండితుడు కబీరు జీవిత కాలము 1380–1420 అని నిర్ణయింపగా డా॥ హరప్రసాద్ శాస్త్రిగారు కబీరు క్రీ॥ శ॥ 1398–1518 ల నడిమి కాలమువా డనిరి.

ఈ విధముగా కబీరు చరిత్ర ఒక పురాణగాథగా రూపొంది నది. అతని జనన నిర్యాణ వృత్తాంతములన్నియు అసంభావ్యములైన విచిత్రగాథలతో నిండియున్నవి.

## గురువు

ఈతని గురువు వైష్ణవమత ప్రచారకుడైన రామానందుడని చాలమంది చెప్పుదురు "శేఖ్తలీ" అను మహమ్మదీయుడని కూడ కొందఱు చెప్పుదురు. మొత్తముమీద ఈతడు హిందూ మహమ్మదీయ మత సామరస్య సద్భావములకు ప్రతిబింబమై వెలసిన మహా వ్యక్తి.

కబీరునకు లోయీ, ధనియా (రంజనియా) అను నిరువురు భార్యలుండిరి. లోయీ మొదట ఈతనికి శిష్యురాలుగా నుండి తరు వాత భార్య యైనట్లు చెప్పుదురు.

కబీరుకు కమాల్, నిహాక్ అను నిరువురు పుత్రులు, కమాలీ, నిహాలీ అను నిరువురు పుత్రికలు కలరు. వేమన్న కుటుంబ జీవితము వలెనే ఈతని కుంబ జీవితముకూడ అంత సుఖప్రదముగా జరిగినట్లు లేదు. ఈతడు సదా సాధు సేవా పరాయణుడై, దీనజనబంధువై జీవితమును గడిపినట్లు తెలియుచున్నది. ఇట్టి త్యాగధనుల సంసార జీవితములు చాలవఱకు కష్టములతోనే గడచియున్నట్లు చరిత్రము వలన తెలిసికొనుచున్నాము.

కబీరు గృహస్థాశ్రమ ధర్మమును త్యజించిన విరాగి కాదు. తిరువళ్ళువరువలె గార్హస్థ్యమును ధర్మభావమునకు ఆత్మసాధనకు అవిరోధముగా సమన్వయపఱచి చూపిన నేర్పరి.

ఇతడు సంత్ సంప్రదాయమును ప్రవర్తింపజేసిన యుగపురుషుడు. "సంత్" అనగా పరోపకారి, సాధుశీలుడు అని యర్థము. సంత్ మతమున ఈశ్వరు డొకడే. అతనికి గుణరూపములు లేవు. అతడు సగుణ నిర్గుణముల కతీతుడు. నిరంజనుడు. శాశ్వతుడు.

## కబీరు వ్యక్తిత్వము

కబీరు వ్యక్తిత్వము సమస్త మానవ లోకమునకు ఆదర్శమైనది. ఈతని వ్యక్తిత్వమును మూడు విధములుగా విభజింపవచ్చును. మొదటిది సాధనాత్మక వ్యక్తిత్వము. శారీర, మానసిక, సాధనలద్వారా బ్రహ్మానుభూతిని పొందుట సాధనాత్మక వ్యక్తిత్వమందురు. రెండవది ఈతని భావనాత్మక వ్యక్తిత్వము. ఇది అత్యంత సుకుమారమైనది. దేవుని తల్లిగా, తండ్రిగా, ప్రియునిగా భావించి కీర్తించి ఇతడు తన్మయత్వము పొందుచుండెడివాడు. వైష్ణవ మతము లోని ప్రధాన సాధనమే యిది.

చైతన్యస్వాములవారు, తుకారామ్, మీరా, రామదాసు, త్యాగయ్య మొదలగువారు భావనాత్మక వ్యక్తిత్వప్రదర్శనకు ప్రసిద్ధి గాంచిన మహాపురుషులు. సూఫీ రహస్య వాదమున దేవుని ప్రియారూపమున ఆరాధింతురు. కబీరులో మాత్రము వైష్ణవ సాంప్రదాయము కానవగును.

మూడవది కబీరు సాంఘిక వ్యక్తిత్వము. ఇది చాల గొప్పది. ఈతడు ఆ శతాబ్దమున సాటిలేని సంఘ సంస్కర్తగా పేరుగాంచెను. సంకుచిత జాతి, కుల, మత భేదములు మొదలంట రూపుమాపుటకై అవిరళ కృషి సల్పిన విశుద్ధమానసుడు. భయరహితమైన వాణిలో

హిందూ మహమ్మదీయుల దురాచారములను, దుర్మార్గపు ప్రవర్తనలను, మూఢ విశ్వాసములను విమర్శించెను.

ఈ విషయమున ఈతడు సర్వవిధముల వేమన్న సర్వజ్ఞులకు తోబుట్టువువంటి వాడు. ఈతని మాటలు ఈటె పోటులవలె సూటిగా హృదయమునకు గ్రుచ్చుకొనును. ఆ నాటి ముఖ్యమైన సాంఘిక సమస్య హిందూ మహమ్మదీయ సమస్య. జనులలో సహావమును, సమన్వయ భావదృష్టిని కలిగింపవలెను. రెండు మతములవారు ఎవరికి వారే గొప్పవారమను భావముతో నుండిరి. ఇరు వైపులవారు మూఢ విశ్వాసపు ఊబిలో మునిగి యుండిరి. హిందువుల విగ్రహారాధనలు, దేవతలు వారిపై బడుట, మహమ్మదీయులపై అల్లా పడుట (ఈనాడు కూడ పీర్ల పండుగనాడు మహమ్మదీయులు దేవుడు (అల్లా) వారిమీద పడినట్లు అభినయించి శరీరము మరచి నిప్పులో చిందులు త్రొక్కుచుందురు.) మొదలైనవి ఆ నాటి సామాన్య విషయములు. ఆ మూఢత్వము చూచి కబీరు అత్యంత కోపముతో రెండువైపులవారిని చీవాట్లు పెట్టుచుండెడివాడు. ఈ సంస్కర్త మాటల తీరును మచ్చున కిచ్చట కొంత చూడనగును:-

"మాటి మాటికి తలగొరిగించు కొనెదవు
విషయ వికారమైన మనమునేల కత్తిరింపవు?

వేమన్న:-

వేషభాషలు, కాషాయ వస్త్రములు, బోడి తలలు ఎందులకు?
మీ తలలు బోడులైన మాత్రమున మీ తలపులు బోడులగునా?"

సర్వజ్ఞుడు:-

ఆత్మయందు గల శివుని సేవింపకుండ జ్ఞానహీనులై, విగ్రహములను పూజించుట మ్రొక్కులు చెల్లించుటవలన ఏమి ప్రయోజనము?

జాతిగత ద్వేషమును కబీరు నిరసించుచున్నాడు.

సాధువునుగూర్చి ప్రశ్నింపకుము. నీకు కావలసినది జ్ఞానము. అది అతని నుండి గ్రహింపుము. ఒరగూర్చి చింతింపకుము. కత్తి పదును గూర్చి విచారింపుము.

వేమన సర్వజ్ఞులవలెనే కబీరు కూడ తీర్థసేవలను, యజ్ఞ యాగాదులను, బలులను తీవ్రముగా నిరసించెను. ఈతని మాటలు చూడుడు:

"ఒకడు గోవును చంపును. ఇంకొకడు మేకను చంపును. ఇరువురును జీవులను బలిగొనుటలో సమానులే కదా!"

అని ఈ రీతిగా నితడు హిందూ మహమ్మదీయుల అజ్ఞానమును ఖండించెను. మంత్ర తంత్రములను ఏవగించుకొనెను:

"నామై దేవళ నామై మసజిద్ నామై కైలాస్ మే
నాతో కౌన్ క్రియ-కర్మమే నహీ యోగవైరాగ్ మే"

భగవంతుడు గుడులలో, మసీదులలో, తీర్థస్థలములలో మాత్రమే యుండునని భ్రమింపకుడు. అత డెల్లెడల నుండును. అతనిని వైరాగ్యము చేతనే కానగును. బాహ్యాడంబరముచేత సాధ్యము కాదు - అని కబీరు చెప్పెను.

వేమన్న సర్వజ్ఞులు తీర్థసేవలలోని మూర్ఖత్వమును, యజ్ఞ యాగాదుల, బలులలోని అజ్ఞానమును అనేక విధముల విమర్శించిరి. 'కారుణిక పురుషుడు' మీలో నుండ వారణాసికి పోవుట ఎందుల కనిరి.

హిందూ మహమ్మదీయుల దంభాచారములను, మూఢ విశ్వాసములను గర్హించుచు కబీరు ఇట్లు చెప్పెను:

"ఆసన్ మారి డింభధరి బైఠె,
మన మహా బహుత్ గుమానా।
పీపర్ పాథర్ పూజక్ లాగె,
తీరథ్ గరబ్ భులానా॥
మాలా పహిరే, టోపీ పహరే,
భాల్ తిలక్ అనుమానా।
సాఖై శబ్దై గావత్ భూలై,

ఆతమ్ ఖబరి న జానా॥"

యోగాసనము వేసి విగ్రహములను పూజించుచున్నను మనస్సు ఎక్కడెక్కడనో చరించుచుండును. నొసట బొట్టుపెట్టి, చేతిలో జపమాలను ధరించి, నోరు ఈశ్వరగానము చేయుచున్నను మనస్సు మాత్రము తనలో నున్న పరమాత్మను తెలిసికొనలేక పోవు చున్నది.

వేమన్న :

ఒడలు బడలఁజేసి యోగుల మనువారు
మనసు కల్మషంబు మాన్పలేరు
పుట్టమీఁదఁగొట్ట భుజగంబు చచ్చునా!..."
"జడలు కట్టనేల? సన్న్యాసి కానేల?
ఒడలు విఱుచుకొనెడి యోగమేల!
ముక్తికాంతఁ బట్టి ముద్దాడనే కదా!..."

కబీరు కూడ మానవునిలో మాధవుని దర్శించిన మహాజ్ఞాని యగుటచేత ఱాతి విగ్రహములందు భగవంతు డుండుననుటను నిరసించి ఈ విధముగా పలికెను :

"పాహన్ పూజై హరి మిలైతో మై పూజూఁ పహార్ ।
తాతే యాచాకీ భలీ పీస్, ఖాయ్ సంసార్."

తాతిని పూజించినంత మాత్రముననే భగవంతుడు దర్శన మిచ్చుననుమాట వాస్తవమైనచో నేను పెద్ద పర్వతమునే పూజింతును. నిరుపయోగమైన ఈ తాతి విగ్రహముకంటె, పదుగురి తిండికై పిండి విసరెడి తిరుగలి మేలుకదా!

వేమన్న :

తోలుకడుపులోన దొడ్డవాడుండగ
రాతి గుళ్ళనేల రాశిబోయు
రాయి దేవుడైన రాసులు మ్రింగడా?..."

పుస్తకములందు చెప్పబడినట్లు ఆత్మ తనలోనే యున్నదని యితరులకు బోధింపవచ్చును కాని తానై తెలిసికొనుట కష్టమని వేమన్న ఇటు బోధించెను:

"తనువు లస్థిరమని ధనము లస్థిరమని
తెలుపవచ్చుగాని తెలియలేదు
చెప్పవచ్చు బనులు చేయుట కష్టమా..."

ఇట్లే కబీరు కూడ ఆత్మజ్ఞానమునుగూర్చి ఇట్లు చెప్పెను :

"తేరా సాయి తుఝమే
జ్యోం పహుపన్ మే బాస్।
కస్తూరీ కా మిరగ జ్యోం
ఫిర్ ఫిర్ ఢూంఢే ఘాస్॥"

పూలలోని పరిమళమువలె నీలోనే పరమాత్మ యుండగా నతనిని గుర్తింపక, నాభిలోని కస్తూరికొఱకై గడ్డిలో వెదకు కస్తూరి మృగమువలె ఏల భ్రమ చెందుచున్నావు? అని భావము.

వేమన్న :

"మనసులోని ముక్తి మతియొక్క చోటను
వెదుకఁ బోవువాఁడు వెఱ్ఱివాఁడు
గొఱ్ఱెఁ జంకఁబెట్టి గొల్ల వెదకురీతి..."

కబీరు కొనయూపిరి ఉన్నంతవఱకు అంధ విశ్వాసములను ప్రతిఘటించుచు, వారణాసికి సమీపమున నున్న 'మగహర్' అను స్థలమున నిర్యాణము చెందెను.* నిమ్నజాతుల హృదయకుహరమున ఆశాజ్యోతిని వెలిగించి వివేకవంతులై వారు అంధవిశ్వాసముల నుండి శాశ్వత విముక్తి పొందుటకు తీవ్రముగా కృషిచేసిన ఉత్తమ సంస్కర్త, మానవతావాది ఈ మహాపురుషుడు.

ప్రాంతములు వేఱైనను, భాషలు వేఱైనను, ఆచార సంప్రదాయములు విభిన్నములైనను సంస్కార భావములుతో, మానవతా గుణ విలసనములచేత వేమన్న, సర్వజ్ఞుడు, తిరువళ్ళువరు, కబీరు ఒకే కుటుంబమునకు చెందిన మహాపురుషు లని గట్టిగా చెప్పవలెను.

* కాశీలో చనిపోయినవారు తిన్నగా కైలాసమునకు వెళ్లుదురని, 'మగహర్' స్థలములో నిర్యాణము చెందిన నరకమునకు పోవుదురని ఒక అంధవిశ్వాసము ఆ రోజులలో ప్రచారములో నుండెను. ఆ యంధవిశ్వాసమునే ఖండించుటకే ప్రయత్నపూర్వకముగా కబీరు 'మగహార్' స్థలమున మరణించెను.

# ఆధారగ్రంథములు

| సంఖ్య | గ్రంథము | రచయిత లేక పరిష్కర్త | ప్రచురణ | సంవత్సరం |
|---|---|---|---|---|
| 1 | ఆంధ్రకవి తరంగిణి (సం. 6) | చాగంటి శేషయ్య. | కపిలేశ్వరపురము. తూ॥ గో॥ జిల్లా ఆంధ్రప్రదేశ్. | 1961 |
| 2 | ఆంధ్ర పత్రిక (ఉగాది సంచికలు)<br>క్రోధన<br>అక్షయ<br>రక్తాక్షి | | | |
| 3 | ఆంధ్ర సాహిత్య దర్పణము. | వేదం వేంకటరాయ శాస్త్రి. | | |
| 4 | ఆంధ్ర సాహిత్య పరిషత్ పత్రిక.<br>మార్గశిర - పుష్యములు<br>మాఘ - ఫాల్గుణములు | | | |
| 5 | ఆంధ్ర వాఙ్మయ చరిత్ర. | వంగూరి సుబ్బారావు. | | 1920 |
| 6 | ఆంధ్ర వాఙ్మయ చరిత్ర. | (Rev) నిడుదవోలు వేంకటరావు. | మద్రాసు విశ్వవిద్యాలయము | 1957 |
| 7 | కన్నడనుడి 11, 21. | | | |
| 8 | కన్నడనుడి 4, 42, 47. | | | |

| సంఖ్య | గ్రంథము | రచయిత లేక పరిష్కర్త | ప్రచురణ | సంవత్సరం |
|---|---|---|---|---|
| 9 | కన్నడ సాహిత్య పరిషత్ పత్రిక సం. 7, పుట 86. | | | |
| 10 | కర్ణాటక కవి చరితె. | R. నరసింహాచార్య. | | |
| 11 | కవి కోకిల గ్రంథావళి (సం. 4) | దువ్వూరి. రామిరెడ్డి. | | |
| 12 | కవిత్వ తత్త్వ విచారము. | కట్టమంచి రామలింగారెడ్డి. | ఆంధ్ర విశ్వకళా పరిషత్. | 1913 |
| 13 | కావ్యాలంకార సంగ్రహము. | భట్టుమూర్తి (వ్యాఖ్యాత-సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి) | | |
| 14 | కిన్నెర, జనవరి. | | | 1963 |
| 15 | జయ కర్ణాటక (సం. 15, పుట 176) | | | |
| 16 | జీవన్, డిసెంబరు. | | | 1941 |
| 17 | పోతన, వేమనల యుగము. | దిగవల్లి శివరాంరావు. | | 1921 |
| 18 | ప్రబుద్ధ కర్ణాటక సం. 7-3. | | | |

| సంఖ్య | గ్రంథము | రచయిత లేక పరిష్కర్త | ప్రచురణ | సంవత్సరం |
| --- | --- | --- | --- | --- |
| 19 | భారతి సంపుటములు | | | |
| 20 | మహాకవి వేమన యోగి. | నేదునూరి గంగాధరం (ప) | వి. కృష్ణా డిపో, మద్రాసు. | 1930 |
| 21 | రస గంగాధరము | (అను) జమ్ములమడక మాధవరామ శర్మ | | |
| 22 | వేమన | రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ | ఆంధ్ర విశ్వకళా పరిషత్తు. | 1929<br>1947 |
| 23 | వేమన | వంగూరి. సుబ్బారావు | కమలా కుటీరము, నరసాపూర్ ప॥గో॥ జిల్లా ఆంధ్రప్రదేశ్ | 1922<br>1931<br>1951 |
| 24 | వేమన జ్ఞానమార్గ పద్యములు | | సి. వి. కృష్ణా బుక్ డిపో, మద్రాసు. | 1923 |
| 25 | వేమన చరిత్రము | బండారు | D. బసవనాగయ్య కాకినాడ, శైవసాహితీ గ్రంథమాల. | 1968 |
| 26 | వేమన నీతిపద్య రత్నావళి | | సి. వి. కృష్ణా బుక్ డిపో, మద్రాసు. | 1961 |

| సంఖ్య | గ్రంథము | రచయిత లేక పరిష్కర్త | ప్రచురణ | సంవత్సరం |
|---|---|---|---|---|
| 27 | వేమన పద్యములు సవివరణము (2,720 పద్యములు | | వావిళ్ల రామ స్వామిశాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు. | 1955 |
| 28 | వేమన పద్యములు (5,010 పద్యములు) | నేదునూరి గంగాధరం (సం) | అద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి. | 1960 |
| 29 | వేమన యోగి జీవితము | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి | వావిళ్ల రామ స్వామిశాస్త్రులు అండ్ సన్సు, మద్రాసు. | 1917 |
| 30 | వేమన యోగీంద్ర చరిత్ర | R. పూర్ణయాచార్యులు | మచిలీ పట్నం. | 1913 |
| 31 | వేమన వంటివారు | R. A. కృష్ణ శర్మ | | |
| 32 | వేమన సూక్తి రత్నాకరము (4,035 పద్యములు) | R. పూర్ణయాచార్యులు | మచిలీ పట్నం. | 1913 |
| 33 | శతక కవుల చరిత్రము | వంగూరి సుబ్బారావు (Rev) నిడుదవోలు వేంకట రావు | | 1957 |
| 34 | శతక వాఙ్మయ సర్వస్వము | వేదం వేంకట కృష్ణ శర్మ | మద్రాసు. | 1954 |

| సంఖ్య | గ్రంథము | రచయిత లేక పరిష్కర్త | ప్రచురణ | సంవత్సరం |
|---|---|---|---|---|
| 35 | శరణ చరితామృత | సిద్ధప్ప పౌరాణిక. | | |
| 36 | శరణ సాహిత్య 1_12. | | | |
| 37 | సంక్షిప్త కన్నడ సాహిత్య చరిత్ర | ఆచార్య మరియప్ప భట్. | | 1960 |
| 37A | సమగ్రాంధ్ర సాహిత్యము (సం. 12) | ఆరుద్ర. | యం. శేషాచలం అండ్ కో., మద్రాసు. | 1968 |
| 38 | సర్వజ్ఞ కవి | A. R. కృష్ణశాస్త్రి, M. A. | ప్రచార పుస్తకమాలె, మైసూరు విశ్వ విద్యాలయము. | 1965 |
| 39 | సర్వజ్ఞ కవి జీవన హాగు కావ్య | | కర్ణాటక విశ్వ విద్యాలయము దార్వార్. | 1967 |
| 40 | సర్వజ్ఞ దర్శనము | భీమరాజు. | L. భీమకుమార్ బెంగుళూరు_12. | 1970 |
| 41 | సర్వజ్ఞన అమర సందేశ. | | బిందుమాధవ ధార్వార్. | 1959 |
| 42 | సర్వజ్ఞమూర్తియ వచనగళు | G. M. ఉమాపతి శాస్త్రి, M.A. (ప) | శారదా భవన ప్రకాశన, బగళ్ కోటె. | 1964 |

| సంఖ్య | గ్రంథము | రచయిత లేక పరిష్కర్త | ప్రచురణ | సంవత్సరం |
|---|---|---|---|---|
| 43 | సర్వజ్ఞ వచనగళు | ఉత్తంగి చెన్నప్ప (ప) | మైసూరు ప్రభుత్వ ప్రచురణము. | 1960 |
| 44 | సర్వజ్ఞ వచనగళు | గురురాయుడు (ప) | హుబ్లి. | 1964 |
| 45 | సర్వజ్ఞ వచనగళు | ఆచార్య మరియప్ప భట్. | | 1960 |
| 46 | సర్వజ్ఞుని వచనములు | కలుగోడు, అశ్వత్థ రావు, పీఠిక - డా. బి. రామకృష్ణా రావు. | | 1966 |
| 47 | సాహిత్య మత్తు జీవన కలె. | R. A. కృష్ణశర్మ. | | 1958 |
| 48 | సాహిత్య శిల్ప సమీక్ష | పింగళి లక్ష్మీకాంతం. | | |